# తమిళనాడు జానపద సాహిత్యము, సంస్కృతి

రచన

ఎస్. ఎమ్ ఎల్. లక్ష్మణన్ చెట్టియారు

అనువాదం

ఎస్. నరసింహులు నాయకర్



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా, కొత్త ఢిల్లీ

1982 (Śaka 1904)



*Original Title :* FOLKLORE OF TAMIL NADU *(English)*
*Telugu Translation :* TAMILNADU JANAPADA SAHITYAMU SAMSKRITI

Rs : **13-75**

**PUBLISHED BY THE DIRECTOR, NATIONAL BOOK TRUST, INDIA, AT A-5 GREEN PARK, NEW DELHI-110016, AND PRINTED AT MAHILA PRESS, ANDHRA MAHILA SABHA, VIDYANAGAR, HYDERABAD-500 960.**

# విషయసూచిక

## తమిళనాడు: జానపద సాహిత్యమూ, సంస్కృతీ

# 1 వ అధ్యాయము

### రాష్ట్రము: ప్రజలు

తమిళులు తమదంటూ ఒక ప్రత్యేక ప్రతిపత్తిని సంతరించుకోవటానికి ఆ ప్రాంతపు భౌగోళికస్వరూపమూ మతాచారములూ, గత చరిత్రా-ముఖ్య కారణాలు. ప్రపంచ నలుమూలలనుంచి వాణిజ్యం కోసరం తమ దేశానికి తరుచు రాకపోకలు సాగించిన విదేశీయుల విభిన్న సంస్కృతులను ఆకళించుకుని వారు తమ ప్రత్యేకతను ఇనుమడింప చేసుకున్నారు.

అక్షరాస్యులైన తమిళుల ఆలోచనాసరళీ, గ్రామీణ సాహిత్యమూ, సంస్కృతీ ఇటీవలి కాలంలో పాశ్చాత్య నాగరికతా ప్రభావానికి లోనయినా ఇప్పటికీ వారు తమ ప్రాచీన ఔన్నత్యాన్నీ, పురాతన వైభవాన్నీ తలుచుకొని ఉత్తేజం పొందుతుంటారు. అంతేకాదు, ఎన్నో సనాతన ఆచార వ్యవహారాలు, ఆహార పద్ధతులూ, విలువలూ, ఆలోచనా రీతులూ తమిళ గ్రామీణ ప్రజల దైనందిన జీవితంలో నేటికీ కనిపిస్తూనే ఉన్నాయి. ఇది తమిళ సంస్కృతి ప్రత్యేకతకు ఒక తార్కాణము.

తమిళనాడును భారతదేశంలోని ఇతర ప్రాంతాలతో పోల్చిచూస్తే-ఇక్కడ ప్రకృతి విపరీతాలు అంతగా ఏర్పడలేదు. పటిష్టమైన రాజకీయ వ్యవస్థ, సుస్థిరమైన ఆర్థిక జీవనమూ (ప్రత్యేకించి గ్రామీణప్రాంతాలలో) అనువంశికమైన సంప్రదాయమూ, పూర్వంనించీ నేటిదాకా నిరాఘాటంగా కొనసాగుతున్నాయి. యుగాలు గడిచినా వీరు ఇప్పటికీ ఉదయమూ సాయంత్రమూ దైవప్రార్థన చేస్తున్నారు. నిరాడంబరమైన భోజనం నియమబద్ధంగా తీసు

కుంటారు. వస్త్రధారణలోను ప్రత్యేకించి ఆడవారి చీరకట్టులో - ఎలాంటి మార్పూ రాలేదు.

తమిళంలో "రాముడు ఏలితేనేం? రావణుడు ఏలితేనేం?." (రామన్ ఆండాల్ ఎన్న? రావణన్ ఆండాల్ ఎన్న?) అనే సామెత ఉన్నది. శాంతి యుతంగా కొనసాగే తమిళుల దైనందిన జీవితాన్ని పైన పేర్కొన్న నానుడి ఋజువు చేస్తున్నది. రాజకీయపరంగా వచ్చే మార్పులు గ్రామీణప్రజల సహజీవనంలో ఎట్టి అవకతవకలూ ఏర్పరచలేదు.

## నైసర్గిక స్వరూపము

ఇంచుమించు త్రికోణంలాగా అగుపించే తమిళనాడు భారతదేశపు దక్షిణ భాగంలోని చివరి రాష్ట్రము. ఆసియా ఖండంలో హిందూ మహాసముద్రమును అనుకుని ఉన్న భారత ద్వీపకల్పము ఉనికిని పరిశీలిస్తే - ఉత్తర దిశలో ఆఫ్రికా, అరేబియా, ఆగ్నేయ దిశలో బర్మా, తూర్పుద్వీప సమూహమూ, మరియు ఆస్ట్రేలియా-వీటిమధ్యన ఒక ధనురాకార రేఖ గీస్తే ఆ రేఖకు మధ్య భాగంలో భారత ఉపఖండం చెవి లోలకులాగా వేలాడుతూ కనిపిస్తుంది. శ్రీ పి. సుందరం పిళ్ళై (ప్రొఫెసర్ ఆఫ్ ఫిలాసఫీ కేరళా) భారతదేశము విశ్వ మాతకు నొసలులాగా అమరిందనీ ఆ నొసట్లో తమిళనాడు తిలకంలా మెరుస్తున్నదనీ కవితాత్మకంగా అభివర్ణించాడు.

## సరిహద్దులు

పురాణేతిహాసములలో తమిళ దేశానికి ఉత్తరమున వడవేంకటం(తిరుమల-తిరుపతి) దక్షిణాన కన్యాకుమారి సరిహద్దులుగా పేర్కొన బడినది ఆంధ్ర ప్రదేశ్ అవతరించిన తర్వాత తిరుత్తణి తమిళదేశపు ఉత్తర సరిహద్దు అయింది. తూర్పున బంగాళాఖాతమూ, దక్షిణాన హిందూ మహా సముద్రమూ, పశ్చిమ దిశలో పడమటి కనుమలూ - నేటి తమిళ రాష్ట్రానికి ఇతర సరిహద్దులు, పడమటి కనుమలకు ఉపరిభాగంలో వున్న

ప్రాంతము కొత్తగా ఆవిర్భవించిన కేరళ రాష్ట్రంలో భాగమైంది. తమిళుల అభిమాన దైవం-కుమరన్ (సుబ్రహ్మణ్యుడు) వెలసిన కొండ తిరుత్తణి పట్టణంలో ఉంది. ఆజన్మ బ్రహ్మచారిణి అయిన కన్యాకుమారి నెలకొన్న స్థలం ఆమె పేరుతోనే పిలువబడుతోంది. అంటే తమిళ దేశపు కుమార స్వామి స్థావరమునుంచి కుమారి స్థావరమువరకూ వ్యాపించి వున్నదన్నమాట.

చరిత్ర కందని ప్రాచీనకాలంలోనే తమిళదేశపు దక్షిణ భాగంలో కపటపురం రాజధానిగా పాండ్యులచే పరిపాలింపబడిన ఒక ప్రాంతమూ తెన్‌కుమరి అనే పేరుతో వ్యవహరింపబడిన నదీ-ఉప్పెన వచ్చి సముద్ర గర్భంలో కలిసిపోయిందని ఒక పురాణ గాథ ప్రచారములో వుంది.

## వైశాల్యము

1,29,900 చదరపు కిలో మీటర్ల వైశాల్యముగల తమిళనాడు రమారమి ఇంగ్లాండు దేశమంత విస్తీర్ణం ఉంటుంది. ఈ ప్రాంతపు శీతోష్ణస్థితి విచిత్రంగా ఉంటుంది. సూర్యుడి వేడిమి తీవ్రత మిక్కుటముగాఉన్న రామేశ్వర ద్వీపము ఒట్టి ఇసుకతో నిండిఉంది. హాయిగొలిపే చల్లటి ఆహ్లాదకరమైన ప్రదేశాలయిన నీలగిరి, కొడైకెనాల్ ఈ రాష్ట్రంలోనే ఉన్నాయి.

## పంచవర్గ విభజన

ఆయా ప్రాంతపు స్వరూపము ననుసరించి ప్రాచీన తమిళ కవులు తమ దేశాన్ని ఐదువిభిన్న ప్రదేశాలుగా శ్లాఘించారు. ఈ వర్గీకరణ ప్రాచీన తమిళ కవితలో శాశ్వతంగా కలిసిపోయింది. ఈ ప్రదేశాలు ఆయా ప్రాంతపు జీవన విధానాన్ని ప్రతిబింబించాయి. ఒక్కొక్క ప్రదేశాన్ని ఒక్కొక్క వృక్షజాతి పేరుతో పిలుస్తుండేవారు. అవి (1) కురింజి (కొండ ప్రాంతము) (2) పాలై (ఎడారి) (3) ముల్లై (పచ్చిక బయలు) (4) మరుధం (నదీ ప్రాంతము) మరియు (5) నెయ్‌దల్ (సముద్ర తీరము).

## పర్వతములు

తూర్పు కనుమలు పడమటి కనుమలు తమిళ రాష్ట్రంలో కలుసుకుంటాయి. ఇచ్చట కొండలలోని విహారస్థలములు అన్ని రకాల యాత్రికులనూ ఆకర్షిస్తాయి. ఝల్లు మనిపించే చల్లగాలి కోరేవారికి "భారత దేశపు పర్వత విహార కేంద్రముల రాణి" గా పేరుగాంచిన ఉదక మండలం ఉన్నది. ప్రశాంత వాతావరణాన్ని ఆకాంక్షించే వారికీ కొడైకనాల్ ఉండనే ఉంది. అంతంత మాత్రం డబ్బులున్న వారికీ, గుండెజబ్బు మనుషులకీ నీలగిరుల లోని కూనూరు, కోటగిరి, ఆనమలైలోని టాప్‌స్లిప్, వాల్‌పారై, సేలం సమీపములో ఉన్న పర్కాడు, దక్షిణార్కాటు జిల్లాలోని ఏలగిరి - ఆశ్రయ మిస్తాయి. పైన పేర్కొన్న అన్ని విహారస్థలాల్లోనూ ఉన్ని దుస్తులు అవసరం కానీ "దక్షిణ భారత దేశపు స్పా" అని ప్రఖ్యాతి గాంచిన కుట్రాలంలో మాత్రము మామూలు దుస్తులే చాలు (స్పా అన్నది బెల్జియం దేశంలోని ఒక విహారస్థలము), తమిళనాడులో ఇంచుమించు ప్రతిజిల్లాలోనూ ఒక పర్వత విహార కేంద్రమో, సముద్రతీర స్థలమో తప్పక కనిపిస్తుంది.

పొళ్ళాచ్చి-పాల్‌ఘాట్‌ల మధ్య విస్తరించిన సారవంతమైన పర్వత సానువులూ, కంభం కొండచరియా-పుష్కలమైన వాణిజ్య పంటలకు వాసికెక్కినవి. వాటి సుందర ప్రకృతి దృశ్యాలు కనువిందు చేస్తాయి.

## అడవులు

తమిళనాడులో పేర్కొనదగిన జంతుజాలములలో ఏనుగులు, మనుబోతులు, అడవి పందులూ ముఖ్యమైనవి. ముదుమలై కొండలలోని జంతు స్థావరములో వీటిని చూడవచ్చును. పక్షి స్థావరమైన వేదన్ తాంగల్ వలస వచ్చిన పక్షులకి ముఖ్య కేంద్రము. కొడికాడులోవి చిత్తడి ప్రదేశమయిన పాయింట్ కెల్‌మెరిలో ఎర్రకొంగలూ వర్ణపు కొంగలూ మరియు నీటి కోళ్ళు ఉన్నాయి.

తమిళదేశపు మొక్కల జాతిలో పుష్కరమునకు ఒకసారి మాత్రమే పుష్పించే కురింజి ప్రత్యేకముగా పేర్కొన దగినది, ఇలాగే అత్తి

ప్రాముఖ్యం వహించే ఇంకో వృక్షజాతి చింకోనా. అందులోంచి క్వైనా మందు తీస్తారు. తిరునెల్వేలి జిల్లాలో వేల సంఖ్యలో వ్యాపించిన తాటిచెట్లు సమాజంలోని దళిత వర్గాల ప్రజలకు జీవనోపాధి కలుగజేస్తున్నవి.

మలేషియాలోవలె రబ్బరు పెంపకానికి అనువైన శీతోష్ణస్థితి కలిగిన కన్యాకుమారి జిల్లాలో ఉత్తమజాతి రబ్బరు మొక్కలు సాగుచేస్తున్నారు. నీలగిరి ప్రాంతంలో అడవుల పెంపకం పథకము క్రింద యూకలిప్టస్ మొక్కలు పెంచుతున్నారు. దక్షిణ ఆర్కాటు జిల్లాలోని జావళి కొండ ప్రాంతాలలో గంధపుచెట్లు పెంచుతున్నారు. ఔషధముల తయారీకి పనికివచ్చే మూలికల చెట్లు పళని పర్వత శ్రేణిలోనూ కుట్రాలము వద్దనూ విరివిగా ఉన్నవి.

## నదీ నదాలు

తమిళనాడులోని ఏకైక జీవనది కావేరి. ఈశాన్య నైరుతీ ఋతుపవనముల వల్ల కావేరి నదిలో ఏడాది పొడవునా వర్షపు నీరు ప్రవహిస్తుంది. పడమర నుంచి తూర్పునకు ప్రవహించే కావేరినది తమిళనాడును రెండు సమ భాగాలుగా విడదీస్తున్నది. కావేరికి ఉత్తర దిశలో పాలారు, వడ పెన్నారు నదులూ, దక్షిణ వైపున వైగై, తామ్రపర్ణి నదులూ పారుతున్నాయి. నదీ తీరాలలోనూ జలాశయముల ఒడ్డులలోనూ మత పరంగానూ వాణిజ్య రీత్యానూ ప్రాముఖ్యము వహించే అనేక పట్టణాలు ఏర్పడినాయి. ప్రతిదానికీ ఆసక్తికరమైన స్థల పురాణములున్నాయి.

అందులో ఒక గాథ:— ఒకసారి మధురాంతకం చెరువుగట్టు తెగిపోవడం తప్పదు అని స్థానిక ప్రజల్ని సురక్షిత ప్రాంతాలలోకి తరలిస్తున్న తరుణంలో విల్లు అంబులు దాల్చిన శ్రీరామచంద్రుడు లక్ష్మణ సమేతంగా ప్రత్యక్షమై ఆ చెరువుగట్టు తెగకుండా రక్షించాడట. ఈ సంఘటనను కన్నులారా చూసిన అప్పటి చెంగల్పట్టు కలెక్టర్ (శ్వేత జాతీయుడు) ఆ గ్రామములోని కోదండ రామ ఆలయంలో సీతమ్మకు మండపం కట్టించి అందులో శిలాశాసనము చెక్కించాడు.

ఊరుణి అనే చిన్న చిన్నకొలనులు, త్రాగునీటిని సమకూరుస్తాయి. పెద్ద పెద్ద చెరువులన్న వ్యవసాయానికి ఉపకరిస్తాయి. కొండలలో ప్రకృతి సిద్ధముగా ఏర్పడిన జలాశయములు, మానవ నిర్మితములైన రిజర్వాయర్లు విద్యుచ్ఛక్తి ఉత్పాదనకు దోహదము చేస్తున్నాయి.

## బీడు నేలలు

తిరునెల్వేలి జిల్లాలోని కయమొళి సమీపంలో ఒక ఇసుక మేటు వ్యాపించి వున్నది. దానిని తేరీ అని పిలుస్తారు. ఎడారిలాంటి ఈ బీడు భూమిలో కొంత భాగము ఇప్పుడు వ్యవసాయ క్షేత్రముగా రూపొందుచున్నది. ఎర్రని ఇసుక మేటులో జరుగుతున్న ఈ పచ్చ విప్లవం ముందు తరాల వారికి ఒక ఇతిహాసంగా మిగిలి పోవడం ఖాయం।

## ఓడ రేవులు

క్రీస్తు శకము ప్రారంభ దశలోనే కావేరి పూంపట్టినం ఇంకా ఇతర ఓడ రేవుల్లో వాణిజ్యము ముమ్మరంగా కొనసాగుతుండేది. గ్రీకులు సముద్ర తీరంలో అక్కడక్కడ టంకశాలలు నెలకొల్పి తమిళ దేశంలో కొనుగోలు చేసే వస్తువుల కోసరం నాణ్యాలు ముద్రించి చెల్లిస్తుండే వారు. కొరకై' అధీచనూర్ త్రవ్వకాలలో బయల్పడిన రోమను నాణెములు, సింహళ దస్తావేజులలోని వివరణలూ పురాతత్త్వ పరిశోధనా ఫలితములు, గ్రీకు మరియు హిబ్రూభాషలలో సమ్మిళితమై పోయిన తమిళ పదాలూ పై విషయాన్ని ఋజువు చేస్తున్నాయి.

రోమన్ చక్రవర్తి అయిన అగస్టస్ కొలువులోని ఒక పాండ్యరాజు తన రాజ్యమునిచ్చి ఇద్దరు రాయబారులను పంపాడు. ఈ ఉదంతాన్ని కొన్ని కొన్ని సందర్భాలలో పల్లె ప్రజలు ప్రదర్శించే నాటకాలలో ఉటంకిస్తూ ఉంటారు. ఇచ్చటి గంధపు చెక్కలూ, మిరియాలు, శొంఠి, బియ్యము, ఏలకులు, లవంగము, పసుపు, దంతము, ముత్యాలు, కోరండం (ఒక

తమిళ మణి) మరియు సముద్ర గర్భంలో దొరికే గరుడపచ్చ మున్నగు వాటికి విదేశాలలో మంచి గిరాకీ ఉండేది.

నేడు మద్రాస్ మరియు తూత్తుకుడి ఓడ రేవులు దేశంలో ప్రాముఖ్యము వహిస్తున్నాయి. తమిళ దేశంలో మత్స్య పరిశ్రమ అతి ముఖ్యము కావడం వల్ల చేపలు పట్టేందుకు అనువైన సముద్ర రేవులను కూడా బాగా అభివృద్ధి చేస్తున్నారు.

సముద్రములో లోతుకు చొచ్చుకు వెళ్ళి చేపలు పట్టటంలోనూ నదులలో చేపలు పట్టటంలోనూ, ఆరితేరిన ఇచ్చటి బెస్తలు తమ ప్రత్యేక నైపుణ్యాన్ని ప్రదర్శిస్తారు. పురాతన కాలంలో పడవలకు వాటి ఆకృతినిబట్టి అరిముఖ నంబి (సింహముఖ బంటు) గజముఖ నంబి (గజముఖబంటు) పరిముఖ నంబి (గుర్రం ముఖ బంటు) అని పేర్లు పెట్టేవారు.

అతి ప్రాచీన కాలమునుంచి గవ్వల సేకరణ ముత్యాల సేకరణ ఇక్కడ కొనసాగుతూంది. వలంపురి శంఖములు ఈ నాటికీ అత్యధిక ధరలకు అమ్ముడు పోతున్నాయి. పాండ్య దేశపు సముద్రతీరంలో దొరికే ముత్యాలు పరిమాణంలోనూ ప్రకాశంలోనూ ప్రపంచ ప్రఖ్యాతి గాంచినవి. ముత్యాలను గురించి ఎన్నో జానపద గేయాలు వున్నాయి. అందులో ఒకటి :-

ముత్తాన ముత్తు
ముదిరా ఇళ ముత్తు
కావేరమదై రంగరక్కు
కళుత్తి విడుం రాణిముత్తు
ఆయిరం ముత్తివే
ఆరాయిన్దు ఎడుత్త ముత్తు
శ్రీ రంగనాధ రుక్కు
శిరసిల్ ఇదుం రాణి ముత్తు
తొళ్ళాయిరం ముత్తివే

కావి ఎడుత్త ముత్తు
మధురై మీనాక్షిక్కు
మార్చి విడుం ముత్తు.
అంటే—
ముత్యములలో ముత్యము-ఇది
ముదరని సుసులేత ముత్యము
కారమదై రంగదేవుని
కంఠమున ఇది రాణి ముత్యము
వేలాది ముత్యములలో
వెతికి తీసిన మేటి ముత్యము
శ్రీ రంగనాధునికి
శిరసున వెలిగే అణి ముత్యము
తొమ్మిదొందల ముత్యములలో
దొరికినదిది మంచి ముత్యము
మధురై మీనాక్షి దేవి
వక్షమున మెరిసేటి ముత్యము
అని భావము.

## చరిత్రాత్మక పూర్వాధారము

పురాతన కాల సంస్కృతినీ ఐతిహ్యమునూ పరిశోధించటానికి చరిత్ర, పురాణము మరియు సాహిత్యమూ ఎంతగానో సహకరించాయి. ఒక ఘోర జల ప్రళయము సంభవించే ముందు తమిళుల జీవన విధానములోనూ సింధూ లోయకు వలస వచ్చిన ప్రజల జీవన విధానములోనూ పోలికలు చాలా కనిపిస్తాయి. పురాతత్త్వ శాస్త్రవేత్తలూ, ప్రాచీన ఇతిహాస విజ్ఞులు, ఇప్పటికి కొన్ని గుర్తులు, రాజముద్రలు, పచ్చబొట్లు మున్నగువాటిని గురించి కొద్దిగా మాత్రమే తమ అభిప్రాయాలు వెలిబుచ్చారు.

ఇంతేకాకుండా బెలూచిస్థానములో వాడుకలో వున్న బ్రూహీ భాషలో తమిళభాషా అవశేష పదాలు చాలా కనిపిస్తాయి. ఒకానొక కాలంలో తమిళులు భారతదేశపు వాయవ్య భాగంలో నివసిస్తూ ఉండి ఉండాలి లేదా అక్కడి ప్రజలతో అవినాభావ సంబంధం కలిగి ఉండాలి అనే విషయాన్ని ఇప్పుడు చరిత్రకారులు అంగీకరిస్తున్నారు. ఈ అంశం భారతదేశ సమైక్యతా సాధనకు ప్రాతిపదిక కాగలదు.

## సంగ కాలము

తమిళ సాహిత్య చరిత్రలో అతి పురాతనమైనదిగా పేర్కొనబడే సంగ కాలము క్రీస్తు పూర్వము ప్రారంభమై దాదాపు మూడు నాలుగు శతాబ్దముల వరకూ కొనసాగింది. ఎనిమిది కావ్యాలూ (పట్టుత్తొగై)పది కవితా ఖండికలు (పత్తుప్పాట్టు) తమిళ సాహిత్యములోని అతి ప్రాచీన గ్రంధములుగా ప్రసిద్ధి కెక్కినవి.

సంగ కాలపు తమిళనాడులో "పాలూ తేనే ప్రవహించేదని'' అతిశయోక్తిగా చెప్పుకుంటారు. ఆహార ధాన్యాలు, మాంసము, చేపలు విరివిగా దొరికేవి. పశ్చిమ దిశలో వెలసిన చేర రాజ్యంలో గేదెలూ, పనసపళ్ళూ మిరియాలూ, పసుపూ సమృద్ధిగా ఉండేవి. కావేరి నదీప్రాంతమైన చోళ రాజ్యం దక్షిణదేశపు సిసలైన ధాన్యాగారముగా వెలుగొందినది. చోళ రాజ్యానికి దక్షిణ భాగంలో వెలసిన పాండ్య రాజ్యం ముత్యాలకూ, గెనుసు దుంపలకూ తేనెకూ ఆలవాలమై ఉండేది.

రాజరికము వంశ పారంపర్యముగా సంక్రమించేది. రాజు సర్వాధికారి అయినా ప్రజ్ఞావంతుల సలహాలు పాటించి రాజ్య పరిపాలన చేస్తుండేవాడు. ప్రజలు తమ ఏలిక అన్ని విధాలా ఉత్తముడుగా ఉండాలని కోరుకునే వారు. అందువల్ల రాజు నీతికీ న్యాయానికీ కట్టుబడి నడుచుకునే వాడు. రాజభటులు రాత్రులలో పట్టణాలకు గస్తీలు తిరిగేవారు. ఒక్కొక్కప్పుడు రాజు స్వయంగా వెళ్లేవాడు.

గ్రామీణ ప్రాంతాలలో జరిగే నాటకాలలోనూ జానపద కథలలోనూ పై వివరాలు వెల్లడవుతున్నాయి.

సంగ కాలంలో సంగీత నృత్య కళలకు సమున్నత స్థానం ఇవ్వబడింది.

ఆ కాలంలో వేట, మల్లయుద్ధము, ముష్టి యుద్ధము, పాచిన్ మున్నగునవి ముఖ్యమైన క్రీడా వినోదములు. స్త్రీలు తమ భవంతులపై డాబాలపై చిన్న చిన్న బంతులతో ఆడుకునే వారు. ఆడా మగా కలిసి జల క్రీడలలోనూ, షికార్లలోనూ పాల్గొనేవారు. పసిపిల్లలు కొయ్యలతో చేసిన విల్లు, బాణములు ఇంకా వివిధ రకములైన బొమ్మలతో ఆడుకునే వారు.

## పల్లవులు

పల్లవరాజులలో అనేకులు బహుకళా కోవిదులై దైవాంశసంభూతులై సంపూర్ణ వ్యక్తిత్వమును కలిగి వున్నారు. నాటక కళలోనూ సంగీతము నందునూ, వాస్తు శిల్పములోనూ తమ ప్రతిభను వెల్లడించారు. యుద్ధ కౌశలములోనూ నిష్ణాతులే. వారు కావేరి వరకు గల ప్రాంతమును పరిపాలించారు. తమ రాజ్యములో మత ధర్మములు, సాహిత్యము, లలిత కళలూ, పురోభివృద్ధి చెందటానికి కృషి చేశారు. సంస్కృత భాషను పోషించారు. వాళ్ల శిలాశాసనములలో స్తోత్ర సంబంధమైన విషయాలు గ్రంథాక్షరి (సంస్కృతము) లోనూ మిగతా వివరణలు వట్టి యెత్తు (తమిళము) లోనూ చెక్కబడి వున్నాయి. గ్రంథాక్షరి, వట్టి ఎత్తు అన్నవి రెండూ తమిళ లిపులు, సంస్కృతానికి గ్రంథాక్షరి లిపిని తమిళానికీ వట్టి యెత్తులిపినీ వాడేవారు. గ్రంథాక్షరిలిపి ఒక్క తమిళ నాడులో మాత్రమే కనబడుతున్నది.

పల్లవ యుగంలో హిందూ ధర్మము శైవ వైష్ణవ శాఖలుగా పునరుద్ధరింపబడ్డాయి. శైవ సిద్ధాంత ప్రచారకులైన నాయన్మార్లు వైష్ణవ మత ప్రవర్తలయిన ఆళ్వార్లు తమ తీవ్ర కృషివల్ల తమిళ దేశాల్లో జైనబౌద్ధ మతముల వ్యాప్తిని పూర్తిగా నిరోధించ గలిగారు. ముగ్గురు నాయన్మార్లు-సంబంధర్,

సుందరర్, అప్పర్ - తేవారము అని పిలవబడే పాటలనూ అలాగే ఆళ్వార్లు ప్రబంధములనబడే గీతలనూ విరచించి ప్రపంచములోని మత సాహిత్యములలో తమకొక ప్రత్యేక స్థానాన్ని ఏర్పరచుకున్నారు. కవిత్వములలో వీరు సృష్టించిన కొత్త శాఖ భక్తి కవిత్వముగా స్థిరపడి పోయింది. హృదయాలను కదలించే శ్రావ్యగీతాలయిన "పణ్"లు కవిత్వములో ఒక కొత్త శైలిని నెలకొల్పినవి. మాణిక్కవాచగర్ అనబడే సాధువు రచించిన "తిరువాచకం" హిందూ ధర్మ పునరుజ్జీవనానికి ఎంతో దోహదకారి అయినది. ఆ పాటలన్నీ ప్రజలను ఇట్టే ఆకట్టుకున్నాయి. వాటిని జనులు ప్రత్యేకంగా తమతమ ఇళ్లల్లోనూ దేవాలయములలో బృందగానముగానూ పాడుకునేవారు.

పల్లవులు రాతిగుహలూ, శివాలయములు, విరివిగా నిర్మించారు. అవి ఇప్పటికీ, జ్ఞాపక చిహ్నాలుగా సంరక్షింప బడుతున్నాయి.

రాతిలోంచి శివాలయం తొలిపించిన మొదటి రాజుగా మహేంద్ర పల్లవుడు చరిత్రలో శాశ్వతంగా నిలిచిపోతాడు

## చేర రాజులు

చేర రాజులు పశ్చిమ సముద్ర తీరప్రాంతాన్ని పరిపాలించారు. దంతములు, సుగంధ ద్రవ్యములు విదేశాలకు ఎగుమతి చేస్తుండేవారు. వారికి పాండ్య చోళ రాజ్యములకంటే ఎక్కువగా నీటి వనరులు ఉండేవి.

## చోళులు

చోళ వంశమును గురించి ప్రస్తావిస్తున్నప్పుడు వాళ్ళ కుశాగ్ర బుద్ధి కౌశలమూ, కళారాధనా, జ్ఞానతృష్ణ, ధార్మిక చింతన పేర్కొనదగినవి. వీరు ఎన్నో దేవాలయములు నిర్మించారు. పాతబడిన వాటిని బాగుపరచి పునర్నిర్మించారు. తంజావూరులో ఒకటవ రాజ రాజచోళుడు (10 వ శతాబ్దం) కట్టించిన బృహదీశ్వరాలయమూ, అతని పుత్రుడు రాజేంద్ర చోళుడు గంగా నది ప్రాంతమును జయించినందుకు విజయ చిహ్నంగా నిర్మించిన గంగై

కొండ చోళ పురమూ అపురూపమైన కట్టడాలు. తండ్రీ కొడుకులిద్దరూ వాస్తు శాస్త్రములో దిట్టలు. కాంశ్య విగ్రహాలు చేయుటలో చోళులు చూపిన పనితనము అనన్య సామాన్యమైనది.

చోళుల కాలంలో గ్రామ పాలనము పునరుద్ధరింప బడినది. గ్రామ పంచాయతీ సభ్యులకు ఇతోధిక అధికారములూ బాధ్యతలూ అప్పగింప బడినవి. చోళులు నీటివనరుల కోసరం ప్రత్యేక శ్రద్ధతీసుకుని చెరువులు త్రవ్వించారు, ఆనకట్టలు కట్టించారు, పంట కాలువలు నిర్మించారు. తిరుచ్చిరాపల్లి జిల్లాలోని జయంకుండాన్ చెరువూ, తంజావూరు జిల్లాలోని పెద్ద ఆనకట్ట **(Great Anicut)** వారి సాంకేతిక ప్రావీణతకు ప్రత్యక్ష నిదర్శనములు.

ఆగ్నేయాసియా **(South East Asia)**లో తమిళ భాషా సంస్కృతులను వ్యాపింప జేసిన ఘనత చోళులకే దక్కుతుంది. ఈనాటికీ తాయ్‌లాండ్ దేశపు రాజ పట్టాభిషేకం వేడుకలలో తిరుప్పావై, తిరువెంబావైలోని పాటలను గానం చేస్తారు. ఇండోనేషియా మరియు మలేయా భాషలలో పెక్కు తమిళ పదాలు సమ్మిళితమై ఉన్నవి. తమిళ సంస్కృతిని చాటి చెప్పే అనేక శిలా శాసనములు ఈ దేశములలో కనిపిస్తున్నాయి.

దేవాలయ నిర్మాణంలో తమిళుల శైలి ప్రపంచ ప్రఖ్యాతి వహించిన అంగ్‌కోర్ వాట్ **(Angkor Wat)** మరియు ఇతర దేవాలయములను సైతం ప్రభావితం చేసినది. తమ దేశపు ఊరి పేర్లయిన మధురై, మూనార్ లాంటి పేర్లు ఇండోనేషియాలోనూ మలేషియాలోనూ వాడుకలో నున్నవి. ఇప్పటికిని మలక్కా **(Malacca)** దేశంలో శైవ సంతతివారు నివసిస్తున్నారు.

చోళులు ప్రజల కష్టములను ఎప్పటికప్పుడు నివృత్తి చేస్తుండేవారు. కోటకు వెలుపల జేగంటలను వేలాడదీసేవారు. అత్యవసర పరిస్థితులలో ఎవరైనా రాజును చూసి తమ ఇక్కట్లను నివేదించుకోదలిస్తే ఈ గంటను మ్రోగింపవచ్చును. ఒకసారి మనునీతి చోళచక్రవర్తి కుమారుడు పౌర

పాటున తన రథమును ఒక ఆవుదూడపై తోలి చంపేశాడు. పాపం తన దూడను కోల్పోయిన తల్లి పశువు కోట వెలుపల వున్న గంటను అదేపనిగా వాయిస్తుంటే రాజు విచారణలు జరిపి జరిగిన అన్యాయమును తెలుసుకుని ఆ ఆవుకు న్యాయము చేకూర్చటంకోసరం తన కొడుకుపైననే రథము నడిపించి పుత్రుని కోల్పోయాడట. తర్వాత పరమేష్ఠి ప్రత్యక్షమై లేగదూడనూ, యువ రాజునూ బ్రితికించాడని ఒక వృత్తాంతము వాడుకలో నున్నది.

ఆలయములలోని దేవుళ్లరథములు తమిళనాడులో జరిగే రథోత్సవాలలో ప్రముఖస్థానం వహిస్తాయి. దేవుని రథమునులాగుటకు ఏఒక్కరూ గౌరవానికి లోటుగా భావించరు. చోళ చక్రవర్తులే ముందునిలచి ఈరథములనులాగేవారు.

దేవాలయ రథమును ముందుకు కదిలించడానికి ప్రజలు తండోపతండాలుగా తరలి వచ్చేవారు.

దేవాలయ నిర్మాణములో ముందంజ వేసిన పాండ్య చోళ రాజులు శిల్పుల పట్లనూ ఇతర పనివాళ్ల బాగోగులలోనూ స్వయంగా శ్రద్ధ తీసుకునే వారు. ఒకసారి శిల్పం చెక్కుతున్న ఒక శిల్పి తాంబూల చర్వణం వల్ల ఉమ్మివేయ వలసి వచ్చినప్పుడు అతని ఏకాగ్రతకు భంగము కలుగకుండా రాజే స్వయాన అతని దగ్గరకు ఉమ్మినీరు పాత్రను తీసుకెళ్ళాడట.

## పాండ్యులు

తమిళనాడు దక్షిణ భాగంలోని చివరి ప్రాంతము పాండ్యుల ఆధీనములో ఉండేది. తమిళ సాహిత్య వికాసం కోసం పాండ్యులు చేసిన సేవ మెచ్చుకో దగినది. 'కళుగుమలై' లో రాతితో చెక్కబడిన గుహాలయము పాండ్యుల కళారాధనకు ప్రత్యక్ష తార్కాణము. గ్రామీణ వాడుక భాషలో పూర్వీకులను పాండ్యులతో పోల్చి చెప్పడం కద్దు(మీనాన్న ఏం, పాండ్యరాజా?)

## విజయనగర సామ్రాజ్యము

పరాక్రమశాలులైన సేనా నాయకుల మూలంగా విజయనగర సామ్రాజ్యము దక్షిణ భారత దేశంలో నెలకొన్నది. అయినా తమిళ మండలములపై విజయ నగరాధీశుల అధికారం నామమాత్రంగానే ఉండేది.

విజయ నగర సేనా నాయకులు పండగలూ ఉత్సవాల ప్రాముఖ్యతను పెంచారు. పదహారునుంచి వంద స్థంభముల వరకూగల పెద్ద పెద్ద మంటపములను నిర్మించారు. వారు ఆంధ్ర దేశమునుంచి బ్రాహ్మణులనూ, ఇతర చేతివృత్తి పనివారినీ పెద్ద సంఖ్యలో తమిళ దేశానికి తరలించారు. శ్రీవిల్లిపుత్తూరు మరియు ఇతర ప్రాంతములలో తెలుగువారి స్థావరములు ఏర్పడినవి. తాళి కోటలో విజయనగర సామ్రాజ్యము పతనమైన తర్వాత జెంజీ, తంజావూరు మరియు మధురై ప్రాంతాలను పరిపాలిస్తున్న నాయక సామంత రాజులు తమతమ ప్రాంతాలని స్వతంత్ర రాజ్యాలుగా ప్రకటించుకున్నారు.

ఈ నాయక రాజుల ప్రోద్బలంతో కొత్త దేవాలయములు నిర్మింపబడినది. పాతవి పునర్నిర్మింపబడినవి. మధురైలో వెలసిన అతి సుందరమైన తిరుమల నాయకుని భవనమూ తామర చెరువూ ప్రపంచ ప్రఖ్యాతి గాంచినవి.

## మహారాష్ట్ర పాలకులు

1677లో ఛత్రపతి శివాజీ కర్ణాటకదేశముపై దండెత్తి రావడంతో తంజావూరు మహారాష్ట్ర పాలకుల స్వాధీనములోనికి వచ్చినది.

తంజావూరును ఏలిన మహారాష్ట్ర పాలకులలో రాజా షెర్ఫోజీ అత్యంత ప్రజ్ఞావంతుడు. అతను స్వయాన డేనిష్ మిషనరీలో చదువుకున్నాడు. స్కార్ట్జ్వ. డేనిష్, డచ్, ఇంగ్లీష్ మరియు ఫ్రెంచి మిషను వారు (మత ప్రచారక సభలు) తంజావూరు తీర ప్రాంతములలో తమతమ వ్యాపార స్థావరములను పరిశ్రమలను స్థాపించుకున్నారు. ఇది చివరికి యురోపియనుల మధ్య స్పర్ధలకూ అంతర్యుద్ధానికి దారి తీసింది. దాని పర్యవసానంగా పాండిచ్చేరి ఫ్రెంచి వారి స్థావరముగా స్థిరపడి తర్వాత 150 ఏళ్ల దాకా వాళ్ల స్వాధీనములోనే ఉండిపోయింది. ఈస్టిండియా కంపెనీ వారి ప్రధాన స్థావరము ( Head-quarters ) మద్రాస్‌లోని సెయింట్ జార్జి కోటలో St. (Geoge Fort) నెలకొన్నది.

## ముస్లిమ్ పరిపాలన

18వ శతాబ్దంలో హైదర్ అలీ టిప్పు సుల్తానుల దండ యాత్రల వల్ల తమిళనాడులోని పెక్కు ప్రాంతాలలో తీవ్ర అలజడిరేగింది. "హైదర్ అలి పేరు చెబితేనే ఏడ్చే పాపాయి కూడా నోరు మూసుకుంటుంది''. (హైదర్ అలీ ఎంద్రాల్ అళుద పిళ్ళయుం వాయ్ మూదుం) అనే తమిళ లోకోక్తి కూడా ఉన్నది. ముస్లిముల స్థావరములు దక్షిణ ఆర్కాటు జిల్లాలోనూ ఇతర జిల్లాల్లోనూ ఏర్పడినవి. ఆర్కాటు నవాబు బలీయమైన రాజకీయశక్తిగా రూపొందాడు. తమిళ ప్రజలపైన నవాబు పాలకులు ఎంతటి గాఢముద్ర వేశారో గ్రామీణ సాహిత్యములో బయల్పడుతూ ఉంది. పల్లె ప్రాంతాలలో "నువ్వేమిటో ఆర్కాటు నవాబు కొడుకు అయినట్లు మాట్లాడుతున్నావు" అని ఎద్దేవా చేస్తుంటారు. నవాబుసైనికులు మిక్కిలి ఖరీదైన మేలిరకం పాదరక్షలు ధరించేవారు. దీనికి తార్కాణముగా "చెప్పుదెబ్బలు తిన్నా ఆర్కాటు చెప్పు లతో తినాలి" అనే లోకోక్తి పుట్టింది. "పులి ఎంత సాధువో నవాబు అంత బీదవాడు" అనే మరో సామెతకూడా ప్రచారంలో ఉంది.

## బ్రిటిష్ పరిపాలన

అనాదిగా యురోపియనులు తమిళదేశంతో సంబంధము కలిగి వుండడం ఇక్కడ ఆంగ్లభాషా వ్యాప్తికీ క్రీస్తుమత ప్రచారానికీ దోహదం చేసింది. ఆధునిక తమిళభాషాభివృద్ధికి పాశ్చాత్యవిద్య ఎంతో సహకరించింది. యురోపియన్ పండితులు చేసిన సేవకూడా కొనియాడదగినది. చాలామంది తమిళులు ప్రపంచములోని వివిధ భాగములలో వ్యాపించిన బ్రిటిష్ స్థావరములకునూ ఫ్రెంచి స్థావరములకునూ వలసవెళ్ళి స్థిరపడి పోయారు.

## స్వాతంత్ర్య పోరాటము

స్వాతంత్ర్యోద్యమములో తమిళనాడు ప్రముఖపాత్ర వహించినది. ఈ ఉద్యమపు తొలిఘట్టములుగా బ్రిటిష్ ఆధిపత్యము నెదుర్కొని పోరాడిన కట్టబొమ్మన్ శివగంగ సహోదరులు, సాహస కృత్యములు సల్పిన వేలు

తంబి మరియు పులి దేవర్ మున్నగువారు ముఖ్యులు. ఇంకా వేలూరు సిపాయిల తిరుబాటుకూడా పేర్కొనదగును. ఈ సంఘటనల ఆధారముగా ఎన్నో జానపద గాథలు ప్రచారములో వున్నాయి.

భారత దేశపు రాజకీయ రంగంలో గాంధీజీ ప్రవేశించిన తర్వాత రాజాజీ నాయకత్వము వహించి ఉప్పు సత్యాగ్రహం కోసరం వేదారణ్యమునకు స్వాతంత్ర్య యోధులను నడిపించిన ఘట్టము తమిళనాడు చరిత్రలో అతి ముఖ్యమైనది. తమ ఉద్యమం అహింసాయుతమైనదని చాటుతూ "కత్తి ఇంద్రి, రత్తమింద్రి" అంటే కత్తులు లేక రక్తము చిందక సాగే పోరాటము అనే పాటను గానం చేసేవారు. వ. వు. చిదంబరం పిళ్లై తానే ఒక వర్తక నౌకను ప్రారంభించడం. క్విట్ ఇండియా ఉద్యమమూ- దాని మూలంగా కులశేఖర పురము, తిరువాతజై, దేవకూట, తిరుపూరు మున్నగు చోట్లలో ప్రజలు బ్రిటిష్‌వారి హింసకు గురికావడమూ, వేలకొలది తమిళులు జపాను ఆధీనములో ఉన్న మలేషియా, బర్మా దేశములకు వెళ్ళి నేతాజీ నెలకొల్పిన భారత జాతీయ సైన్యము (ఇండియన్ నేషనల్ ఆర్మీలో దాఖలు కావడమూ-స్వాతంత్ర్య సముపార్జనకై సాగిన పోరాటములో అతిముఖ్యమైన ఘట్టములుగా పేర్కొనవచ్చును.

అంతకు పూర్వమే దక్షిణ ఆఫ్రికాలో నివసిస్తున్న తమిళ యువతీ యువకులు గాంధీజీని స్వాతంత్ర్య పోరాటానికి ఆయత్తం చేశారు. గాంధీజీ వారిని గురించి చెబుతూ " నా కృషి సఫలీకృతం కావడానికి వారు ఇచ్చిన ప్రోత్సాహం గొప్పది " అన్నారు.

## తెగలు, లక్షణాలు

తమిళనాడులో నివసించే అత్యధికశాతం ప్రజలు ఖండవాసులు (Chersiots) ద్వీపవాసులు (Nesiots) చాలా తక్కువ. కొన్ని కొండ జాతులు నీగ్రో లక్షణములు కలిగి వున్నవని చెప్పబడుతున్నది. తమిళులు సామాన్యముగా పొట్టిగానూ, బలహీనముగానూ ఉంటారు.

ఇక్కడి ప్రజలలో సమ్మిశ్రితజాతి లక్షణాలు కలిపిస్తాయి. వీరు నల్లగానో లేదా చామన చాయగా ఉంటారు. పలచటి ఉంగరాల జుత్తు; ఒళ్లంతా పుల్ల వెంట్రుకలు, జారుడుగా వెడల్పుగా కన్పించే నొసలు, ధనురాకృతిలో గుంటలు పడినట్లు అమరిన కనుబొమ్మలు, జేపురురంగుతో కూడినమామూలు లేదా పెద్ద పెద్ద కళ్ళు. ముడతలు పడని కంటిపై రెప్పలు కిందికి వాలినముక్కు, పెద్ద పెద్ద నాసికా ద్వారములు - ఇవీ ఇచ్చట నివసించే జాతుల అంగలక్షణాలు.

నీలగిరి కొండలలో నివసించే తోడా అనబడే ఆటవిక జాతి అతి ప్రాచీన మైనదిగా పేర్కొనబడుతుంది. వాళ్ళు సాధారణముగా పొడవుగా ఉంటారు.

ఇక్కడ ద్రావిడ సంస్కృతిని గురించి ప్రస్తావించవలసి ఉన్నది. డా॥ సునీతికుమార్‌చటర్జీ మాటలలో "నేటి భారతీయ సంస్కృతి మరియు హిందూధర్మము అనే నేత (Texture) లో ద్రావిడులది పడుగునూలు (Warp) అయితే ఆర్యులది అడ్డపు పోగులు (Weft) హిందువుల సనాతన సంస్కృతిని గురించి చెప్పాలంటే అది రూపాయలో పన్నెండణాల వంతు (డెబ్బయి అయిదు శాతం) ఆర్యేతరులదే.

డా॥ గైబర్ట్ స్లేటర్ (Dr. Gibert Slater) "ద్రావిడులపైన ఆర్య భాషా ప్రభావమూ, ఆర్యులపైన ద్రావిడ సంస్కృతీ ప్రభావమూ, ఎక్కువగా కలిపిస్తా" యని ఉల్లేఖించారు.

## ఆదిమవాసులు, నివాసము

నివాస యోగ్యమైన ప్రాంతములలో స్థిరపడిన ప్రజల్ని నేటి పరిభాషలో ఒకసమాజముగా పేర్కొంటారు.

తొల్‌కాప్పియర్ (ప్రాచీన తమిళకవి) అభిప్రాయము మేరకు ప్రాణ కోటిలో మనుషులకి మాత్రమే బుద్ధి లేదా హేతుజ్ఞానము అనబడే ఆరో ప్రజ్ఞ కలదు. తొల్‌కాప్పియర్ జీవరాసుల్ని ఆరు తెగలుగా విభజించారు. స్పర్శ జ్ఞానము మాత్రమే కలిగిన వృక్షజాతి మొదటి కోవకు చెందుతుంది. గవ్వ,

నత్త, గోగుపురుగు, గుల్ల మున్నగు ప్రాకుడు ప్రాణులకి రెండు ఇంద్రియ జ్ఞానములు - స్పర్శ మరియు రుచి కలవని పేర్కొన్నాడు. మూడోరకం క్రింద ఈ సుళ్ళు, చీమలు మున్నగు రెక్కలు కలిగిన పురుగులు వస్తాయి. వీటికి స్పర్శ రుచిమరియు వాసన అనే మూడు జ్ఞానములు కలవు. నాలుగో జాతి క్రింద ఎండ్రకాయలు, రొయ్యలు, మున్నగు - అనగా స్పర్శ రుచి, వాసన, మరియు దృష్టిజ్ఞానము, కలిగిన ప్రాణులు వస్తాయి. ఐదో రకము క్రింద స్పర్శ, రుచి, వాసన, దృష్టి మరియు వినికిడి అనబడే ఐదు జ్ఞానేంద్రియములు కలిగిన పశుపక్ష్యాదులు వస్తాయి. ఆరో రకం క్రింద మనుష్యులు మాత్రమే వస్తారు. మనుషులకు మాత్రమే తెలివి లేదా హేతుజ్ఞానము అనబడే ఆరో జ్ఞానము గలదు. ఆరో జ్ఞానము కొరవడిన మనుషుల్ని మృగతుల్యులనీ, (మాక్కళ్) అది కలిగిన వారిని మాత్రమే మామూలు మనుషులనీ (మక్కళ్) ఆనాటి తమిళులు పేర్కొన్నారు.

ఆయా ప్రాంతములలో నివసించే జాతులు తమ సముచ్చయమునకు ఆధిపత్యము వహించే నాయకునికీ అతని ఇల్లాలికీ సమున్నతమైన గౌరవం ఇచ్చేవారు. ఉదాహరణకు ఇప్పటి పళని, నీలగిరి కొండ ప్రదేశములు మరియు వడమటి కనుమలలో నివసించే గిరిజనులకు అధిపతిగా వ్యవహరించే వాడిని పొరుప్పన్, వేళ్ప్వన్, సిలంబన్, అనీ వారి భార్యలను "కోటిచ్చి" లేదా "కురత్తి" అనీ పిలిచేవారు. పొరుప్పన్ నాయకుడుగా వ్యవహరించే కొండ జాతి రెండు పాయలుగా చీలి ఉండేది. ఒకశాఖ మగవారిని కణవర్ అనీ ఇంకోశాఖవారిని కురవర్ అనీ పిలుస్తూండేవారు, భార్యలను కురత్తియార్ అంటూ పిలిచేవారు.

తంజావూరు డెల్టా ప్రాంతములోని ఆదిమ నివాసుల నాయకుని మకిల్నన్ లేదా ఊరాన్ అని వ్యవహరించేవారు. అతని సహపత్నిని మనైవి లేదా కిళత్తి అంటూ పిలిచేవారు. వ్యవసాయము ముఖ్యవృత్తిగా గల ఈ తెగకు చెందిన పురుషులను, ఉళవర్, కడైయర్ అనీ, వాళ్ళ ఆడవాళ్ళను ఉళత్తియార్, కడైచ్చియార్ అనీ వ్యవహరించారు.

సముద్రతీర వాసుల నాయకులను సేర్వన్, పులంబన్ అనీ వాళ్ళ భార్య లను పరట్టి, సుళైచ్చి అనీ పేర్కొన్నారు.

## సంస్కృతీ సమ్మేళనము

ప్రాచీన కవులు తమిళదేశాన్ని ఐదు ప్రత్యేక భాగములుగా (పంచవర్గ విభజన) పేర్కొని ప్రస్తుతించినా ఇప్పుడదంతా గత చరిత్రగా మిగిలి పోయింది. ఆర్థిక రాజకీయ వైవిధ్యముల కారణంగా ఇప్పటి సమాజ పరి స్థితి సంక్లిష్టమైనదిగా తయారైనది. పూర్వపు ప్రమాణములు కాలక్రమమున మారిపోయాయి.

తమిళనాడులో వాడలూ, వీధులూ, గృహములూ, సమాజ వికాస కేంద్ర ములూ, అన్ని చోట్లా ఒకే మోస్తరులో నిర్మింపబడినవి. ప్రతి గ్రామమూ, దేవాలయమును చుట్టి లేదా దేవాలయ సమీపమున నిర్మింపబడినది బ్రాహ్మణ పురోహితులు అగ్రహారములనబడే చోట్లలో నివసిస్తూ వచ్చారు. అగ్రహార ములనానుకొని పిళ్ళై, మొదలియార్ లాంటి జాతులవారు నివసిస్తూవచ్చారు. వాణిజ్య వ్యాపారములు వృత్తిగాగల జాతులవారు (వైశ్యులుమున్నగు వారు) ముఖ్యవీధులకు సమీపప్రాంతములలో ఉంటూ వచ్చారు. అస్పృశ్యులు గ్రామా నికి వెలుపల నివసిస్తూ వచ్చారు.

మదురై లాంటి చరిత్రాత్మక పట్టణాలలో సైతం అన్ని జాతులవారూ తమ తమ వృత్తుల ననుసరించి వేరువేరుగా నివసిస్తున్న విషయం గమనించదగినది. నగలూ, ఆభరణాలూ, తయారుచేసే వ్యాపారులు దక్షిణ ఆవణి వీధిలో నివ సిస్తున్నారు. కన్నడిగులు నివసించే వీధికి కన్నడిగ వీధి అనిపేరు. గాజుల వర్తకులు నివసించే వీధికి గాజులవారివీధి అనీ, సున్నపురాళ్ళు వ్యాపారులున్న వీధికి సున్నపురాళ్ళవారి వీధి అనీ పేర్లున్నాయి. అలాగే బావుల త్రవ్వకము వృత్తిగా జీవించేవారు తోట్టిబావి సందులో నివసిస్తున్నారు.

పూర్వాచారములు మరియు పాత సంప్రదాయములు అడుగంటిపోగా వాటి

స్థానే హేతువాదము ప్రబలుతున్నది. గ్రామ నిర్మాణములోనూ, పట్టణాభివృద్ధి లోనూ, సత్వరమైన మార్పులు వస్తున్నవి.

ఇప్పుడిప్పుడు అగ్రహారముల లోని కొన్ని భాగములలో బ్రాహ్మణేతరులు కూడా నివసించడం మొదలెట్టారు. మామూలుగా హిందూమతమునకు చెందని వారు (క్రైస్తవులు/మహమ్మదీయులు) ప్రత్యేక జట్లుగా ఊరికి వెలుపలనో లేదా ఊరిలోని ప్రత్యేక విభాగములోనో ఉంటూ ఉండేవారు. కానీ కాల క్రమేణ అన్ని మతాలవారూ, అన్ని వర్గాలవారూ కలిసికట్టుగా జీవించడానికి అలవాటు పడుతున్నారు, ఉత్సవాలు ఊరేగింపులలో అన్ని జాతులవారు తారతమ్యము పాటించక పాల్గొంటున్నారు. ఉత్సవాలు జరిపించుటలో ఒక్కొక్క జాతి వారికీ ప్రత్యేకమైన బాధ్యత అప్పగింపబడి ఉంటుంది.

బ్రిటిష్ పరిపాలన వల్లనూ, ఇస్లాం క్రైస్తవ మతముల వ్యాప్తి వల్లనూ, హేతువాదము బలపడటం వల్లనూ, ఇటీవలి కాలంలో హిందువుల మత సంబంధమైన ఉత్సవాల ప్రాముఖ్యం కొద్దిగా తగ్గి పోయిందనే చెప్పాలి. హిందూ మతము అప్రమత్తము కావలసిన అగత్యము ఏర్పడినది. పాశ్చాత్య దేశాలలో భారతదేశపు ఘనతను చాటి చెప్పిన మహనీయుడు స్వామి వివేకానంద. అతను చికాగోలో జరిగిన మత ప్రతినిధుల సభ (పార్లమెంట్ ఆఫ్ రెలిజన్స్)లో పాల్గొని హిందూ మతము ఔన్నత్యాన్ని సవివరంగా ఎత్తి చూపారు. స్వామి వివేకానంద కన్యాకుమారిలో ధ్యానముద్రలో మునిగి వున్నప్పుడు అతనికి చికాగో వెళ్ళ వలసిందిగా అలౌకిక ప్రేరణ కలిగింది. అతని చికాగో పర్యటన చరిత్రాత్మకమైనది. ఆయన పర్యటనకు కావలసిన ఆర్థిక సహకారమును అప్పటి రామనాధపురం రాజా సమకూర్చారు. స్వామి వివేకానంద భారత దేశమునకు తిరిగి వచ్చిన తరువాత మద్రాస్‌లో రామకృష్ణ మఠము స్థాపించారు. ఇప్పుడది భారతదేశములోనేగాక యావత్ ప్రపంచంలోనూ, శాఖోపశాఖలుగా వ్యాపించివున్నది.

కొన్నివంశాలు వర్తక వ్యాపారంలో అత్యధిక లాభాలు సంపాయించడం వల్లనూ, ప్రభుత్వము వారి సహకారము వల్లనూ, ధనిక వర్గాలుగా మార్పి

పోయాయి. వారిలో పలుకుబడి ఉన్న కొందరు వ్యక్తులు ఉన్నత కులస్థులు నివసించే చోట్లలో డబ్బుకక్కుర్తి ఉన్న వాళ్ళని వెతికి పట్టుకుని అత్యధిక ధరలుపెట్టి ఇళ్ళుకొని ఆ ప్రాంతంలో ప్రవేశిస్తారు. ఇలా చేయడం వల్ల విభిన్న జాతులవారు క్రమక్రమంగా ఒకచోట కలసిపోవడం జరుగుతుంది. అక్కడ విశ్వజానిక ప్రాంతము (Cosmopolitan) నెల కొంటుంది. మొదట అత్యధిక ధరలు చెల్లించే వ్యక్తికి అతని స్వజాతివారు తమ సమిష్టి నిధులలోంచి నష్టపరిహారము చెల్లిస్తారని చెబుతారు.

## సామాజిక ఆర్థిక వ్యవస్థ

భారతదేశములోని ఇతర ప్రాంతములలో వలెనే తమిళనాడులోనూ, సామాజిక ఆర్థిక విధానము వస్తూత్పత్తిలో స్వయం సమృద్ధిని సాధించడానికై రూపొందించబడినది. ముఖ్యకేంద్రాలలో జరిగే వారసంతలు, నెలసరి. సాలుసరి పరిషలు గ్రామీణ ప్రజలు తాము ఉత్పత్తి చేసిన మిగులు వస్తువులని మార్పిడిచేసి తమకు కావలసిన వస్తువులని కొనుక్కోవడానికి అవకాశం కలిగించేవి.

తిరునెల్వేలి జిల్లా సరిహద్దు గ్రామాలలో జరిగే సంతలలో ఆ ప్రాంతపు ప్రజలు "వదకం జేరి" "గ్రామీణులు తెచ్చే" "ఈ రెకై ముందు" (జంట దారాలతో చిక్కగానేసిన తువ్వాలు) ను బియ్యము లేదా వేరే ధాన్యములకు మార్చుకోవడమన్నది ఇప్పటికీ వాడుకలో వున్నది. ఈ వస్తువినిమయ విధానము (Barter System) కాల క్రమమున ద్రవ్యమూలక క్రయ విక్రయ పద్ధతికి దారితీసింది. గ్రామీణ ప్రాంతాలలో దుకాణములో వెలసి వివిధములైన సరుకులు అమ్మకమునకు రావడములో పూర్వకాలపు వస్తు వినిమయ విధానము పూర్తిగా తుడిచి పెట్టుకు పోయింది. ఇప్పటికీ పండుగ పబ్బాలకు చేరువలో జరిగే సంతలు వ్యవసాయ పనిముట్లు, గొడ్డు గోదాములు, కిరాణా సామాన్లు, మున్నగు వాటి క్రయ విక్రయములకు ప్రాముఖ్యత వహిస్తున్నాయి.

ఒక్కొక్క జాతియొక్క ఆర్థిక స్తోమత దాని వృత్తిపైననే ఆధారపడి ఉండేది. ఉదాహరణకు-బ్రాహ్మణులూ పౌరోహిత్యమునూ, జోతిష శాస్త్ర

మునూ, వృత్తిగా స్వీకరించేవారు. ఇప్పుడిప్పుడే వారు ఎక్కువ ఆదాయము వచ్చే వృత్తులను చేపట్టుచున్నారు. వాళ్ళు గుడిమాన్యాలుగా రాజులు దానము చేసిన గ్రామాలపై ఆధారపడి జీవిస్తూ వచ్చారు. నిరాడంబరత ఆధ్యాత్మిక చింతన -వారి జీవన విధానముగా ఉండేది.

వెళ్ళాలర్ (రైతులు) వంటి జాతులవారు (కోయంబత్తూర్ ప్రాంతంలో గవుండర్లు చెంగల్పట్టు తదితర ప్రాంతాలలో మొదలియార్లు, తిరునెల్వేలి జిల్లా లోని పిళ్ళైలు) పెద్దఎత్తున వ్యవసాయం చేసేవారు. పొలం పనులను అజమాయిషీ చేస్తూ ఫలసాయమును విక్రయించి ఆదాయం పొందుతూ వచ్చారు. గ్రామీణ వర్తకము కొన్ని వైశ్యజాతుల గుత్తాధిపత్యముగా కొనసాగేది. ఇటీవలి కాలంలో తమిళనాడులోని అన్నిచోట్లలోనూ, వైశ్యులస్థానే నాడార్లు వర్తకములో వృద్ధిపొందారు.

తాటికల్లు తీసే వృత్తివారయిన సాణర్ అనే కులమువారు స్వాతంత్ర్యానంతరం స్వయం కృషితో పైకొచ్చి సమున్నత వాణిజ్య జాతిగా బలపడ్డారు. అస్పృశ్యులు వ్యవసాయ కూలీలుగా పనిచేస్తూవచ్చారు. ఈ దళిత వర్గాల వారు తమకు అప్పగింపబడిన పనులు చేస్తూ జీవనోపాధిని సమకూర్చుకునే వారు. ప్రతి గ్రామములోనూ, రజకులూ, నాయీ బ్రాహ్మణులు, నివసించే వారు. వారు తమ సేవలకు ప్రతిఫలంగా గ్రామస్థులిచ్చే ధాన్యాదులతో జీవిస్తూ వచ్చారు. వాళ్ళ పనికి ద్రవ్యమూలకమైన భృతి చెల్లింపబడేదికాదు.

పై ఆర్థిక విధానము బ్రిటిష్ వారి పరిపాలనలో అస్తవ్యస్తమైనది. ఏ పనికయినా ద్రవ్యరూపంలో మూల్యము చెల్లింపవలసి రావడమే ఈ అవకతవకకు కారణం. బ్రాహ్మణులు తాము జరిపే అర్చనలకూ శుభ ముహూర్త నిర్ణయాలకూ, జ్యోతిషం చెప్పడానికీ, చిన్న చిన్న మొత్తములలో ప్రతిఫలం పుచ్చుకోవడం మొదలెట్టాడు.

స్వాతంత్ర్య సముపార్జన తర్వాత రాజకీయ రంగంలో కులమూ, ధనమూ మరియు కొన్ని రాజకీయ సిద్ధాంతాలు కీలక పాత్ర వహిస్తున్నవి. ప్రత్యేకించి సమాజములోని అట్టడుగు వర్గాల ప్రజలపై వీటి ప్రభావము ఎక్కువగా కనిపి

స్తుంది. ప్రాచీన సంఘంలో ఉన్నతజాతి వ్యక్తులకి వారి వయస్సుతో నిమిత్తము లేకుండా గౌరవము ఇస్తూ వచ్చేవారు. కాని ఈ వైఖరి కాలానుగుణంగా మారుతూ వస్తున్నది. నేడు సమాజంలో అట్టడుగున నలుగుతున్న దళిత జాతి ప్రజలు సమానత్వం సాధించడం కోసరం కృషి చేస్తున్నారు.

పట్టణములలోని ఉద్యోగ అవకాశాలు గ్రామీణ ప్రాంతపు శక్తిమంతులైన యువకులనూ మధ్యవయస్కులనూ పెద్దపెట్టున ఆకర్షించడంతో గ్రామీణ ప్రాంతాలు బలహీన పడిపోతున్నవి. గ్రామీణ ప్రాంతములలో మిగిలిన సంపన్న కుటుంబ వ్యక్తులుసైతం తమకు దగ్గరగాఉన్న పట్టణాలకువెళ్ళి తేనీటి దుకాణములలోనూ సినిమాథియేటర్లలోనూ కాలక్షేపంచేసి వస్తారు.

మారుమూల గ్రామాలకుసైతం రోడ్లువేయించి సక్రమముగా అధునాతనమైన బస్సు సౌకర్యములు కలుగజేయడంలో గ్రామీణప్రాంతపు స్వరూపములే పూర్తిగా మారిపోతున్నవి. గ్రామప్రాంతములన్నీ పట్టణప్రాంతములుగా రూపొందుతున్నవి. గ్రామములలో గృహనిర్మాణము కొత్తనమూనాలలో జరుగుతోంది. బాగా ఉన్నవాళ్లు గ్రామీణప్రాంతములోనే తమగృహములలో అధునాతన వసతులతో పరిశుభ్రమైన స్నానగదులూ, ప్రత్యేక గదులూ ఫ్రిజ్‌లూ రేడియోలు అమర్చుకొని పట్టణజీవితము గడుపుతున్నారు. పటిష్టముగానూ, అందముగానూ నిర్మింపబడిన పాతతరహా భవంతులనూ పడగొట్టి వాటిస్థానే కొత్తఫక్కీలో కొత్తతీరులో మేడలు నిర్మించాలనే తాపత్రయం ప్రబలిపోతున్నది. ప్రతిదానిలోనూ కొత్తదనం కావాలని ప్రజలు తహతహ లాడిపోతున్నారు.

వర్షాభావమువల్ల ఎల్లప్పుడూ కరువుకాటకాలకు గురిఅయ్యే రామనాధపురం మరియు తిరునెల్వేలి జిల్లాలోని చాలామంది ప్రజలు ప్రతిఏడాదీ తమకు దగ్గర్లోవున్న సారవంతమైన డెల్టాప్రాంతాలలోకి పైరువాడే సమయంలోనూ పంటఊడ్పు అదనులోనూ వ్యవసాయ కూలీలుగా వలస వెళుతున్నారు. ప్రాత్యదేశాలకు వెళ్లేవారు అక్కడే రబ్బరుతోటలలోనూ చిన్నచిన్న వ్యాపార

స్తులుగానూ పెట్టుబడుదార్లుగానూ శాశ్వతంగా స్థిరపడిపోతున్నారు. తమిళులు ఏదేశానికివెళ్లినా తమకు ఆశ్రయమిచ్చిన దేశపు జాతీయ సంపదను పెంపొందించడంకోసరం శాయశక్తులా కృషిచేస్తారు.

నీటివనరులు కలిగిన సారవంతమైన అన్యప్రాంతాలకు వలసవెళ్లిపోవడమన్నది పాండ్యుల కాలంనుంచి ఆనవాయితీగా వస్తున్నది. ఈ సంగతిని వెల్లడిచేసే క్రింది జానపదగేయము వాడుకలోవున్నది.

## అల్లిరాణి కథలో ఘట్టము

(అల్లి అరసాని మాలై)

పాండ్యదేశపు పౌరుల్లారా
పరదేశాలకు వలసవెళ్లద్దు
మదురై పరిసర ప్రాంతములోనా
మచ్చుకయిననూ వానకురవదు.

దక్షిణ దేశమ్ముపైన
దయకలుగదు మేఘములకు
చొక్కలింగని ఊరిలో - ఒక
చుక్క వర్షమయినా పడదు !

స్రుక్కిపోయెను నగరమంతా
ఎక్కడా తడి కానరాదు
ఎచట చూచిన పొగలు, మంటలు
ఎండిపోయిన మడుగు, గుంటలు !

కాకి దప్పిక తీర్చడానికి
కాన రాదొక గుక్కెడునీళ్లు
నదులు, చెరువులు, తటాకమ్ములు
నార్దట్టంగా వట్టి పోయెను !

ఎండవేడికి నేల మండెను
ఎగసెను ఉవ్వెత్తున జ్వాలలు
మధుర నగరిని పంటలేదు
మనువు లేదు, బ్రతుకులేదు !

ఆవరించెను ధూళి దూసరి
ఆకు రాలిన మొండి మానులు
కాలి పోయిన భూమిపైన
కాన రాదొక పచ్చగడ్డీ !
ఒక్కపిట్టా కానరాదు
అక్కట, ఏమి దారుణ్యమూ

ఒకప్పుడు—

భయమ్మెరుగని మధుర పౌరుల
భవనములపై బావుటాలు !

ఇప్పుడు—

శత్రు భయమున జనములంతా
సాగి పోదురు ఊరు వదిలీ !
ఎండిపోయిన శరీరాలతో
మండిపోయే ఉదరములతో
ఏగుదురు దేశాంతరాలకు
ఏమి దుర్దశ వచ్చెనకటా !

వన్నె కెక్కిన మధురలోనా
అన్నమే కరువాయె నయ్యో,
నంద వనములు, అరణ్యాలు
నామరూపము లేక పోయెను.

చెఱకు గడలే ఎండిపోయి
గటికె నేలను వాలిపోయెను

మహోన్నత మధురా పురమున్న
మనుజులకు ఆశ్రయము లేదు !
వలస వెళ్ళని జనములందరూ
పస్తులుండి పరితపించిరి !
కళాకాంతులు సన్నగిల్లెను.
కమలి కృశియించెను మొగమ్ములు !
ఎచట చూచిన ఎచట విన్నా
అచట ఆకలి కేకలాయెను !
పన్నెండు వర్షములుగా
పగ సాధించెను తరువు రక్కసి !
బక్క చిక్కిన దేహములతో
పాలిపోయిన నేత్రములతో
ప్రజలు సతీ సుత సమేతముగా
పారిపోయిరి విదేశాలకు !

తమిళనాడులో నెలకొన్న కటిక దారిద్ర్యం అక్కడి ప్రజలు పెద్దపెట్టున బ్రిటిష్ మరియు ఫ్రెంచివారి పరిపాలన క్రిందఉన్న విదేశాలకు వలస వెళ్ళడానికి ముఖ్యకారణమైనది. ఈ దురంతం మహాత్మాగాంధీని కలవర పరచింది. మహాత్మాగాంధీ 1921 సెప్టెంబర్ నెలఆఖరులో మధురై సందర్శించినపుడు అక్కడ ఆకలి కడుపులతో మాడిపోతున్న కర్షకుల దుస్థితిని చూసి మిక్కిలి దుఃఖించాడు. అక్కడే ఒక బహిరంగసభలో మాట్లాడుతూ 'విదేశీ వస్త్రములను బహిష్కరించడం, ఇంతవరకూ ధరిస్తూ వచ్చిన విదేశీవస్త్రాలను దహించడం జరిగింది. వాటి స్థానే వేలాది ప్రజలు కావలసినంత ఖాదీ బట్టలు కొనలేని బీదస్థితిలో ఉన్నారు. వారందరూ గోచీతోనే సరిపుచ్చుకోవడానికి సంసిద్ధం కావాలి. దానికి దృష్టాంతరముగా నేను ఈ రోజునుంచీ నా ధోవతీ టోపీ మరియు చొక్కాలను విసర్జిస్తున్నాను ఒక్క గోచీతోనే సంతృప్తిపడతాను. దేహరక్షణకోసరం అవసరమైనపుడు ఉపయోగించడానికి ఒక దుప్పటి

ఉంచుకుంటాను" అని ప్రకటించాడు. ఆనాటి నుంచీ ఆయన గోచీ, దుప్పటి మాత్రమే ధరించాడు.

## స్వాతంత్ర్యానంతర పరిస్థితులు

1947లో స్వాతంత్ర్యం సిద్ధించినది మొదలు తమిళనాడు ఆర్థిక, సాహిత్య సాంస్కృతిక రంగాలలో బాగా పురోభివృద్ధి గాంచినది.

భారతదేశపు పారిశ్రామిక రంగంల్లో తమిళనాడు రెండవస్థానము వహిస్తున్నది. (మహారాష్ట్రమునకు మొదటిస్థానము) ఇది ఎలా సాధ్యమయిందంటే ప్రణాళికా బద్ధమైన విద్యుత్ ఉత్పాదన సులభముగా లభించే సాంకేతిక సహాయమూ, మంత్రి మండలివారు అనుసరిస్తూవచ్చిన దూరదృష్టితో కూడుకున్న పారిశ్రామిక విధానమూ- ఇవన్నీ దోహదం చేశాయి. పైగా బర్మా, శ్రీలంక, ఇంకా తదితర దేశాలనుంచి స్వదేశానికి తిరిగి వచ్చిన తమిళ పారిశ్రామిక వేత్తలూ, కార్మికులూ, తమిళనాడు పారిశ్రామికరంగంలో ముందంజవెయ్యడానికి ఇతోధికంగా సహాయపడ్డారు. మదరాసు నగరంలో నెలకొల్పబడిన నూనె శుద్ధి కర్మాగారము (Oil refineries) మరియు మాదిరి పరిశ్రమ కేంద్రములూ, (Model Industrial Estates) ఈ రాష్ట్రము సాధించిన పారిశ్రామిక పురోభివృద్ధికి నిదర్శనాలు.

మోటారు పరిశ్రమలో అద్వితీయ స్థానం వహించే మద్రాస్ నగరము "భారతదేశపు డెట్రాయిట్" (Detroit of India) గా పేరుగాంచినది. మద్రాసు, మేట్టూరు, మరియు తూత్తుకుడి పరిసరాలలో పెట్రో కెమికల్ కాంప్లెక్స్లు వెలిశాయి.

నైవేలి గనులలో దొరికే లిగ్నయిట్ బొగ్గు విద్యుత్ ఉత్పాదనకు, యూరియా ఎరువుల తయారీకి దోహదం చెయ్యడమేకాక ఇళ్ళల్లో వంట చెరకుగానూ బాగా ఉపకరిస్తున్నది. సేలం సమీపంలో ఒక ఉక్కు కర్మాగారము స్థాపింపబడుతున్నది.

పంపుసెట్ల తయారీలోనూ, ఇతర ఇంజనీరింగు పరికరముల ఉత్పత్తిలోనూ, పదును పెట్టిన తోళ్ళ ఎగుమతిలోనూ, తమిళనాడు మనదేశంలో అగ్రస్థానము వహిస్తున్నది. తమిళనాడులోని మరొక భారీ పరిశ్రమ సినిమా నిర్మాణము. మద్రాసులో హిందీ సినిమాలు సైతం నిర్మింపబడుతున్నవి. మద్రాస్ నగరమును భారతదేశపు హాలీవుడ్ అంటే అది సత్యదూరము కానేరదు.

కోయంబత్తూరు, మధురై నగరాలు నూలు పరిశ్రమలకు కేంద్రములై విలసిల్లుతున్నవి. అహమ్మదాబాద్‌లో అన్నిరకాల నూలు తయారు చేస్తారు. కాని దక్షిణ భారతదేశపు మిల్లులలో చేనేత మగ్గములకూ, ఇతర పనివారికీ బట్వాడా చేసే నూలు తయారుచేస్తారు. సిమెంటు మరియు పంచదార పరిశ్రమలలోనూ, తమిళనాడు చెప్పుకోదగిన ప్రగతిని సాధించింది ఇక్కడ కొన్ని కాగితపు మిల్లులు కూడా నెలకొల్పబడినవి.

వ్యవసాయ రంగంలో అధునాతన పనిముట్లు వాడకము వల్లనూ, రసాయనికపు ఎరువులు ఉపయోగించుటవల్లనూ అధిక ఫలసాయాన్ని పొందగలుగుతున్నారు. ఇప్పుడిప్పుడు నూలు మిల్లులకూ, వనస్పతి యూనిట్లకు సరఫరా చెయ్యడంకోసరం ప్రత్తి మరియు వేరు సెనగలు వంటి వాణిజ్య పంటలపై మోజు అధికమవుతున్నది.

కుటీర పరిశ్రమలను ప్రస్తావించినప్పుడు-కాంచీపురం మరియు సుంగాడి చేనేత పరిశ్రమ మధురై నేతపని, అద్దకము ప్రత్యేకముగా పేర్కొనదగును. మధురైకి దక్షిణ వైపున వున్న పొడి ప్రదేశములలో (Dry area) అగ్గిపుల్లల పరిశ్రమ అభివృద్ధి గాంచినది. భారతదేశపు అగ్గిపెట్టెల ఉత్పత్తిలో అయిదింట రెండు వంతులు ఇక్కడే తయారవుతాయి.

ఇండియాలోని ప్రస్తుత రాష్ట్రములు భాషా ప్రయుక్తంగా ఏర్పడినవి. దీనివలన ప్రాంతీయ భాషలు అభివృద్ధి చెందుటకు అవకాశం కలిగింది. తమిళము మాట్లాడే ప్రజలు ఎక్కువ సంఖ్యలో శ్రీలంక, మలేషియా,

సింగపూరు, ఫిజి, మరిషియస్‌దీవులు, దక్షిణ ఆఫ్రికా మున్నగు దేశాలలో నివసించడం వల్లనైతేనేమి, (యునెస్కో పథకము క్రింద తమిళభాషలోని ఉత్తమగ్రంథములు పాశ్చాత్య భాషలలోకి అనువదింపబడటం వల్లనై తేనేమి,) కౌలాలంపూర్, పారిస్‌లాంటి సుదూర ప్రాంతాలలోనైతం అంతర్జాతీయ తమిళ మహాసభలు, సెమినార్లు జరగడంవల్లనై తేనేమి, పెక్కుదేశాల సహకారంతో మద్రాసులో (ఇంటర్నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ తమిళ్ స్టడీస్) అంతర్జాతీయ తమిళ పరిశోధనా కేంద్రము నిర్మింపబడటంవల్లనయితేనేమి - తమిళ భాషకు అంతర్జాతీయ స్థాయిలో గుర్తింపు లభించింది.

మత పునరుద్ధరణలోనూ ఇతోధికమైన శ్రద్ధ కనిపిస్తున్నది. పాతబడిన దేవాలయముల పునర్నిర్మాణమూ మరియు కొత్త దేవాలయముల నిర్మాణమూ పెద్దయెత్తున జరుగుతున్నది. పూర్వము ఈ కార్యకలాపాలన్నీ రాజ కుటుంబానికో ఒక్క ప్రత్యేక జాతికో పరిమితమై ఉండేది. కాని ఇప్పుడు అన్ని వర్గాలవారూ కలిసికట్టుగా పాలుపంచుకుంటున్నారు. అందరూ విరాళాలు ఇస్తున్నారు. హిందువులు ఇతర మతములలోకి మార్పిడి కావడం దాదాపు పూర్తిగా ఆగిపోయినది. అన్ని మతాలవారూ ఇతరులపట్ల సుహృద్భావాన్ని అలవరచుకుంటున్నారు. ప్రతి మతంలోనూ అందలి శాఖోపశాఖలవారు ఒకరిపట్ల ఇంకొకరు స్నేహపూర్వకంగా నడచుకుంటున్నారు. శైవులూ, వైష్ణవులూ సత్సంబంధాలు ఏర్పరచుకుంటున్నారు, ప్రొటెస్టెంటులు (Protestants) కేథలిక్కులపట్ల తమకున్న పాత వైరభావాన్ని విడచిపెడుతున్నారు. ప్రొటెస్టెంట్లలోని అన్ని ఉపశాఖలూ ఒక్కటై దక్షిణ భారతదేశపు చర్చి (Church of South India) ను నెలకొల్పారు.

మన పాత సంస్కృతిని గురించి పునరావలోకన జరుగుతున్నది. తమిళ నాటకరంగం ఎంతో చైతన్యం పుంజుకున్నది. తమిళ శాస్త్రీయ సంగీతాన్ని ప్రోత్సహించి పరిరక్షించడం కోసరం ఏర్పడిన ఉద్యమం అందరి మెప్పులను పొంది సుస్థిరంగా నిలబడింది. వినోద కార్యక్రమాలలో జానపద సంగీతానికి ఇతోధికమైన ప్రాధాన్యత ఇవ్వబడుతున్నది. జానపద నృత్యాలు సినిమాలలో విరివిగా చోటు చేసుకుంటున్నాయి.

తొలుదొల్త జానపద గేయాల్ని సేకరించి గ్రంథస్థము చేసిన ఘనత పాశ్చాత్యులకే దక్కుతుంది. కాని జానపదగీతాలు సనాతనత్వంలో కూరుకు పోయిన పండితులకి అంటరానివిగా తోచి వారిచే తిరస్కరింపబడుతూ వచ్చాయి. అయితే ఇప్పుడు పల్లెపదాలు సాహిత్యంలో ఒక అంతర్భాగంగా గుర్తింపబడి విశ్వ విద్యాలయములలో పాఠ్యాంశములుగా నిర్ణయింపబడుటే గాక వాటిపై పరిశోధనలు కూడా జరుగుతున్నవి.

తమిళనాడులో సినిమాథియేటర్లు దేశంలోని మొత్తం థియేటర్ల సంఖ్యల సరాసరితో పోల్చి చూస్తే రెండింతలకు పైన ఉంటాయి. ప్రజల ఆలోచనా ధోరణిపైననూ వస్తు వినియోగంలోనూ ఈ సినిమాల ప్రభావం ఎంతయినా కనిపిస్తుంది.

ఆహార విధానం తీసుకుంటే-ఇప్పుడిప్పుడు నగరప్రాంత వాసులు గోధుమలు అలవాటు చేసుకుంటున్నారు. రొట్టెల (Cakes and Breads) వినియోగము ఎక్కువైనది. సంఘంలో పై అంతస్తులో ఉన్న వ్యక్తుల ఇళ్ళల్లో జన్మదినోత్సవములలో కేక్ కోయడమన్నది ఒక ఫ్యాషనుగా తయారైనది. "ఉణ్ బదునాళి; ఉడుప్పన ఇరందు'' అనే సామెత (అంటే కడుపుకు పిడికెడు కూడూ, ఒంటికి రెండు దుస్తులూ వుంటే చాలనే నిరాడంబరత) ఇప్పటి పరిస్థితులకు వర్తించదు. వేసవికాలంలో సైతం యువతీ యువకులు టెరిలిన్ నైలాన్‌లాంటి సింథెటిక్ దుస్తులను వాడుతున్నారు. అన్ని సుఖాలు అనుభవించాలని స్వదేశంలోనే కాకుండా విదేశాలలోనూ పర్యటించాలనీ ప్రజలలో నానాటికీ కోరికలు పెరిగిపోతున్నవి.

బ్రిటిష్ పాలకులచేత మనదేశంలో ప్రవేశ పెట్టబడిన విద్యుచ్ఛక్తి ఇప్పుడు తమిళనాడులోని అన్నిగ్రామాలకూ వ్యాపించింది. దిండిగల్లు పల్లె ప్రాంతాలలో వాడుకలో వున్న ఈ క్రింది జానపదగేయం విద్యుచ్ఛక్తి వ్యాప్తిని గూర్చి రమ్యంగా వర్ణిస్తుంది.

సీలగిరి ఓ రత్తిచే సీట్టి విట్టాన్ కాంతక్కంబి
తొట్టా పుడిక్కుద తుడిక్కారన్ పోట్టకంబి

కూనూసి పోల కోయంబత్తూరు జిల్లాకంబి
కొళ్ళై పణం సెలవళిచ్చు
కొందు వందాన్ సెంపట్టిక్కే

అంటే—

నీలగిరి అంచులోన
నిర్మించిన సూదంటుతీగె
తెల్లదొర వేసిన తీగె
తీస్తుంది ప్రాణం, ముట్టుకుంటే—
గోనె సూదిలా సాగదీసిన
కోయంబత్తూరు జిల్లా తీగె
కోకొల్లలు ఖర్చుపెట్టి
కొని వచ్చాడు సెంపట్టికి

( సెంపట్టి అన్నది ఒక గ్రామము )

# 2 వ అధ్యాయము

## పురాణములు; ఇతిహాసములు

తమిళుల కట్టు కధలూ పురాణాలూ - మొహంజాదారో, హరప్పా ఇంకా ఇతర పూర్వ ద్రావిడ నాగరికతల కాలం నాటినుంచీ ప్రచారంలో ఉన్నాయి. శైవమత సాహిత్యము పేర్కొనదగినది. తమిళ దేశంలో ఒక కాలంలో శైవమతం జన బహుళ్యంలో అత్యంత ప్రచారంపొంది, అన్నిచోట్లా వ్యాపించింది. ఈ విశ్వం శక్తి స్వరూపిణి అయిన పరమేశ్వరిచే సృష్టించబడి శ్రీ విష్ణుమూర్తిచే సంరక్షింపబడుతున్నదనీ దీనిని చివరికి శివుడు విధ్వంసం చేస్తాడనీ - తమిళుల సంభావన. తమిళులలో అధిక సంఖ్యాకులు శివుణ్ని ప్రధాన దైవమని కొలుస్తారు.

### విశ్వము

భూగోళము, గ్రహాలు మరియు నక్షత్రాల స్వరూపము గురించి తమిళంలో అతి ప్రాచీన గ్రంధమయిన తొక కాప్పియంలో పేర్కొనబడి యున్నది. సముద్రయానములో తమిళులు ఆరితేరినవారు కావడం వల్లనే చలికీ, వానకూ ఎదురొడ్డి సుదూర దేశములయిన గ్రీసు రోమ్ లాంటి దేశాలకు వ్యాపారం కోసరం ప్రయాణం చేశారు. ఈ సాహసంవల్లనే తమిళుల ప్రపంచంలోని ప్రముఖ వాణిజ్య జాతులలో ఒకరుగా గుర్తింపబడ్డారు. పాశ్చాత్యులు తమిళులను సాహసవంతులనీ, ఉదార స్వభావు లనీ కొనియాడారు.

"యాదుం ఊరే యావరుం కేళిర్" అని పాడాడొక ప్రాచీన తమిళకవి. అంటే ఈ వసుధైక కుటుంబంలో అందరూ నావారే అని భావము. ఈ



Plate I    రథయాత్ర–ఉత్సవ దృశ్యం

భావమే తమిళుల వేదాంత సారముగా గుర్తింప బడినది. ఆ కాలపు జ్ఞానులు మాంత్రికులు, సిద్ధులు మున్నగు వారిని గురించి ఆసక్తికరమైన కథలు ప్రచారములో వున్నవి. ఉదాహరణకు—ప్రముఖ తమిళ కవయిత్రి అవ్వై తన మాటల ప్రభావముతో ఆకాశాన్ని "ఎన్ని నిచ్చెనలు వేసినా అందని చోటికి సాగిపో" అని శాసించిందట. ఆకాశం అలాగే వెళ్ళిపోయిందట. ఈ అవ్వై పసి పిల్లలకు అత్యంత ప్రీతి పాత్రురాలు. పాండ్య, చోళ, చేరరాజుల మధ్య రాజీ కుదుర్చుటకు పాటుబడిన దూతగా కూడా ఆవిడకి గౌరవము కలదు.

## సూర్యుడు

అతి ప్రాచీనకాలం నించీ తమిళనాడులో సూర్యుని పూజిస్తున్నారు. సూర్యుని "పలర్ తొళు జ్ఞాయిరి" (అందరూ పూజించే సూర్యుడు) అని పేర్కొన్నారు.

సూర్యుడు ఏడు గుర్రాలు పూన్చిన ఏక చక్ర రథమును అధిరోహించి మేరు పర్వతము చుట్టూ పరిభ్రమిస్తున్నాడని తమిళ ఇతిహాసంలో పేర్కొన బడింది. సూర్యాస్తమయం కూడా చంద్రగ్రహణంలాంటిదేనని వారి భావన.

చాలా మంది ఉదయ భానుని పూజిస్తారు. తమిళ మాసమైన తై నెల మొదటి తేదీన వచ్చే పొంగల్ పండుగ (సంక్రాంతి) సూర్యుని పూజకు ప్రత్యేక స్థానము వహిస్తుంది. ఆ రోజు సూర్యుడు దక్షిణాయణం నించి ఉత్తరాయణంలోకి (మకర సంక్రమణం) ప్రవేశిస్తాడు. ఇంకనూ పురాతన ఆచారములు అంటిపెట్టుకుని ఉన్న ప్రదేశాలలోని గృహస్థులు సంక్రాంతి రోజు సూర్యోదయ సమయమున తమ ఇంటి వసారాలోనో, గుమ్మం దగ్గరో పొంగలి వండుతారు.

సూర్య నమస్కారానికి కన్యాకుమారి చాలా పవిత్రమైన స్థలముగా పేరు గాంచినది. మూడు సముద్రాలయిన హిందూ మహాసముద్రమూ, బంగాళా ఖాతమూ, అరేబియా సముద్రమూ సంగమించే ఈ చోట సూర్యోదయము మరియు సూర్యాస్తమయము తప్పక చూడవలసిన దృశ్యములు.

భక్తిశీలురైన వారికి సూర్యపూజ తమ దైనందిన పూజక్రమములో ఒక అంతర్భాగము దేవాలయములలో సూర్యుని విగ్రహాలు కనిపిస్తాయి. వాటిలో మహాబలిపురములోని ధర్మరాజు రధములో చెక్కబడిన సూర్యుని ప్రతిమ అతి ప్రాచీనమైనది. పదకొండవ శతాబ్దములో తిరుచ్చి జిల్లాలోని గంగై కొండ చోళపురమున రాజేంద్ర చోళుడిచే నిర్మింపబడిన పెద్ద దేవాలయములో సూర్యయంత్రము చెక్కబడి వున్నది.

తంజావూరు జిల్లాలోని సూర్య నార్ కోయిల్ అనే ఊర్లో కులోత్తుంగ చోళుడిచే సూర్యుడి కోసరమే ఒక ప్రత్యేక దేవాలయము నిర్మింపబడినది. అందులో ఉష ప్రతి ఉష అనే సతుల సమేతముగా సూర్యుడికి విగ్రహము ప్రతిష్ఠింపబడివున్నది. పురాణకధనానుసారం సూర్యుడు తన చేతుల్లో పద్మములు కలిగి ఉంటాడు. అతని సతీమణులు తమ చేతులలో కలువపూలు కలిగి వుంటారు. సూర్యుడి వాహనమైన అశ్వమును సూచిస్తూ ఆ దేవాలయ ప్రాంగణమున ఒక అశ్వ విగ్రహము కూడా స్థాపించి వున్నారు.

కన్యాకుమారి దేవాలయంలో సూర్యోదయపు తొలికిరణాలు దేవీ విగ్రహం లోని ముక్కు పుడకపైన ప్రసరిస్తాయి. ఆవుడయార్ కోయిల్, తిరుప్పా పులియార్ గుళ్ళలోనూ మరియు కుంభకోణం నాగరాజ ఆలయంలోనూ ప్రతి ఉదయం సూర్యుని తొలికిరణాలు సూటిగా దేవుడి విగ్రహంపైన ప్రసరిస్తాయి. ఇంకా అనేక ధేవాలయములలో సూర్యుని తొలికిరణాలు సంవత్సరంలో ఏదో ఒక నిర్ణీత తేదీన దేవుడిపై పడతాయి.

దేవాలయ ప్రాకారము లోపల సూర్యుడికొక ప్రత్యేక స్థానమున్నది. సూర్య విగ్రహమును గర్భగుడి ముందర ప్రవేశ ద్వారములో ప్రతిష్ఠించడమన్నది ఆనవాయితీగా వస్తున్నది. అలాగే చంద్రుడి విగ్రహం గర్భగుడి నుంచి వెలుపలికి వెళ్ళే ద్వారములో ప్రతిష్ఠిస్తారు.

జనుల నివాస గృహములను పరిశీలిస్తే అవి సాధారణముగా గాలీ, వెలుతురూ, రావడానికి వీలుగా నిర్మింపబడినాయి. పెరళ్ళు, సూర్యరశ్మి సూటిగా

ప్రవేశించడానికి అనువుగా కట్టబడినవి. బావులు కూడా సూర్యరశ్మి సోకినీరు పరిశుద్ధముగా ఉండుటకు వీలుగా పైన మూకుడు లేకుండా కట్టబడినవి.

తమిళ పంచాంగము సూర్యుడి సంచారము పైననే ఆధారపడి ఉంటుంది. సూర్యోదయము నుంచి సూర్యాస్తమయము దాకా ఒక రోజుగా గుర్తింపబడుతుంది.

ఎవరైనా పగటి పూట ఆరు బయట వరండాలో పడుకుని నిద్రపోతే సూర్యుడి వేడిమివలన అతని దేహారోగ్యం దెబ్బతిని కళ్ళల్లో మంట పుడుతుందని చెబుతారు. గర్భిణీస్త్రీలు గ్రహణములప్పుడు సూర్యుని చంద్రుని చూడకూడదు. ఆ సమయంలో వాళ్ళు తమ వేళ్ళకి ఇనుప ఉంగరాలు తొడుగుకోవాలి. పసిపిల్లవాళ్ళు గాజు పెంకులకు పొగమసి పట్టించి అందుగుండా గ్రహణము లప్పుడు సూర్యునిగాని చంద్రునిగాని చూస్తారు.

ఇప్పటికిని గ్రామస్తులు రాసే క్రయ విక్రయ పత్రములలో "ఈ ఆస్తిని సూర్య చంద్రులు ఉన్నంత దాకా మీరు అనుభవింపవచ్చు" అని ఒక క్లాజు చేరుస్తుండటం గమనింపదగిన విషయం.

## చంద్రుడు

తమిళుల ఇతిహాసములలో చంద్రుణ్ణి మానసిక ఉల్లాసానికీ, ప్రేమకూ, అందానికీ ప్రతీకగా వర్ణించారు. పసిపిల్లలకు సాయంపూట గోరుముద్దలు తినిపించే తల్లులు వాళ్ళకీ చంద్రుణ్ని చూపించడం పరిపాటి "నిలానిలా ఓడివా" అనే పాపల పాట (తెలుగులో చందమామరావే లాంటిది) తమిళనాడులోని తల్లులకు ఎంతో ప్రీతిపాత్రము.

శుక్ల పక్షములో జన్మించిన పిల్లలు చాలా అదృష్టవంతులని నమ్ముతారు. ఒకవ్యక్తి జీవితకాలాన్ని గణించేటప్పుడు ఆయన ఎన్ని పౌర్ణమీలు దాటాడో లెక్కపెడతారు. ఒకవ్యక్తి 1008 పౌర్ణమీలు దాటితే అతనికి శతాభిషేకం (షష్ఠి పూర్తిలాంటిది) జరుపుతారు. ఇప్పుడిప్పుడు 80వ ఏట కూడా ఈ శతాభిషేకం జరుపుతున్నారు.

శరీరాన్ని ఎక్కువసేపు సూర్యరశ్మిలోనో వెన్నెలలోనో ఉంచడం ఆరోగ్యానికి హాని కలిగిస్తుందట

పెళ్ళి సమయాలలో హిందూ పురోహితులు సూత్రధారణకు సూర్య చంద్రులను సాక్ష్యాలుగా పేర్కొంటారు. పెళ్ళికూతురికి ఆకాశంలోని అరుంధతి నక్షత్రాన్ని చూపించి ఆవిడలాగా మహాసాధ్విగా వర్ధిల్లాలని హితోపదేశంచేస్తారు.

## జల ప్రళయం

ఒకానొక కాలములో పెద్ద జలప్రళయం సంభవించినదనీ షియాలీలో వెలసిన తోణియప్పర్ అనే దేవుడు (తమిళంలో తోణి అంటే పడవ) జన సంతతిని, జంతు వృక్ష జాలములనూ పడవలో ఎక్కించుకుని కాపాడాడనీ ప్రతీతి.

కుంభకోణంలో జరిగే మహామహం ఉత్సవం పైకథనాన్ని చాటిచెబుతుంది. ఈ ఉత్సవం గురించి "పండుగలూ పబ్బాలూ" అధ్యాయములో విపులంగా తెలుసుకుందాము.

ఈ ఉదంతాన్ని గుర్తుచేసే ఇతర సముద్రతీర ప్రాంతాలు—మహాబలిపురం (చెంగల్పట్టు జిల్లా) వేదారణ్యం, కావేరి పూం పట్టినం, కోడికరై (తంజావూరు) రామేశ్వరము, ధనుష్కోడి (రామనాథపురం) తిరుచ్చెందూర్ (తిరునెల్వేలి) మరియు కన్యాకుమారి, పౌర్ణమి మరియు అమావాస్య రోజులలో పైన పేర్కొన్న సముద్రతీరాలలో స్నానంచేసే యాత్రికులు అచ్చటి పురోహితుల ద్వారా ప్రత్యేక ప్రార్థనలు జరిపిస్తారు.

ఇంతకు మునుపు చెప్పినట్లు – తమిళనాడులోని దిగువభాగాన్ని పొట్టను బెట్టుకున్న జలప్రళయం గురించి తమిళప్రాచీన సాహిత్యం ప్రవచిస్తోంది. ఆ ప్రళయంలో మహ్రుళి, మరియు కుమారి అనుపేర్లుగల నదులూ మరియు పాండ్యచక్రవర్తుల రాజధానియైన కపటపురం అనే పట్టణమూ నీటిపాలయినట్లు చెప్పబడుతోంది.

(గమనిక:— 1965 ప్రాంతంలో రామనాథపురం జిల్లాలోని రామేశ్వరము మరియు ధనుష్కోడి సమీపములోని కొంత భూభాగము సముద్రములో

మునిగిపోయింది. అతిముఖ్యమైన ప్రాచీన శిల్ప సంపదలను సముద్రము బారినుండి కాపాడటానికి ఎప్పటికప్పుడు తగుచర్యలు తీసుకుంటూనే ఉన్నారు. మహాబలిపురములోని సముద్రతీర దేవాలయాన్ని పరిరక్షించడానికి పెద్దగట్టు నిర్మించారు. అలాగే తిరుచ్చెందూర్ మురుగన్ కోవెలను కాపాడడానికి దృఢమైన గోడ నిర్మించారు.)

సుచీంద్రములోని దేవాలయ రథము రథోత్సవాల సమయంలో ఊరేగింపుగా వెళుతున్నప్పుడు ఏదయినా అంతరాయం కలిగి మధ్యలో ఆగిపోయినట్టయితే ఇంకో జలప్రళయం సంభవించి ఈ సముద్రతీర ప్రాంతాన్ని నీటిపాలుచెయ్యడం ఖాయం అని ఇక్కడి జనులు నమ్ముతున్నారు.

అనాదినుంచీ సముద్రము ప్రజల పాలిటా భూభాగము పాలిటా తన క్రూరత్వాన్ని ప్రదర్శిస్తూనే ఉన్నది. మూడు సంగకాలములను గురించిన సాహిత్యము మూడుసార్లు సంభవించిన జలప్రళయంగురించి చెబుతోంది. పాండ్యులు తమరాజధానిని రెండుసార్లు మార్చవలసి వచ్చిందట. వారిమూడో రాజధాని అయిన మధురైకి సముద్రము పాలయినవారి మొదటి రాజధాని పేరే పెట్టబడిందని పురాతన సాహిత్యం చెబుతోంది.

చేర రాజుల రాజధానియైన 'కొల్లం'(Quilon) పేరుకూడా కుమారి నదికి దక్షిణవైపున ఉండి సముద్రములో మునిగిపోయిన ఒక పట్టణముపేరే అయ్యుంటుందని భావిస్తున్నారు.

చోళుల రాజధానియైన పుకార్ (కావేరి పూం పట్టినం)కూడా సముద్రముచే విధ్వంసము గావింపబడినదనీ అక్కడిప్రజలు నిరపాయకరమైన బీడుప్రదేశాలలోకి వలసవెళ్లి పోయారనీ చెప్పబడుతుంది. ఈ విపత్తు గురించి వర్తక జాతులమధ్య ఎన్నో కథలు ప్రచారంలో ఉన్నాయి.

## వర్షం

పాడి పంటలకూ ప్రాణకోటికీ జీవనాధారమైన వాన అందరికీ కావలసినదే. గ్రామీణ ప్రజలు సంవత్సరం పొడుగునా—రాబోయే వానగురించీ

అదనులో సరిగా పడనివాన గురించీ — చర్చించుకుంటూనే ఉంటారు. వాన గురించి అనేక మూఢనమ్మకాలు గ్రామీణ ప్రజలలో ప్రచారంలో ఉన్నవి. ఒక పతివ్రతా స్త్రీ శాసిస్తే వానకుండపోతగా కురవాలిసిందేనట; ప్రతినెలా భక్తుల కోసరం మూడువానలూ పాపులకోసరం మూడువడగళ్లు కురుస్తాయని చెబుతారు. వానకోసరం వరుణదేవుని ప్రార్థిస్తూ వరుణ యజ్ఞాలు జరుపుతుంటారు. దేవాలయములలో శివునివాహనమైన నందికి తరచు అభిషేకం చేస్తుంటారు. అలాచేస్తే కుంభవృష్టి కురుస్తుందని జనుల నమ్మకం.

దేవతల అధినేత అయిన ఇంద్రుణ్ణి ప్రసన్నం చేసుకోవడం కోసరం ఉత్సవాలు జరుపుతుంటారు. క్రీస్తుశకారంభంలో, పకాలంలో వానపడాలని కావేరి పూం పట్టినంలో ఇంద్రోత్సవాలు జరిగేవి. అలాగే చైత్రమాసంలో (ఏప్రిల్—మేనెలలు) మధురైలో ఇంద్రుడికి పూజలు జరుగుతాయి. వాన రప్పించడం కోసరం వర్షరాగంలోనూ మేఘ రాగంలోనూ పాటలుకూడా పాడుతారు.

తమిళుల వర్షఋతువులు ఆవణి—పురట్టాసి నెలల్లో ప్రారంభమవుతాయి. అంటే మన తెలుగునెలలైన శ్రావణము—భాద్రపదములలో అన్నమాట. ఈ కాలంలో సముద్రముపై మేఘాలు క్రమ్ముకుంటూ ఉంటాయి. వానగురించి చెప్పబడే ఐతిహ్యములలో ఇక్కడ కొన్నింటిని ప్రస్తావిస్తాము.

అంగారక గ్రహము కన్యారాశిలో ప్రవేశిస్తే వర్షాభావం తథ్యమనీ, సముద్రాలు కూడా ఇంకిపోవచ్చుననీ, చెబుతారు. ఎవరైనా అతధులని పెన్నంటి వానవస్తే ఆ వచ్చిన వారు గొప్ప ప్రజ్ఞావంతులనీ సహృదయులనీ వ్యక్తమవుతుంది. సంగకాలపు గ్రంథమైన పట్టిన ప్పాపై కథనం ప్రకారం "శుక్రుడు దక్షిణాభిముఖంగా సంచరిస్తే వానలు పడవు."

తిరునెల్వేలి జిల్లాలోని ప్రజల కథనామసారం నత్తగుల్ల ఒకానొక జాతి చెట్టుపైకి ప్రాకితే వర్షాభావం తప్పదు. కన్యాకుమారి జిల్లాలోని ప్రజలవిశ్వాసం ఏమిటంటే కాకులూ, కోళ్ళు, రెక్కలార్చుకుని నేలపైన గెంతితే వడగళ్ళ

వాన అనివార్యమట. ఈ జిల్లాలోని సామితోపు అనే గ్రామంలో వున్న బాపుటా వీచే దిశను బట్టి శుభాశుభాలను పసిగడతారు. అది దక్షిణ వైపుకు వీస్తే చేపలు విరివిగా దొరుకుతాయి. కాని సరిగా వాన పడదు. అది ఉత్తరానికి వీస్తే వర్షం పుష్కలంగా పడుతుందట.

ఈశాన్యదిశలో ఉరుములూ, మెరుపులూ వస్తే మంచి వర్షం పడుతుంది. చీమలు బస్తాలపైకి ఎగబ్రాకితే వర్షాభావము కలుగుతుంది.

ఆగ్నేయ దిశలోనూ (శ్రీలంక) వాయవ్యదిశలోనూ (కోయంబత్తూరు) ఏకకాలంలో మెరుపులు మెరిస్తే మధురై ప్రాంతంలో వర్షం రావచ్చును. ఈ మెరుపులను చూస్తూనే గ్రామీణ ప్రజలు తమ తమ గొడ్లు, గోదాములను దొడ్లలోకి చేరుస్తారు.

1963లో ఒక ముఖ్యమైన ఊరేగింపు కోసరం జరిగిన సర్దుబాట్లలో మధురైలోని వైగై నదీ తీరములో వున్న ఒక ఏనుగు విగ్రహాన్ని వేరేదిశకు మళ్ళించవలసి వచ్చింది. ఆనాటి నుంచీ ఆ ప్రాంతంలో దాదాపు ఏడేళ్ళ వరకూ సకాలంలో వానలు లేవు. మధురై నగర వాసులు ఈ అవాంతరానికి కారణం ఏనుగు విగ్రహాన్ని దిశ మళ్ళించడమేనని తలచి దానిని యథా స్థానములో పెట్టవలసిందిగా మొరపెట్టుకున్నారు. అలా చేసిన తరువాత అక్కడ భారీ ఎత్తున వానలు కురిశాయట. ఇక్కడ రాతి ఏనుగుచే శివుడు చెరకుగడ తినిపించాడని పురాణగాథ ఉన్నది.

ఉరుములు మెరుపులతో కూడుకున్న కుంభవర్షం కురిస్తే తమిళనాడులోని కేథలిక్కులు తమని ప్రకృతి వికటాట్టహాసం నుంచి రక్షింప వలసినదని క్రైస్తవ సాధువయిన బార్బరా (Barbara) ను వేడుకుంటారు.

పళియర్ అనే తెగవారు వానదేవుని ప్రార్థిస్తూ ఈ క్రిందిపాటను గానం చేస్తారు.

కుడ కుమ్మరత్తుక్కు
సీకు సంకటం వరామె-ఎంగళై

కొండు పొరుత్తుకాప్పాత్తణుమ్
నల్లమళై పెయ్యణుమ్
మణ్ పోట్టా పొవ్వా విళయణుమ్

అంటే—

ప్రాణకోటికీ పాడిపంటలకూ
రొష్టూ రోగం రాకుండా - మమ్మల్ని
పరిరక్షించి కాపాడాలి
మంచి వానల్లు కురవాలి
మట్టిలోంచి బంగారం పండాలి

అని అర్థము

అనాది కాలంనుంచీ కర్షకులు వాన కోసం వరుణ దేవుని ప్రార్థిస్తూనే వస్తున్నారు.

ఉదాహరణకు :-

వాగై మరత్తు పుంజై
వట్టార చోళ పుంజై
తంగమ్ విళైయుం పుంజై
తరిశా కిడిక్కు దడి
కాట్టై ఉళుదు పోట్టేన్
కదలై పోద పదం పార్త్తేన్ వంద మళై పోగుదిల్లే
వరుణనే ఉనదు చెయల్?

అంటే—

ఉన్నది వేసగి చెట్లు మాగాణి
జొన్నలు పండే మాగాణి
బంగారు పండే మాగాణి
బంజరుగా పడి ఉందని
దున్ని చదును చేశాను

తొలకరిలో గింజలు వెయ్యాలని
వచ్చినట్టే వచ్చి పోతావు
వానదేముడా ఏమి నీ లీల?

అని అర్థము

## నదులు

సామాన్య ప్రజల దృష్టిలో నదులు దేవతలుగా భావింపబడి పూజలందు కుంటున్నాయి. తమిళనాడులోని అనేక పట్టణాలూ, ముఖ్యగ్రామాలూ నదీ తీరములలోనే నెలకొని ఉన్నాయి. ఒక వ్యక్తి చనిపోయిన తరువాత దహన క్రియలు ముగిశాక ఆ చితాభస్మములో కొంచెము నదిలో కలుపుతారు. అలా చెయ్యటం వల్ల చచ్చిపోయిన వ్యక్తి స్వర్గం చేరుకుంటాడని నమ్ముతారు.

నదుల సంగమ ప్రదేశాలలో వెలసిన ఓడరేవులు అంతర్జాతీయ ఖ్యాతి గడించాయి. ఇప్పుడు అవి పురాతత్త్వ శాస్త్రజ్ఞులు పరిశోధనలకు నిక్షిప్త నిధు లుగా ఉపయోగ పడుతున్నవి. ప్రాచీన కాలపు ఓడరేవుల్ని పేర్కొనాలంటే- కావేరినదీ తీరాన వెలసిన కావేరి పూం పట్టణం, పాలారునది దగ్గిర వాసువ సముద్రము, గడిలం నదీతీరంలో కడలూరు, పొన్నయార్ అనుకుని ఉన్న పాండిచ్చేరి, దేవనదీ తీరంలో వున్న నాగపట్నం, తామ్రపర్ణి తీరాన వెలసిన కొరకై ముఖ్యముగా పేర్కొనవచ్చును.

నదుల కోసరం ఎన్నో ప్రత్యేకమైన ఉత్సవాలు జరుగుతాయి. తిరువ య్యారులో జరిగే సప్తస్తాన ఉత్సవం వాటిలో ఒకటి. ఈ ఉత్సవాన్ని పుర స్కరించుకొని ఇక్కడ ఏడు ప్రాంతములలోని దేవుళ్ళు కలుసుకుంటారు.

గంగానదితో తమిళులకున్న సంబంధం సంగకాలపు సాహిత్యములోనే పేర్కొనబడినది. దైవభక్తిగల తమిళులు కాశీయాత్రకు వెళ్ళి ప్రయాగవద్ద పవిత్ర గంగాజలంలో, ఇటీవల మరణించిన తమ బంధువుల భస్మమును కలిపి, స్నానం చేస్తారు. తమ ఇళ్ళలో జరిగే ముఖ్యమైన శుభకార్యాలలో వినియోగించడం కోసరం పవిత్ర గంగాతీర్థాన్ని తీసుకుని వస్తారు. ధనవంతు

లయితే దేశంలోని అన్ని ముఖ్యనదుల తీర్థాలూ సేకరించి తమ 61వ మరియు 81వ జన్మదినఉత్సవముల కోసరం భద్రపరుస్తారు.

గంగానదిలోకెళ్ళి స్నానము చేయ వీలుపడని వారికి తేవారం గ్రంధము కావేరి నదిని ప్రత్యామ్నాయముగా పేర్కొంటున్నది. అనాది నించీ గంగా నది హిందూదేశపు జాతీయనదిగా వర్ధిల్లుతున్నదనడానికి నిదర్శనంగా గంగా నదిని గురించిన వివరాలు తమిళ ప్రాచీన గ్రంధాలయిన, పెరుంపణరుప్పడై మధురై కాంచి, పట్టిన ప్పాపై పురనానూరు, మున్నగు గ్రంధాలలో దొరుకతవి.

కావేరినదికి పురాణకాలంనుంచీ చాలా ప్రాముఖ్యత ఇవ్వబడినది. ఇక్కడ ఆడపిల్లలకి ఆనది పేరు పెట్టడం అలవాటు. కావేరి నది పురాణకాలపు ఋషి అయిన అగస్త్యుని కమండలంనుంచి ప్రవహిస్తున్నదని ప్రతీతి. ఒక కాలంలో అగస్త్యుడు దక్షిణదేశ పర్యటనలో ఒకరోజు ముఖ ప్రక్షాళనం కోసం కూర్చొని వుండగా ఒక కాకి అతని కమండలమును బోర్లించినదట. ఆ కమండలము లోని నీరే కావేరినదిగా ప్రవహిస్తున్నదని పురాణాలు చెపుతాయి. కర్ణాటక రాష్ట్రములోని కూర్గువద్ద పుట్టి తమిళనాడు తీరంలో బంగాళాఖాతంలో కలిసే వరకూ కావేరినదికి అక్కడక్కడా అనేక స్నాన తీర్థములు ఉన్నాయి.

మత విశ్వాసముగల ప్రతి తమిళుడూ కనీసం ఒక్క సారయినా కావేరిలో మునిగి తీరాలని అనుకుంటాడు.

కావేరినది రెండు పాయలుగా చీలే (కావేరి, కాళ్ళిదం) తిరుపరైతురై అనేచోట (తిరుచ్చి జిల్లా) ఐప్పసినెల మొదటి తారీఖున మునకవేస్తే అత్యంత పవిత్రమని చెబుతారు. ఐప్పసి (ఆశ్వయుజము) నెలలోని ముప్పయిరోజులు కావేరి నది స్నానతీరాలు పవిత్రస్నానం కోసరం వచ్చే యాత్రికులతో క్రిక్కిరిసి ఉంటాయి.

మాయవరం వద్ద ముదవన్ ముళుక్కు (అవిటివాడి మునక) అనే ఒక స్నాన తీరము ఉన్నది. అందులో కార్తిగై నెల (కార్తిక మాసం) ఒకటో తారీఖున స్నానం చెయ్యడం అతి పవిత్రమని భావిస్తారు. దీనికొక స్థల పురాణము కలదు పూర్వం ఒక అవిటివాడు కావేరినదిలో స్నానం చెయ్యలేని

తన అసహాయతను తలచుకుని విలపిస్తుంటే దేవుడు అతని కోరికను పూర్తి చేశాడట. ఆ అవిటివాడు కార్తిగై నెల మొదటిరోజున కావేరిలో స్నానం చేసి ముక్తిపొందాడట. అప్పట్నించీ ఆస్థలానికి ముడవన్ ముళుక్కు అని పేరు వచ్చింది.

రెండు పాయలుగా చీలిన కావేరి నదిచే పరివేష్ఠింపబడిన శ్రీరంగం అన బడే ద్వీపముకూడా ఒక పవిత్ర పుణ్య తీర్థ స్థలముగా ప్రసిద్ధిగాంచినది. "ఆరు రెండుం కావేరి అదన్ నడువే తిరువరంగం" (రెండుగా చీలే కావేరి, మధ్యలో వెలిగే శ్రీరంగం) అనే జానపద గేయం కావేరి ఘనతను శ్లాఘి స్తుంది.

కావేరిలో స్నానం చేసేటప్పుడు గ్రామీణులు గవ్వలూ, వెండి, బంగారంతో చేసిన చేపల బొమ్మలు, కొబ్బరికాయలు, చెవిపోగులు, నల్ల పూసలు మున్నగు వాటిని కానుకలుగా నీటిలో సమర్పిస్తారు.

ఒక్కమాటలో చెప్పాలంటే – తమిళుల చరిత్ర, పురాణేతిహాసాలూ, పాటలూ, మనుగడా – అన్నీ కావేరి నదితో ముడిపడి అందులో ప్రవహించే అలల్లో అంతర్భాగంగా కనిపిస్తాయి. అనవరతమూ ప్రవహిస్తూ ఎన్ని మార్పులకి గురయినా ఇంకా కావేరినదిగానే నిలిచిఉంది. అది తమిళుల ప్రాచీన సంస్కృతికీ, నాగరికతకూ చిహ్నంగా నిలిచింది. తాతముత్తాతలు అందులోనే స్నానంచేశారు. మనుమళ్లూ, మునిమనుమళ్లూ ఆ నదీమతల్లి ఒడిలోనే ఆడుకుంటారు.

## దేవుళ్లూ, దేవతలు

తమిళ దేశాన్ని పరిపాలించిన అన్ని వంశాలవారూ దేవాలయ నిర్మాణము లోనూ పూజా ఉత్సవాలలోనూ అమితశ్రద్ధ తీసుకున్నారు. తమిళదేశానికి కొత్తవారయిన పల్లవులుసైతం తమిళుల పూజా పద్ధతులను ఆకళించుకునివాటి సమున్నతికోసరం పాటుబడ్డారు. పల్లవులు శిథిలాలయములను మరమ్మతు చేయడమేకాక కొత్తదేవాలయములు నిర్మించారు. పల్లవుల తర్వాత పరిపా

లించిన చోళులు నాలుగు వేదాలలోను ఆరితేరిన బ్రాహ్మణుల కోసరం చతుర్వేది మంగళం అనబడే అగ్రహారములు నిర్మించారు. అయినా తరతరాలుగా దేవాలయ పురోహితులుగా వస్తున్న ఆదిశైవులయిన శివాచార్యుల హక్కులకూ అధికారములకూ భంగము కలుగకుండా చూశారు.

సంగకాలములో పంచవర్గాలుగా విభజింపబడిన ప్రదేశాల అధినేతలయిన ఐదు దేవుళ్లని మాత్రం పూజించేవారు. కొండప్రాంతములకు మురుగన్ పచ్చిక బయలుకు తిరుమాల్ (విష్ణు) ఎడారికి దుర్గ నదీ ప్రాంతములకు ఇంద్రుడు సముద్రతీరాలకు వరుణుడు అధినేతలుగా గుర్తింపబడ్డారు. పల్లవుల రాకకు పూర్వము ఇక్కడ దైవపూజలు అంతవిస్తృతంగా జరిగినట్టు కనబడదు. పల్లవులు మొదలుకొని విజయనగర సామ్రాజ్య పతనమువరకు తమిళ దేశములోని మారుమూల గ్రామములలోసైతం ఆర్యుల దేవుళ్ల దేవతల విగ్రహాలు ఎక్కువగా ప్రతిష్ఠింపబడినవి. పర్యవసానంగా ద్రావిడ దేవుళ్లు దేవతలు వెనుకకు నెట్టివేయబడ్డారు. దీనిని గురించి "ఒండవంద పిడారిఊర్ పిడారియై విరటిట్రు" అనే సామెత పుట్టింది. అంటే తలదాచుకోవడానికి వచ్చిచేరిన అమ్మవారు ఊళ్లో శాశ్వతంగా ఉంటున్న అమ్మవారిని వెళ్లగొట్టేసిందని భావం.

బ్రాహ్మణులచే పూజింపబడే దేవుళ్లు వరుసగా వినాయకుడు, శివుడు, విష్ణువు మరియు ఆయాదేవుళ్ల భార్యలు. తమిళనాడులో మిక్కిలి ప్రాముఖ్యత వహించే దేవుడు వినాయకుడు. గణపతి విగ్రహాలను చెట్లక్రింద, చెరువు గట్టుపైన, నదీతీరాలలోసైతం చూడవచ్చును. మళ్లీ ఇప్పుడు వినాయకుడు కోసరం కొత్తకొత్త దేవాలయములు వెలయుచున్నవి. ఒక్కొక్కప్పుడు పోరంబోకు భూమిని ఎవరైనా పట్టాపొందకుండా ఆపడంకోసరం లేదా ఆ చోట రోడ్డు పడకుండా నిరోధించడంకోసరం వినాయకుని విగ్రహాన్ని ప్రతిష్ఠించడంకూడా జరుగుతుంటుంది.

మాతృదేవతను ఆరాధించడమన్నది మొహంజొదారో-హరప్పా నాగరికతల

కాలంనించీ ఆనవాయితీగా వస్తున్నది. ఆమె ముఖ్యంగా మహిషాసుర మర్దిని అయిన దుర్గ అనే పేరుతో పూజింప బడుతున్నది. ఇంకా అనేక గ్రామదేవ తల రూపములోనూ ఆవిడ పూజలందుకుంటున్నది. మైలాపూర్ గుడిలో ఆవిడ కర్పగాంబాళ్‌గానూ, కాంచీపురంలో కామాక్షిగానూ, చిదంబరంలో శివకామిగాను, తిరుకడపూర్ అభిరామిగాను, తిరువిడై మరుదూర్‌లో ముఖాంబికగాను, మధురైలో మీనాక్షిగాను, తిరునెల్వేలిలో కాంతిమతిగాను, వివిధ నామధేయములతో పూజింపబడుతున్నది.

సిరిసంపదలకు ఆలవాలమైన శ్రీలక్ష్మికూడా అతిముఖ్యమైన దేవత. సంపదలు వద్దనేవ్యక్తి ఎవడూ ఉండడు కదా ? ప్రతిఇంట్లోనూ లక్ష్మీదేవి పటములు ముఖ్యమైన చోట్లను అలంకరిస్తాయి లక్ష్మిచిత్రాలు, విగ్రహాలు పెళ్లిళ్లలో కానుకలుగా చదివింప బడతాయి. ఆడపిల్లలకు లక్ష్మిపేరు పెట్టడం మామూలుగా చూస్తున్నాము. నూతన గృహప్రవేశ సమయంలో ఇంటి యజమాని లక్ష్మి అనేపేరుగల అమ్మాయిని పిలవడంకద్దు. అనివార్యకారణాలవల్ల ఆ పేరుగల అమ్మాయి ఆ సమయంలో అక్కడికి వచ్చివుండకపోతే అది దురదృష్టాన్ని సూచిస్తుందని నమ్మిక.

# 3 వ అధ్యాయము

## మతమూ, మాయాజాలములు

### పూజలు, వ్రతాలు

జనసామాన్యుల జీవన విధానంలో మతం కీలకమైన పాత్ర వహిస్తుంది. నిజానికి పుట్టినది మొదలు గిట్టే వరకూ జనులు ఏదో విధమైన పూజా పునస్కారాలు చేస్తూ ఉపశమనం పొందుతూ ఉంటారు. ఈ పూజా పునస్కారాలూ, కర్మకాండలూ, జరపడం వల్ల ఆరోగ్య సౌభాగ్యములు వర్ధిల్లుతాయని సామాన్య జనులు విశ్వసిస్తారు.

### మతము ద్వారా జాతీయ సమైక్యత

భారత జాతి ఐకమత్యాన్ని పెంపొందించుటలో హిందూమతం వహించిన పాత్ర కీలకమైనది. హిందూ మతస్థులు, పవిత్ర క్షేత్రాలు, జ్యోతిర్లింగములు మరియు అనేకమైన పూజలూ, ఉత్సవములూ, దేశమంతటా వ్యాపించి వుండటమే దీనికి తార్కాణము.

రామేశ్వరమూ, కాశీ ఒకే నదికి చెరో వైపున వున్న జంటనగరాలా అన్నట్లు వాటిని గురించి ప్రజలు ముచ్చటిస్తుంటారు. ఏ హిందువుకైనా రామేశ్వరం సందర్శించకపోతే అతని కాశీయాత్రను అసంపూర్ణంగానే భావిస్తారు.

రామేశ్వరము తమిళనాడులో వెలసి ఉన్నందున తమిళులకు కాశీని సందర్శించాలనే కుతూహలం ఎక్కువగా ఉంటున్నది.

తమిళనాడులోని చెట్టినాడుకు చెందిన చెట్టియార్ల ఆధ్వర్యాన కాశీవిశ్వనాథుని ఆలయమున రోజూ ముప్పూటలా సక్రమముగా సజావుగా సేవలు జరిపించ బడుతున్నవి. ఇంకా కాశీలోని శివాలయంలోనూ, మాతేశ్వరి అన్నపూర్ణ ఆలయంలోనూ, విశాలాక్షి దేవాలయంలోనూ, సేవలు జరుగుతాయి.

కాశీని సందర్శించే ప్రతి ఒక్కరూ విశ్వనాథ ఆలయంలో సాయం సమ యానజరిగే హారతిని (బడాపూజ) తప్పక వీక్షిస్తారు. అది తమిళుల సాంప్రదా యానుసారం జరుగుతుంది. అతి పురాతన నగరమైన కాశీ వైదిక జీవన విధా నంలో ఇదొక ప్రముఖ అంశము.

ఈ సేవలను సక్రమముగా నడిపించుటకోసరం చెట్టియార్లు వారణాసిలోనూ, ఉత్తరప్రదేశ్ మరియు బీహారు రాష్ట్రములలోని ఇతర ప్రాంతాలలోనూ, ధర్మ సంస్థలు నెలకొల్పి యున్నారు. వారణాసిలోని గుడోలియా ప్రాంతములో వున్న నాట్టుకోట్టై చత్రభవనము పేర్కొనదగినది. ఇక్కడ నుంచి రోజూ ఉదయమూ సాయంత్రమూ నాదస్వర సమేతంగా విశ్వనాథుని అభిషేకము కోసరం పాలు, తేనె, పన్నీరు తదితర సుగంధద్రవ్యాలు ఊరేగింపుగా తీసుకుని వెళతారు. సేవలు జరుగుతున్నప్పుడు తేవారం పాటల రికార్డులు వేస్తారు. క్విట్ ఇండియా ఉద్యమాలతో కాశీలో మామూలు పౌరజీవనం స్తంభించి పోయినప్పుడు కూడా—పైన పేర్కొన్న ఊరేగింపు కార్యక్రమాలు నిరాఘాటంగా కొనసాగేవి.

కాశీయాత్రకు బయలుదేరే తమిళులు తొలుత రామేశ్వరం సందర్శించి అక్కడ వెలసిన ఒక బావిలోని తీర్థమయిన కోటితీర్థమును తీసుకుని కాశీకి వెళతారు. ఆనీటితో విశ్వనాథుని విగ్రహమును అభిషేకిస్తారు. అక్కణ్నించి తిరిగి వచ్చేటప్పుడు హరిద్వారము వద్దనో లేదా త్రివేణి సంగమము వద్దనో పవిత్రగంగాజలమును తీసుకొని వచ్చి దానిలో రామేశ్వరములోని రామ లింగేశ్వర విగ్రహాన్ని అభిషేకిస్తారు.

రామేశ్వరం సముద్ర తీరమునుంచి గంగలో కలుపుట కోసరం పిడికెడు

ఇసుక తీసుకొని వెళతారు. బీహారు రాష్ట్రములోని గయవద్దనున్న ప్రయాగ వద్ద త్రికరణ శుద్ధిగా పిండం సమర్పిస్తారు.

తంజావూరు జిల్లాలోని తిరుప్పానందల్‌లోని ఒక మత సంస్థ తన ముఖ్య కేంద్రమును కాశీలో స్థాపించినది. ఈ సంస్థకు పారంపర్యంగా జ్ఞానధనుడూ ధర్మనిరతిగల వాడూ అయిన ఒకగురువు మఠాధిపతిగా ఉంటాడు. పదహారవ శతాబ్దిలో ఈ మఠానికి చెందిన కుమార గురుపరర్ అనే సన్న్యాసి ఎన్నో శక్తులూ మహిమలూ కలిగి ఉండేవాడని చెబుతారు.

గొప్ప మత ప్రవక్తలయిన శంకరాచార్యులు దేశంలోని వివిధ ప్రాంతాలలో - అంటే - పడమట ద్వారకలోను, తూర్పున పూరిలోను, ఉత్తర ప్రదేశ్‌లోని జోషివద్దను, మరియు దక్షిణమున శృంగేరి, కాంచీపురముల లోనూ తమ పీఠములను నెలకొల్పివున్నారు, వీటన్నింటిలోనూ అతి ప్రాముఖ్యం వహించే కామకోటి పీఠం తమిళనాడులోని కాంచీపురంలో స్థాపింపబడి వున్నది. ఇవన్నీ జాతీయ సమైక్యతకు దోహదం చేస్తున్నాయి.

శంకరాచార్య మఠము, వైష్ణవుల నలందలనేరి మఠములేకాక తమిళనాడులో ఇంకా అనేక ఆశ్రయములు, పీఠములు కలవు. వాటిల్లో ధర్మపురము, తిరువావడు తురై మరియు మధురైలోని ఆధీనములు పేర్కొన దగినవి. తిరుప్ప నందల్ మఠము గురించి ఇంతకుపూర్వమే పేర్కొన్నాము.

తమిళనాడులోని మఠములు తమకంటూ ప్రత్యేకంగా దైనందిన పూజా కార్యక్రమములూ, ఉత్సవాలూ రూపొందించుకుని ఉన్నాయి ఒక మఠము యొక్క ప్రధాన కేంద్రములో జరిగే పట్టణప్రదేశము అనబడే ఉత్సవము అతి ప్రాముఖ్యత వహిస్తుంది. అంటే ఆ మఠాధిపతి దేదీప్యంగా అలంకరింపబడిన పలకిని అధిరోహించి ఆ ఊరిలోకి ఊరేగింపుగా తీసుకురాబడుతాడన్నమాట. పీఠాధిపతి సాలంకృతుడై పల్లకిలో ఎదుట సాష్టాంగ నమస్కారాలు చేస్తారు. ఈ ఊరేగింపులో మంగళవాద్యాలతో బాటు గ్రామీణ నృత్యాలు లాంటివి కూడా ఏర్పాటు చేస్తారు. పురజనులు తమ తమ ఇళ్ళ

గుమ్మాలలో పల్లకి రాకకోసరం ఎదురుచూస్తూ పూర్ణకుంభములతో వేచి యుంటారు. పల్లకి తమ ఇంటి చెంతకు రాగానే కుంభములోని పవిత్ర జలముతో పీఠాధిపతి పాదములను అభిషేకించి అతనికి బంగారు, వెండి, పళ్ళు, పూలు కానుకలుగా సమర్పిస్తారు.

గ్రామీణ కళలను పోషించడంలోనూ, ప్రోత్సహించడంలోనూ, తమిళ నాడులోని మఠాలు శ్రద్ధ చూపుతున్నవి. కంచి కామకోటి పీఠాధిపతి అప్పు డప్పుడు పండితులచే సదస్సులు జరిపించడం మెచ్చుకోదగిన విషయము.

## క్రైస్తవుల ఆచారములు

తమిళనాడులో అన్ని మతముల వారునూ శాంతియుత సహజీవనం చేస్తు న్నారు. హిందూ వ్యాపారస్తులూ, చిల్లరకొట్టు యజమానులూ, తమ క్రింద అన్య మతస్తులను నియమించడం సామాన్యముగా చూస్తున్నాము.

పాశ్చాత్యుల మిషనరీల పుణ్యమా అంటూ, తమిళ దేశంలో మిక్కిలి వెనకబడిన ప్రాంతాలలోని జనులు సైతం విద్యావంతులైనారు. ప్రపంచానికి ఆంగ్లభాష ద్వారము లాంటిది అనే సత్యాన్ని వీరు గుర్తించారు.

క్రీస్తుమత సంస్థలు మారుమూల గ్రామాలలో సైతము అతి ఉన్నత ప్రమాణములతో కూడుకున్న వైద్య సౌకర్యములను అందజేశాయి. కన్యా కుమారి జిల్లాలోని నాగర్‌కోయిల్‌లో వున్న కేథరిన్ బూత్ హాస్పిటలు, నెయ్యూరులోని లండన్ మిషన్ హాస్పిటల్, తిరునెల్వేలి జిల్లాలోని తోవనూర్ ఫెలోషిప్ హాస్పిటలు, రామ్‌నాద్ జిల్లాలోని తిరుపత్తూరులోని స్వీడిష్ మిషన్ హాస్పిటలు, చెంగల్పట్టు జిల్లాలోని తిరుమణిలోనున్న బెల్జియన్ లెప్రసీ సెంటర్-ఇంకా అనేక ఇతర సంస్థలు కుగ్రామ ప్రజలకు సైతము అతి అధునాతనమైన పద్ధతిలో వైద్య సౌకర్యాలు కల్పిస్తున్నాయి, వీటన్నిటిలోనూ తలమానికమైనది, వేలూరులోని క్రిష్టియన్ మిషన్ హాస్పిటల్. ఇది వైద్యము లోనూ, విద్యా సౌకర్యములలోనూ, పరిశోధనలు జరుపుటలోనూ ప్రపంచ ప్రఖ్యాతి గాంచినది. ఇక్కడ వేలాది రోగులకు విపులమైన కేస్ హిస్టరీలు భద్రపరచి ఉంచుతారు.

క్రైస్తవ మతసంస్థలు తమిళ సాహిత్యాన్ని కూలంకషంగా పరిశీలించడమే కాక హిందూమత గ్రంథాల్నికూడా పరిశోధించాయి. బైబిలు గ్రంథము ఆసియా భాషల్లో తమిళంలోనే తొలుదొల్త అనువదింపబడి గ్రంథముగా వెలువడినది. హిందువుల భక్తి గీతాల బాణీలలో క్రైస్తవమత గీతాలు రాయబడి నాయి. బైబిలు తమిళములోకి అనువదింపబడటం వల్ల చర్చిలలో ప్రార్థనా కార్యక్రమాలుకూడా తమిళంలోనే జరిగడం మొదలైనది. హిందూ దేవాలయములలో కేవలం సంస్కృతంలోనే పూజలు జరుగుతుంటే చర్చిలలో తమిళం గుర్తింపబడటం ఒక విశేషమేకదా!

ఏసుక్రీస్తుయొక్క ప్రముఖ ధర్మదూత సెయింట్ థామస్ తన మతప్రచారం కోసరం తమిళనాడును ఎన్నుకొన్నాడు. ప్రపంచప్రఖ్యాతి గాంచిన మద్రాసు సముద్ర తీరములోని శాంతోమ్ దగ్గిర అతను తనువు చాలించాడు. అక్కడే అతనికి సమాధి కట్టారు. సెయింట్ థామస్ గురించి నేటికిని ప్రచారంలో ఉన్న జానపద కథలు క్రైస్తవ మతస్థులని ఉత్తేజితుల్ని చేస్తాయి.

మద్రాస్ నగరంలోని ఆర్మేనియన్ వీధిలోని సెయింట్ మేరీస్ చర్చిలో మంగళవారం జరిగే ప్రార్థనల్లోనూ, తంజావూరు జిల్లాలో వేలాంగణ్ణి దగ్గిర వున్న "చర్చి ఆఫ్ దిలేడీ ఆఫ్ హెల్త్" లో పండగ రోజుల్లో జరిగే ప్రార్థనల్లోనూ హిందువులు సైతం పెద్దసంఖ్యలో పాలు పంచుకుంటారు.

హిందూ దేవాలయములకోసరం క్రైస్తవులూ, ముస్లిములూ విరాళములిచ్చి వున్నారు. యురోపియన్ ప్రభుత్వోద్యోగులు మధురై మీనాక్షికి నగలూ, భవాని దేవికి పల్లకి కానుకలుగా సమర్పించారు. మహబూబ్‌ఖాన్ కోసరం మంటపం నిర్మించడం, తిరుత్తణి దేవాలయములో ముస్లిముల వాద్యమైన షెహనాయ్ వాయించడం—ఇవన్నీ మత సహిష్ణుతకు తార్కాణములు. హిందువులు కూడా మసీదులకు, చర్చిలకు ఉదారముగా విరాళములిచ్చారు, ఇస్తున్నారు.

మతముల మార్పిడి దక్షిణ తమిళనాడులో పెద్దఎత్తున జరిగింది. అయినా హిందువులు మతంమారినా తమ పాత ఆచార వ్యవహారాలను వదలలేక

పోయారు. వాటిల్లో అమావాస్యను పాటించడం ఒకటి. అమావాస్య ఒక్క పొద్దు వదిలిన తర్వాత ఈ హిందూ క్రైస్తవులు విస్తళ్లను బయట పారవేయ డానికి భయపడి తమ ఇంటి చూర్లలో దాచడం ఆనవాయితీ అయింది. వాళ్లు క్రైస్తవ మతగురువులకి భయపడి అలా చేస్తున్నారన్నది వాస్తవం.

## హిందువుల పూజా పద్ధతులు

దైవభక్తిగల అన్నివర్గాల ప్రజలూ రోజూ తమ ఇళ్లలోని పూజామందిరా లలో, పూజా గదులలో ప్రార్థనలు చేస్తారు. ఉడవయవర్ పూజల్లాంటివి చాలా విస్తృతంగా జరుగుతాయి.

గుళ్లలో కడు భక్తి శ్రద్ధలతో దీపారాధనలు జరుగుతాయి. దేవాలయములు గతకాలానికీ వర్తమానానికీ వారధిలా నిలచి ఉన్నాయి. శ్రీరంగం, రామే శ్వరం దేవాలయముల పునరుద్ధరణలో 'యునెస్కో' పాలుపంచుకోవడం చూస్తే - వాస్తుకళలోను, శిల్పసంపదలోను, కొయ్యచెక్కడములలోను, అనన్య సామాన్యములై వెలుగొందే పాతదేవాలయములను భద్రముగా రక్షింపవలసిన బాధ్యత యావత్ మానవజాతిపైన ఉన్నదిఅనే విషయం వ్యక్తమవుతుంది.

## తేరులాగుట

భక్తులు చిన్నచిన్న రథములకు బంధించిన త్రాటిని ఇనుప కొక్కెము తమ వీపుల్లో గుచ్చుకుని బాధలకు ఓర్చుకుని లాగుతారు. దేవుడి పేర్లను ఉచ్చరిస్తూ భక్తులు తీక్ష్ణమైన ఎండల్లో సైతము ఈ రథములను మెల్లతరబడి లాగుతారు. కొందరు నాలికలను బయటకిచాచి అందులోచిన్న ఈటెల లాంటివి గ్రుచ్చుకుంటారు. (వేల్ అనబడే ఈటె సుబ్రహ్మణ్యస్వామి ఆయుధము)

దారి పొడువునా పురజనులు భక్తులపైన చన్నీరు, పన్నీరు చందనమూ చల్లుతూ ఉంటారు. అలాచేస్తే భక్తులకు ఎండతీవ్రత తగ్గుతుందని వారి భావన. ఈ తతంగం హిందువుల కఠోరమైన భక్తిని ఎత్తి చాటుతుంది.

చివరగా ఈ భక్తులు ఎండను భరిస్తూ, వీపుతో రథమును లాగుతూ, చోటిలో ఈటెల నొప్పికి తట్టుకుంటూ నిప్పులపైన నడుస్తారు. అన్నీ ముగి శాక వీరు రథములోని పాలకుండమూ, చందన ద్రవమునూ, విబూధినీ దేవుడిపై పోస్తారు. ఈ భక్తులు భక్తిపారవశ్యముతో తమ ఒంటి బాధల్ని మరచిపోయి దేవుడి ముందర నిలబడతారు.

వీళ్ళు వ్రతము ఆచరించే రోజులలో తమకాలికి ఇనుప ముళ్లు గ్రుచ్చిన కొయ్య చెప్పులు వాడుతారు. వాళ్ళు ఎన్ని బాధలాయినా భరించి తమ వ్రతమును పూర్తి చేస్తారు. ఈ విధముగా రథము లాగాకోరే భక్తులు చాలా కఠోరమైన నియమములు పాటింప వలసి వుంటుంది. ఒకనెల రోజులు ఉప వాసం కూడా ఉంటారు.

## పాలకుండ

దేవుడి అభిషేకం కోసరం కడవలో పాలు తీసుకునిపోతారు. ఈ కుండలను నెత్తిన ఉంచుకుని స్త్రీలు చాలాదూరం నడచి పోతారు. కాని తలమీద నున్న కుండలు తొణకవు. వాటిని చేతులతో పట్టుకోరు. ఒక్కొక్కప్పుడు ఈ భక్తులు పూనకము వచ్చి పరుగునా వెళ్ళడమూ కద్దు. అయినా వారి తలపైన కుండలు ఎట్టి పరిస్థితుల్లోనూ క్రిందికి జారవు. ఇలా తీసుకువెళ్ళిన పాలతో దేవుడిని అభిషేకిస్తారు. ఈ తంతును "పాల్కుతం" అంటారు.

## చంధన కుంభం

'చందనకుడమ్' అనే తంతుకూడా 'పాల్కుడమ్' లాటిదే. కుండలలో చందన ద్రవమును తీసుకొని వెళ్ళి దేవుణ్ణి అభిషేకిస్తారు. ఈ తంతులలో భక్తులు విడివిడిగా గానీ గుంపులు గుంపులుగా గాని పాల్గొంటారు. ఈ గుంపు లలో బంధువులు, స్నేహితులు, పురోహితులు, మంగళ వాద్య సమేతముగా కలిసి వెళతారు.

## కొబ్బరికాయలు కొట్టుట

తమిళనాడులోని ప్రజలు గణేశుని (వినాయకుడు) ఎక్కువగా పూజిస్తారు. తమ కార్యకలాపాలలో ఎలాటి విఘ్నములు రాకుండా చూడాలని అతనికి మొక్కుకుంటారు. వినాయక పూజలలో దేవుడి ఎదుట కొబ్బరికాయలు నేల కేసి కొట్టడం పరిపాటి. ఈ విధంగా చేస్తే దుష్టశక్తులు తొలగిపోతాయని నమ్ముతారు. వినాయకుడికి కుడుములు నివేదించి పిల్లలకు పంచిపెడతారు.

## మహాపురుషుల జన్మస్థలములు

మహాత్ముల జన్మస్థలములకును వారు ముక్తి పొందిన స్థలములకును అత్యంతగౌరవము ఇవ్వబడుతుంది. వారి జ్ఞాపకార్థం ఆస్థలములలో దేవాలయమో, స్తూపమో, లేదా ఒక స్మారకచిహ్నమో తప్పక నిర్మింపబడివున్నది. అలాటి పవిత్ర స్థలములలో కావేరీనదీ తీరమున కరూరు నానుకుని ఉన్న నేరూరువద్ద వెలసిన ఒక వృక్షము (ఇక్కడ సదాశివ బ్రహ్మేంద్రస్వామి పరమ పదించారు.) అప్పర్ ఋషి జన్మించిన తిరువామూరు (దక్షిణ ఆర్కాటుజిల్లా) భగవాన్ రమణ మహర్షి జన్మస్థలమయిన తిరుచుళియల్, రమణాశ్రమము వెలసిన తిరువణ్ణామలై మరియు రామానుజాచార్యులు జన్మస్థలమైన శ్రీ పెరుం బుదూరు - ముఖ్యమైనవి.

ముని, బైరాగి మున్నగువారి జ్ఞాపకార్థం రహదార్లలో శిలా ప్రతిమలు ప్రతి ష్ఠింపబడి వున్నాయి. వారి అనుగ్రహము పొందుటకై తమ పసిపాపలకు మునియన్ మునసామి ఇంకా మునియాండి లాంటి పేర్లు పెట్టడం పరిపాటి.

గొప్ప గొప్ప పండితులకూ కవులకూ స్మారకచిహ్నాలు నెలకొల్పి వారికి యథోచితమైన గౌరవము ఇస్తున్నారు. తమిళుల మహాకవి తిరువళ్ళువర్ జ్ఞాపకార్థం మద్రాసులోని మైలాపూర్ ప్రాంతంలో చిన్న గుడి నిర్మించి వున్నారు. ఇంకొక మహాకవి కంబన్ జ్ఞాపక చిహ్నంగా నాట్టరసన్ కొట్టై అనే ఊర్లో సమాధి నిర్మింపబడి వున్నది. చిన్న పిల్లలకి అక్షరాభ్యాసం

మొదలెట్టేటప్పుడు కంబన్ సమాధి చెంతనున్న మట్టి తీసి వాళ్ళ నొసట్లో పూస్తారు. అలా చేస్తే ఆపిల్లలు చదువు సంధ్యల్లో బాగా ఆరి తేరుతారని విశ్వాసం.

## పిత్రాదుల పూజ

తమ కుటుంబంలో మరణించిన పూర్వీకుల కోసరం తండ్రి తాతల కోసరం చాలా ఇళ్ళల్లో ప్రతి ఏడాది సంతర్పణలు జరుపుకుంటారు.

శైవనాయన్మార్లు, వైష్ణవ ఆళ్వార్లు జన్మించిన ప్రదేశాలు మరియు వాళ్ళు పరమ పదించిన స్థలాలు పవిత్ర క్షేత్రములుగా గుర్తింపబడి తీర్థయాత్రలు వెళ్లే వారిచే సందర్శింప బడుతున్నవి. అలాగే వారిచేత శ్లాఘింపబడిన అన్ని దేవాలయములను దర్శించడం భక్తులు తమ విధ్యుక్త ధర్మంగా తలుస్తారు. ఈ దేవాలయములన్నీ సముద్రతీరములలోనూ, ద్వీపములలోనూ కొండల పైననూ నదీ తీరాలలోనూ మారు మూలలోనూ నిర్మింపబడి ఉన్నాయి. తమిళ ఇతిహాసములలోనూ భక్తి గీతములలోనూ శ్లాఘింపబడిన కొన్ని దేవాలయములు కేరళ, కర్ణాటక, ఆంధ్రప్రదేశ్, ఉత్తరప్రదేశ్ లాంటి ఇతర రాష్ట్రముల లోనూ శ్రీలంక, నేపాలు లాంటి ఇతర దేశములలోనూ కలవు. ఇవన్నీ చూస్తే-తమిళులు మహాత్ముల పట్ల చూపించిన గౌరవము రాష్ట్ర దేశపరిధులను అధిగమించిందని చెప్పక తప్పదు. అయినా వారికి ప్రాంతీయాభిమానమూ లేక పోలేదు. శివుణ్ణి వారు "తెన్నాడుడయ శివనే పోట్రి-ఎన్నాట్టారుక్కూం ఇరైవా పోట్రి-అంటూ శ్లాఘించారు. అంటే దక్షిణాత్యుల దేవుడయిన శివుడే అన్ని దేశాల వారికిని దేవుడని భావం.

## ఆయుధపూజ

సెప్టెంబర్, అక్టోబర్ నెలలమధ్య వచ్చే నవరాత్రి పండుగల చివరి రోజున సరస్వతీపూజ (కలైమగళ్ నాళ్ = కళామతల్లీ దినము) జరుపుతారు.

ఆరోజున పుస్తకాలనూ ఇతర కొరముట్లనూ టైపురైటరు మున్నగు యంత్రాలను, నాగలిని పూజిస్తారు. వాటికి చందనం పూసి కర్పూర హారతి ఇచ్చి ప్రార్థనలు జరుపుతారు.

## క్షుద్ర దేవతల పూజ

గ్రామీణ ప్రజలు క్షుద్ర దేవతల ఆగ్రహానికి గురి కాకుండా ఉండటానికి వారికి పూజలు జరుపుతారు. క్షుద్ర దేవతలకు అధినేతలయిన దేవుళ్ళకు కూడా పూజలు జరుపుతారు. హత్య చెయ్యడం వల్లనో మరే ఇతర ప్రమాదములలోనో ఆకస్మికంగా దుర్మరణం పొందిన వారికి ఆయువు తీరలేదనీ వారి ఆత్మలు దయ్యాలుగా మారి చెట్లపుట్లలో సంచరిస్తూ ఉంటాయనీ నమ్ముతారు. అందుకే దేవతల గుళ్ళ సమీపములో కొత్తగా ఇళ్ళు కట్టినప్పుడు దెయ్యాల సంచారం కోసరం అందులో ఒక మూల ఖాళీగా వదిలేస్తారు. కొన్ని సమయాల్లో ఈ దయ్యాలు ఒక మనిషిపైననో బహిష్టు అయిన యువతి పైననో సోకిందని చెబుతారు. అప్పట్నించి ఇక ఆ మనిషి దెయ్యం చెప్పినట్లే ప్రవర్తించడం జరుగుతుందని. కాటేరి అనబడే ఒక క్షుద్ర దేవత ప్రకోపిస్తే గొడ్లు గోదాములకు రోగాలు వచ్చి చనిపోతాయంటారు. అందుకని ఆ క్షుద్ర దేవతను ప్రసన్నంచెయ్యడం కోసరం జంతువులను నరికి రక్తబలి ఇస్తారు. క్షుద్ర దేవతలను పూజించే స్థలములకు పేయ్‌కోయిల్ (దయ్యాల దేవాలయములు) అని పిలుస్తారు. ఈ గుళ్ళు చిన్న పిరమిడ్లలాగనో సమాధిలాగనో మట్టిలో నిర్మింపబడి ఉంటాయి. ఇవి మామూలుగా పిశాచముల నివాసములుగా భావింపబడే పెద్ద వృక్షముల మొదలు వద్ద నిర్మింపబడి ఉంటాయి.

ఈ గుళ్ళల్లో పూనకం వచ్చి ఆడే వారు పూజార్లుగా మసలుకుంటారు. ఈ పూనకపు మనిషిని అందరూ గౌరవించి అతని చేతి మీదుగా భయభక్తులతో విబూది అందుకుంటారు.

## గురువుల అధికారములు

తమిళ ప్రాచీన గ్రంథాలు దేవాలయ పురోహితులను గురువులనీ, శివాచార్యులనీ, ఆదిశైవులనీ, ఓధువర్ అనీ వివిధములైన పేర్లతో పేర్కొన్నవి. అనువంశికంగా వచ్చే ఈ పురోహితులు దేవాలయము గురించి క్షుణ్ణంగా తెలుసుకుని మంత్రములలో ఆరితేరిన వారై కళల్లోనూ సాహిత్యంలోనూ నిష్ణాతులై ఉంటారు. వారికి పరంపరాను గతమైన హక్కు లేకాక బాధ్యతలు కూడా ఉన్నవి. వారికి దేవుడి విగ్రహాన్ని రోజూ ముప్పూటలా పూజ చేసేటప్పుడు తాకడానికి అధికారం ఉన్నది. (ముప్పోదుం, తిరుమేని తీండువార్ - ముప్పూటలా పవిత్ర దేహాన్ని స్పృశిస్తారు.)

## యుద్ధవీరులకు వీరపూజలు

చరిత్ర కెక్కిన ధీరులూ యుద్ధవీరులూ ప్రజల హృదయాలలో గూడు కట్టుకోవడం మాత్రమే కాదు వారికి స్మారక చిహ్నాలు నెలకొల్పివున్నారు. అంతేకాకుండా వాళ్ళను గూర్చి తందాన పాటల్లాటివి జన బాహుళ్యంలో ప్రచారములో వున్నాయి. వాటిలో చాలా ముఖ్యమైనది దేశింగు రాజు కథ. అతను 17వ శతాబ్దంలో జీవించాడు. అతను దక్షిణార్కాటు జిల్లాలోని చెంజీలో రెండుకోటలు నిర్మించాడు. ఒక ముస్లిమ్ యువరాజును ఎదుర్కొని పోరాడి వీరమరణం చెందాడు. అలాగే తొలి స్వాతంత్ర్య యోధుడనదగిన పాంచాలన్ కురిచ్చి వీర పాండ్య కట్ట బొమ్మన్ కథలు కూడా ప్రజలమధ్య అతని జ్ఞాపకాలను సజీవముగా నిలుపుతున్నాయి.

పురాణ వీరులుకూడా ఆరాధింప బడుతున్నారు. పాండ్యుల కాలంలో ఒక పాళెగాడుగా ఉన్న మధురై వీరన్ వీరోచిత పోరాటంలో అనేకుల ప్రాణాల్ని రక్షించాడని ప్రతీతి అతను మధురై ప్రాంతంలో దైవాంశ సంభూతుడుగా కొని యాడబడుతున్నాడు. అతని పేర జరిగే ఉత్సవంలో అతని ధీరోదాత్త చరిత్రను విల్లుపాటగా పాడుతారు.

## వృక్షపూజ

ప్రాణకోటిని సాదరముగా చూడవలెనన్నదే వ్రతము యొక్క ఉద్దేశము. జంతువులు, చెట్లు చేపలు కూడా దేవుని సృష్టిలో భాగములే. తమిళదేశంలో చెట్లను పూజించడమన్నది ప్రాచీన కాలంనుంచీ వాడుకలో వున్నది. చెట్ల పట్ల ఎంతటి గౌరవభావంకలిగి ఉండేవారో పురాణసాహిత్యం ఎత్తి చూపుతున్నది. పారి అనే పేరుగల ఒక తమిళరాజు వేటకు వెళ్ళినప్పుడు మార్గంలో ఒక పల్లెతీగ అల్లుకోవడానికి ఎలాంటి ఆధారము లేక గాలిలో అల్లల్లాడుతుంటే ఆ తీగ కోసరం తన రథాన్ని వదిలివేసి తిరిగి వెళ్ళాడని ఒక ప్రాచీన గాథ ప్రచారములో వున్నది.

సోమవారం గనక అమావాస్య వస్తే ఆరోజున భక్తులు కడు వినమ్రతతో రావిచెట్టు చుట్టూచేరి అక్కడ ప్రతిష్ఠింపబడిన నాగదేవుని శిలకు పూజలు చేస్తారు. వాళ్ళు ఆ రావిచెట్టును 108 సార్లు లేదా ఇంకా ఎక్కువ సార్లు చుట్టి వస్తారు. అలా చెయ్యడం వల్ల తమ సంతతికి ఆయురారోగ్యములు ఒనగూడుతాయని నమ్ముతారు.

రావిచెట్టు చాలా పవిత్రమైన వృక్షముగా భావింపబడటం వల్ల గ్రామీణ ప్రజలు ఆ చెట్టు కొమ్మలను వంట చెరుకుగా ఉపయోగించరు. వాళ్ళు ఏదైనా వేలం పాటలో రావి చెట్టు కొనవలసి వచ్చినా దానిని గుడికి ఇచ్చేస్తారు. గుడిలో చేసే వంటలకు వినియోగిస్తారు. వీటి పుల్లలు అగ్నిహోత్రమునకు వినియోగింప బడతాయి. తమిళ ఇతిహాసాలను పరిశీలిస్తే, ప్రతి దేవాలయమూ ఒక స్థల వృక్షముతో ముడిపడిఉన్నది. ఈ వృక్షజాతులలో మామిడి, వేప రావి, కడిమిచెట్టు, పొన్నచెట్టు మున్నగు తెగలు ఉన్నాయి.

కొన్ని దేవాలయములలో ఈ చెట్లనుంచి విరిగిపోయి ఎండిపోయిన బోదెలనూ కొమ్మలనూ అలానే భద్రపరచి ఉంచారు. మైలాపూర్‌లోని తిరువళ్ళువర్ దేవాలయములో ఎండిపోయిన పెద్ద ఇప్పమాను బోదె రాగిరేకులతో

కప్పబడి శాశ్వతముగా పదిల పరచబడినది. అలాగే ఇతర దేవాలయములలో కూడా పాత వృక్షముల కొమ్మలు వెండిరేకులతోనూ ఇతర లోహములతోను కప్పబడి భద్ర పరచబడియున్నవి.

కొబ్బరిచెట్టును వీరు తెన్నం పిళ్ళై అని పిలుస్తారు. అంటే అది ఒక బిడ్డతో సమానమని భావిస్తారు. కొబ్బరిచెట్ల వేళ్ళను నరకడం తన స్వంత బిడ్డను హత్యచేయడం లాంటిదని అంటారు.

## పశు పక్ష్యాదుల ఆరాధన

గోవు :– జంతువులలో ముఖ్యముగా గోవు ఆరాధింపబడుతోంది. శుక్రవారము గోవును స్నానం చేయించి దాని నొసట వీపుమీద తోకమీద కుంకుమబొట్టు పెట్టి గౌరవిస్తారు. చాలావుచుట్టూ పెళ్ళయిన స్త్రీలు, పెళ్ళికాని యువతులూ మూడుసార్లు ప్రదక్షిణం చేస్తారు. ఆలా చేస్తే వాళ్ళ దాంపత్య జీవితంలో సుఖశాంతులు లభిస్తాయట. గోవు చాలా సాధుజంతువనీ, దైవాంశ సంభూత మైనదనీ ప్రజలు నమ్ముతారు.

**నాగుపాము** :– ప్రజలచే ఆరాధింపబడే ఇంకొక ముఖ్యమైన ప్రాణి నాగదేవత. నాగుపామును చంపితే ఆ చంపిన వ్యక్తికి కీడు కలుగుతుందని అంటారు. నాగుపాము తనంతట తానై ఎవరికీ హాని చెయ్యదనీ దానిని రెచ్చగొడితే అది బుసకొడుతూ జనులపై తిరగబడుతుందనీ అంటారు.

రావిచెట్టు క్రింద నాగదేవుని శిలలు ప్రతిష్ఠించడం గురించి ముందే పేర్కొన్నాము. నాగుపాము నివసించే పుట్టలలోకి పాలు, గ్రుడ్లు పోసి స్త్రీలు పసిపిల్లలు నాగదేవుని కొలుస్తారు. ఈ పూజలవల్ల పెళ్ళయిన యువతులు త్వరలో గర్భం దాలుస్తారనీ గర్భచ్ఛేదము కలుగకుండా శిశుజననం సవ్యంగా జరుగుతుందని నమ్ముతారు. పిల్లలులేని స్త్రీలు వేపచెట్టుతో కూడిన రావి చెట్టును చుట్టివస్తే వాళ్ళ గొడ్రాలితనం మానడానికి రావి వేపచెట్లు విడిచేగాలి

మందులా పనిచేస్తుందని మనో శాస్త్రవేత్తలు అభిప్రాయం వెలిబుచ్చివున్నారు. నాగదేవుని జ్ఞాపకంగా నాగపట్నం, నాగర్ కోయిల్, నాగమలై మున్నగు ఊర్ల పేర్లు ఉన్నాయి.

ఒక గర్భిణీ స్త్రీ నాగుపామును చూడటం తటస్థిస్తే తనకు పుట్టబోయేబిడ్డకు నాగసామి, నాగరాజన్, నాగప్పన్, నాగరత్న, నాగలింగం, నాగనాథన్, నాగమ్మళ్, నాగలక్ష్మి- వీటిలో ఏదో ఒకపేరు తప్పనిసరిగా పెడతారు.

పుట్టలో పాలుపోసి పువ్వులూ, పళ్లూ కర్పూరహారతీ, ఇంకా ఇతరవస్తువులు సమర్పించిన తర్వాత స్త్రీలు ఈ క్రింది పాటను గానం చేస్తారు.

పుట్రుట్ర పుట్రుట్ర నాగరే
భూమి ఇడం కాండవరే
మణి పిరంబు పోలే
వాల్ అళగు నాగరే
సిరు సులగు పోలే
పడ మెడుక్కుం నాగరే
గుండు ముత్తు పోలే
కణ్ణళగు నాగరే
పచ్చరిసి పోలే
పల్లళగు నాగరే
పళ్ళర్ మగన్ పళ్ళన్
దేవేంద్ర కుటుంబన్
కొట్టు మణ్ వెట్టి ఎడుత్తు
కుళత్తరుగే పోనాన్
ఇరుపురముం పడం ఒడుక్కి
ఫళి విడువాయ్ నాగరే !

అం. టే—

భూమిపైన పెరిగి వున్న
పుట్టలోని నాగులూ
రంగుల పేము బెత్తములా
రంజిల్లె నీతోక నాగులూ
విరిసిన విసనకర్రలా
వెలిగేను నీ పడగ నాగులూ
గుండ్రని ముత్యాల్లా నీ కను
గుడ్లు మెరిసేను నాగులూ
పచ్చి బియ్యము లాగనీ
పళ్ళు వెలిగేను నాగులూ
పళ్ళల సంతానం పళ్ళుడు
దేవేంద్రుడు కుటుంబీకుడు
మట్టి పారను చేత బూని
పనికోసం చెరువుగట్టుకు
చేరాలంట, కనికరించి
దారి విడువుము నాగులూ
పడగ విప్పకు నాగులూ!

(కాష్ఠములో కావలికాచే జాతి వారిని దేవేంద్ర కులస్థులనీ పళ్ళర్ అనీ పిలుస్తారు.)

ఎద్దు:- తమిళులు ఎక్కువగా వ్యవసాయం వృత్తిగా కలిగియున్నందున ఎద్దును ఐశ్వర్యానికి చిహ్నంగా భావిస్తారు. ఎద్దులను నేల దున్నడానికి బండి లాగడానికి ఉపయోగిస్తారు. వాటి మల మూత్రములు పైరుకు చక్కటి ఎరువుగా ఉపయోగ పడుతున్నది. ఇతిహాసములలో వృషభము శివుని వాహనముగా పేర్కొనబడినది. కొందరు వ్యవసాయదార్లు కొన్ని కోడెదూడల్ని గుడికి వదిలేస్తారు. ఆ ఎద్దులు ఎక్కడ తిరిగినా, ఎక్కడ మేసినా ఎవరూ

అడగరు. పూర్వకాలంలో వీటిని ఆంబోతులుగా ఉపయోగించేవారు. కోడె పందాలలో వీటికి సముచితమైన ప్రాముఖ్యత ఇవ్వబడుతుంది.

గేదెలు:- నీలగిరి ప్రాంతంలోని తోడాలనబడే గిరిజనులు గేదెలను పూజిస్తారు. అలా చెయ్యడంవల్ల తమకు సంపన్నమైన జీవితం కుదురు తుందని నమ్ముతారు. ప్రాచీన తమిళ సాహిత్యంలో ఈగేదె "ఎరుమై" గా (ఎనుము) పేర్కొనబడి, నదీతీర ప్రాంతములలోని తడి నేలల్లో నివసించే జంతువుగా ఐశ్వర్యానికి ప్రతీకగా వర్ణింపబడింది.

**ఏనుగు:-** ఏనుగు అతి పెద్ద జంతువుకావడమే కాకుండా ఆ కాలంలో రాజులకు గజబలములుగా ఉండేది. అంతేకాదు ఇది గణేశుని (గజముఖుడు)తో అవినాభావ సంబంధం కలిగి వున్నది. అందువల్ల ఏనుగులు దేవాలయ ప్రాంగణంవారిలో అతి ముఖ్య స్థానము వహిస్తాయి. కొందరు గుడికి ఏనుగును కానుకగా సమర్పిస్తారు. దేవుళ్ళ ఊరేగింపులప్పుడు ఏనుగులు ముందంజ వేస్తాయి. వాటి అంబారీలపై అభిషేక జలములు తీసుకొని పోతారు. ఇలా ఊరేగింపు వస్తున్నప్పుడు పురజనులు ఏనుగుకు మ్రొక్కడమే గాకుండా దాని తొండములో చిన్నచిన్న నాణెములు కానుకగా సమర్పిస్తుంటారు.

**కాకి:-** సనాతన సంప్రదాయం పాటించే వ్యక్తులు తాము భోజనం చేసే ముందు కాకులకు పిడికెడు అన్నం పెడతారు. ఒక్కొక్కప్పుడు తాము పెట్టిన కూడు తినడానికి కాకుల్ని గట్టిగా కేకవేసి పిలుస్తుంటారు. కాకులకు అన్నం వేస్తే చచ్చి స్వర్గాన ఉన్న పూర్వీకుల ఆత్మలకు శాంతి కలుగుతుందట. కాకి శని దేవుని వాహనముగా చెప్పబడి వున్నందున మామూలుగా శని వారం నాడు కాకులకు అన్నం పెడుతుంటారు.

గ్రద్ద:- పవిత్ర బ్రాహ్మణ పక్షిగా గుర్తింపబడిన గరుడునికి పూజలు జరుపుతారు. గరుడు శ్రీ విష్ణువు వాహనముగా ఎంచటంవల్ల గరుడునిచే పరి వేష్టింపబడిన ఏస్థలమైనా పవిత్రమైనదిగా భావిస్తారు. దేవాలయములలో కుంభాభిషేకము జరిగేటప్పుడు ఈ గరుత్మంతుడు ఆకాశంలో చాలా ఎత్తు

నుంచి గుడిని చుట్టి వస్తూ కనిపిస్తాడు. చిదంబరంలోని అణ్ణామలై విశ్వ విద్యాలయం గురించి ఒక కథ చెబుతారు. ఒకసారి రాజా సర్ అణ్ణామలై చెట్టియార్ ఆ ప్రాంతాన్ని సందర్శించి నప్పుడు అక్కడ గరుడపక్షి ఆకాశంలోంచి ఆ ప్రదేశాన్ని చుట్టిరావడం గమనించాడట. ఆ ప్రదేశం చాలా అనుకూలమైనదని భావింపబడి అక్కడ విశ్వ విద్యాలయం నెలకొల్పబడినది.

## చిల్లర దేవుళ్ళు

జనాభాలో ఎక్కువశాతం దైవభక్తి, దైవభీతి కలవారే, బ్రాహ్మణులచే కొలువబడే దేవుళ్ళను దేవతలనే కాక ప్రజలు మరిన్ని చిల్లర దేవుళ్ళను దేవతలను కొలుస్తుంటారు.

**అయ్యనార్**:- అయ్యనార్ అనే దేవుణ్ణి గ్రామ దేవుడుగా కొలుస్తారు. అతను గ్రామానికి దొంగలు, అంటువ్యాధులు, దుష్టశక్తులు మరియు వరదలు, తుఫానులు రాకుండా సరిహద్దు దేవుడుగా కాపాడుతాడని నమ్ముతారు. ఇంకా పిల్లలులేని వారికి సంతానం కలిగిస్తాడని, తీరని వ్యాధులని సైతం పోగొడతాడని గ్రామానికి అష్టైశ్వర్యాలు కలిగిస్తాడనీ నమ్ముతారు.

దాదాపు ప్రతి గ్రామంలోనూ అయ్యనార్ దేవాలయం ఉంటుంది. అందులో బంకమట్టితో లేదా రాతితో చెయ్యబడిన అయ్యనార్ విగ్రహం ఉంటుంది. అనేక నదీతీరాలలో సైతం అయ్యనార్ విగ్రహాలు కనిపిస్తాయి అయ్యనార్‌ను ప్రసన్నం చేసుకోవడం కోసరం నిప్పుపై నడవటం, చందన కుంభము మున్నగు తంతులు చేస్తారు.

ఎవరి ఇంట్లోనయినా దొంగతనం జరిగితే వాళ్ళు అయ్యనార్ కోసరం కొంతపైకం ముడుపు కట్టుతారు. పోయిన వస్తువు దొరకగానే ఆ ముడుపు తీసుకుని వెళ్ళి అయ్యనార్ గుళ్ళో హుండీలో వేస్తారు. గ్రామంలో వచ్చే తగాదాలను అయ్యనార్ సమక్షంలో పరిష్కరించుకుంటారు. నేరస్థులను, అబద్ధాలాడే వారిని దేవుడు శిక్షిస్తాడని నమ్ముతారు. అయ్యనార్ భక్తులు వెండితో కళ్ళు ఇంకా ఇతర అవయవములు చేసి దేవుడికి సమర్పిస్తారు.

కొందరు తమ మొక్కుబడిని చెల్లిస్తూ, అయ్యనార్ దేవాలయ ప్రాంగణంలో బంక మట్టితో చేసిన గుర్రాలు ప్రతిష్ఠిస్తారు. అయ్యనార్ - అశ్వపటాలమునకు అధి నాయకుడనీ ప్రతీతి.

## శుడలై మరస్వామి

చిల్లర దేవుళ్ళలో ఈ దేవుడుకూడా ఒకడు. ఇతడికి వరి పొలాలమధ్య గుళ్ళు నిర్మించారు. కోనార్, మదవర్ మరియు పరయర్ మున్నగు జాతుల వారు ఈ దేవుణ్ని ఎక్కువగా పూజిస్తారు. అనేక తరాలకు పూర్వమే తిరుచ్చి జిల్లాలోని పుదుక్కుళం అనే గ్రామంలో ఈ దేవుడికి గుడి నిర్మించివున్నారు. ఇసుకతో నిర్మింపబడిన ఆ దేవాలయములో పదకొండు దేవతలు పద్ద దేవుళ్ళు నెలకొని ఉన్నారు. అందులో ముఖ్యమైన గుడి నాలుగంచులతో రెండు మీటర్ల ఎత్తున పిరమిడ్‌లా నిర్మింపబడినది. ఈ గుడిలో శుడలై మరన్ లేక సాత్తాన్ అనే దేవుడు ప్రాధాన్యత వహిస్తాడు. ఉత్సవ సమయాలలో ఈ దేవుడి కోసరం మేకలు. గొర్రెలు, కోళ్ళు బలియిస్తారు. తిరునెల్వేలి పట్టణంలో ఒక వీధికి శుడలై మరన్ కోవెల వీధి అని పేరు పెట్టారు.

తిరునెల్వేలి జిల్లాలోని మూలకరై పట్టిలోవున్న పరమ శివసామి గుడి కూడా పేర్కొనదగినది. ఆ గ్రామంలో ప్రతి ఇంట్లోను కనీసం ఒకరికయినా ఆ దేవుడి పేరు పెట్టడం ఆనవాయితీ.

కడలూరు సమీపములో వున్న పచ్చయమ్మన్ గుడిలో గ్రామీణ ప్రజలు, నగర వాసులూ కలిసి పూజలుచేస్తారు. సేవకుల సమేతంగా తపస్సులో మునిగి వున్న పార్వతీదేవిని అధినేతగా కొన్న ఈ గ్రామ దేవతలకు దేవాలయములలో ప్రత్యేకంగా సన్నిధానములు కలవు. మురుగ దేవుని పెళ్ళాడిన తమిళదేశపు నిమ్న జాతికి చెందిన కురత్తి (వళ్ళి) ప్రధమ స్థానము వహిస్తుంది.

సెల్లియమ్మన్ అని పిలవబడే ఇంకొక గ్రామ దేవత సకాల వర్షమునకును వంశాభివృద్ధికిని తోడ్పడుతుందని నమ్ముతారు.

మధురైలోని చెల్లాటమ్మాళ్ కోవెలలో ప్రతి ఏడాది సక్రమంగా పూజలు జరుగుతాయి. మూడేళ్ళ వయసు కలిగిన చూలుగా షన్న నల్ల మేకను కత్తితో పొడిచి ఈ గుడి చుట్టూ ప్రదక్షిణం చేయించి బలి ఇస్తారు. పూజారి కొన్ని మంత్రాలు పఠించి బియ్యమూ, కాయగూరలు పైకి చల్లుతాడు. అలా చేయడం వల్ల అవి స్వర్గస్థులైన వారికి ఆహారంగా అందుతాయని నమ్ముతారు ఆ రోజున గుడి పరిసరములలో గర్భిణీ స్త్రీలనూ, కన్యలనూ, కొత్త పెళ్ళి పడుచులను రానివ్వరు, వాళ్ళకు ముందుగానే హెచ్చరిక చేస్తారు.

కోయంబత్తూరు మరియు సేలం జిల్లాలలోని హరిజన వాడలలో వీరమతి గుళ్ళు కనిపిస్తాయి. ఆ గుళ్ళు భర్తతోపాటే ప్రాణాలు విడచిన సాధ్వీమణుల గౌరవార్థం నిర్మింపబడ్డాయి. వీరమతి అంటే వీరమహాపత్నికి రూపాంతరమే కాక సాహసమూ, శీలమూ కలిగిన స్త్రీ అని అర్థము.

## అంకాళేశ్వరి

సామాన్య ప్రజలచేత ఎక్కువగా పూజింపబడే మరో గ్రామదేవత అంకమ్మ లేక అంకాలేశ్వరి శైవ పూజారి రోజూ పూజలు చేస్తుంటాడు. అతి ముఖ్యమైన ఉత్సవాలలో మహాశివరాత్రి పేర్కొనదగినది. ఆ రాత్రి అంకాళేశ్వరికి జరిగే సేవలను దర్శించడం కోసరం ప్రజలు రాత్రంతా మేల్కొని వుంటారు.

తమిళ జ్ఞానులచే నిర్దేశింపబడిన శైవ సిద్ధాంత వేదాంతములో శివుడు మత గురువుల రూపంలో మానవ అవతారం ఎత్తుతాడని చెప్పబడినది.

## వెయిలుగంద అమ్మన్ (ఎండ దేవత)

ఈమె వెలుగుకు దేవత, ఈవిడకు విదురునగర్‌లోనూ, తిరుప్పరంకుంద్రం లోనూ, దేవాలయములు కలవు. అతి వృష్టి పడితే - ఆ అరిష్టము నుంచి

పైరు పచ్చలను కాపాడమని ఈమెను ప్రార్థిస్తారు. వాన కోసరం మారియమ్మన్ అదే మరో గ్రామ దేవతను పూజిస్తారు.

## మారియమ్మన్ (మసూచి దేవత)

మారియమ్మన్ ఆరోగ్యానికి, వానకూ అధినేత. ఈమె ప్రజల్ని మసూచి, కలరా లాంటి అంటువ్యాధులనుంచి కాపాడుతుందని నమ్ముతారు తిరునెల్వేలి జిల్లాలోని సమయపురం, కొన్నియూర్, రామనాథపురం జిల్లాలోని నాట్టరసన్ కోట, చెంగల్పట్టు జిల్లాలోని పెరియపాళ్యం కోయంబత్తూర్ జిల్లాలోని ఉప్పిలిపాళ్యం, పొళ్ళాచి మున్నగుచోట్ల నెలకొని వున్న మారియమ్మ గుళ్ళు మిక్కిలి ప్రఖ్యాతిగాంచినవి. వీటిలో కొన్ని "సిలప్పదిగారం" కథానాయిక అయిన కణ్ణగితో సంబంధం కలిగి వున్నవి. జొన్నలువండి మారియమ్మకు నివేదించడం ఆచారముగా వస్తున్నది. మారియమ్మ పాపులకు కనుచూపు పోగొట్టగలదనీ, అలాగే భక్తులకు పోయిన కళ్ళను తిరిగి ప్రసాదించగలదనీ అంటారు. కళ్ళు పోయిన వారు వెండితో కన్నుచేసి ఆమెకి కానుకగా సమర్పిస్తారు. ఆవిడకు "అయిరం కణ్ణుదయాళ్" (వేయి కన్నులు కలిగిన దేవి) అని నామాంతరము కలదు. గ్రామంలో మశూచి వ్యాపించినప్పుడు, ప్రజలు ఈమెను శరణు వేడుతారు. పూజారి ముందునిలిచి పాలూ, కొబ్బరికాయలూ, ఉడుపులూ, వెండికాసులు ఇంకా డబ్బులూ సమర్పించి పశు బలి ఇస్తారు. గ్రామదేవతకు ఈ విధముగా ఎంతో ప్రాముఖ్యత కలదు.

మశూచిగాని ఆటలమ్మగాని సోకినప్పుడు వైద్యం చెయ్యడం ఆచారానికి విరుద్ధమని భావిస్తారు. ఇవి మారియమ్మ లీలలనీ కాలక్రమేణ అవే మాని పోతాయని తలుస్తారు. మశూచి వ్యాపించిన సమయంలో జనులు ఈమెను పొగడుతూ పాటలు పాడతారు. ఎవరైనా మశూచివల్ల మరణిస్తే మరణించాడని అనక శాంతి పొందాడని అనడం ఆనవాయితి.

మారియమ్మ తిరునాళ్ళలో నిప్పుమీద నడవడం ఒక ఆచారము. దానిని

పూకుళిత్తల్ (పూలపైన నడపడం) అని పేర్కొంటారు. ఒళ్ళంతా విబూది పూసుకున్న భక్తులు మూడు నాలుగు మీటర్ల విస్తారమునకు పరచబడిన నిప్పు కణికలపైనఇటునుంచి అటు, అటునుంచి ఇటూ నడుస్తారు. ఎన్ని సార్లు నడవాలో నిర్ణయింపబడి ఉంటుంది. నిప్పులపై నడక ముగిశాక భక్తులు దేవత విగ్రహము సాన్నిధ్యంలో సాష్టాంగ నమస్కారము చేస్తారు. వారు నిప్పులపై నడచినా అచంచల విశ్వాసమువల్ల వారికి ఎలాటి హానీ కల గదు.

స్త్రీలు నిప్పుపైన నడవరు. తమ తలపైన కొంగు వేసుకుని దానిపై నిప్పు చిప్పలను మోస్తారు. దేవీ మహాత్యమువలన వారి చీర అంటుకోదనీ, వారికి వేడి సోకదనీ అంటారు.

స్త్రీలూ, యువతులూ తలలపైనా చేతులతోనూ నిప్పుకుండలను మోసుకుని వెళ్ళడం మారియమ్మ కోవెలలో జరిగే ఇంకో వేడుక. ఈ ఉత్సవానికి ముందు భక్తులు ఇరవై ఒక్క రోజులు ఉపవాసము ఉంటారు. కటిక నేల పైన పడుకుంటారు, దాంపత్య సుఖాలను త్యజిస్తారు. వీరిలో పూనకం వచ్చిన వారు తలపైన నిప్పుకుండను మోసుకుని మారియమ్మ గుడికి పోతారు. ఈ ఉత్సవం నిప్పులు చెరిగే వేసవి కాలంలో అగ్నినక్షత్ర సమయంలో జర గడం గమనించదగినది. ఈ ఉత్సవాలికి విరుదునగర్ ప్రసిద్ధి గాంచినది.

పూల తట్టలను మోస్తూ దూర దూరములనుంచి జట్లు జట్లుగా మంగళ వాద్య సమేతులై మారియమ్మ గుడికి వెళ్ళి పూజించడం కూడా వాడుకలో వున్నది. దీనికి "పూతట్టు ఎడుత్తల్" (పూలతట్ట మోయడం) అని పేరు.

దేవాలయంలో ఉత్సవం మొదలెట్టడానికి సంకేతంగా తొలుత జండా ఎగుర వేస్తారు. ఆ రోజున ప్రతి ఇంట్లోనూ 'ముళైప్పరి కాట్టుదల్' అనే తంతు జరుపుతారు. అంటే ఒక పాత్రలో మట్టిపోసి అందులో వడ్లు, రాగులు, కందులు మున్నగు ధాన్యములను మొలక వేస్తారు. ఎనిమిదో రోజున ఆ పాత్రలను గుడికి తీసుకొని వస్తారు. తరువాత మూడు రోజుల వరకు స్త్రీలు

ఆ పాత్రల చుట్టూ తిరుగుతూ గొబ్బెమ్మపాటలు పాడుతూ ఆమె ఘనతను కొని యాడుతారు. ఉత్సవాలు ముగిశాక చివరిరోజున ఆ పాత్రలను తీసికెళ్ళి సమీపములో వున్న కొలను లేదా నదిలో వదులుతారు.

స్త్రీలు వచ్చి బియ్యంపిండిని బెల్లంతో కలిపి అందులో చిప్పలా చేసి వత్తివేసి దీపం వెలిగించి గుడిలో పెడతారు. దీనిని మావిళక్కు (పిండి దీపం) అంటారు. తరువాత అందరూ దానిని ప్రసాదంగా ఆరగిస్తారు.

కలరా మశూచిలాంటి వ్యాధులు అరికట్టడానికి లేదా తమని మారియమ్మ ఈ రోగములనుంచి కాపాడినందుకు కృతజ్ఞతా సూచకంగా ప్రజలు తిర నాళ్ళలో తమ శరీరమంతా నల్లచుక్కలూ ఎర్రచుక్కలూ అద్దుకుని (కరుం బుళ్ళి చెంబుళ్ళి) ఊరేగింపులో కలుసుకుంటారు

అంటువ్యాధులు సోకినప్పుడు కోయంబత్తూరు ప్రాంతములోని స్త్రీలు ఉప్పిలి పాళయం మారియమ్మకు కొబ్బరికాయలు కొట్టి ఒక విధమైన బెల్లపు ముక్కలను సమర్పిస్తారు.

## దేవుల ప్రియ భక్షణములు

గ్రామీణప్రజల నమ్మకం ప్రకారం ప్రతిదేవుడికీ తనకు ప్రీతికరమైన కొన్ని భక్షణములు ఉంటాయి. తమిళనాడులోని ప్రముఖ దేవాలయములలో ఈ భక్షణముల నైవేద్యం ప్రాధాన్యత వహిస్తున్నది. పళనిలో పంచామృతమూ, తిరుచ్చెందూర్‌లో పిట్టూ, శ్రీరంగాలో పాల నైవేద్యమూ, మద్రాస్ తిరువల్లిక్కేణి పార్థసారధి కోవెలలో తిరుక్కణ్ణముదు, ఆళ్వార్ తిరునగరిలో వంకర దోసై (అన్నము, రొట్టె, పప్పు, కొబ్బరి మరియు ఇతర ద్రవ్యములు కలిపి బంగారు రంగుతో ప్రత్యేకముగా వండుతారు) ఉప్పిలి పాళ్యంలో తియ్యపు పొంగలి (ఉప్పులేకుండా) కాంచీపురం వరదరాజ పెరుమాళ్ కోవెలలో ఇడ్లీలు, చిదంబరంలోని నటరాజ దేవాలయములో తిరువాధిరై కళి (ఆరుద్ర సంగటి)- ముఖ్యమైన భక్షణములు.

## నమ్మకాలూ, మూఢవిశ్వాసాలూ

పుట్టింది మొదలు గిట్టేవరకూ దైనందిన జీవితంలో వీరు ఎన్నో నమ్మకాలు, మూఢవిశ్వాసాలు కలిగి ఉంటారు. గ్రామీణ ప్రజల మూఢనమ్మకాలను విజ్ఞాన వంతులైన కొందరు త్రోసిపుచ్చినా కొన్నిసమయాల్లో తీరని సమస్యలు ఎదురై పరిష్కారం దొరకనప్పుడు వీరు ఏంచెయ్యాలో తోచక సందిగ్ధంలో పడిపోతారు.

## శిశువుల జననం

పిల్లల పుట్టుక గురించి అనేక అంధవిశ్వాసములు గలవు. మిట్టమధ్యాహ్నమునగాని అర్ధరాత్రిలోగాని శిశువు పుట్టగూడదంటారు. అలాగే చైత్ర నక్షత్రంలోనూ పుట్టగూడదంటారు. ఎందుకంటే యముని సేవకుడైన చిత్రగుప్తుడు ఈ నక్షత్రంలో పుట్టాడట.

స్వాతి నక్షత్రంలో జన్మిస్తే ఆ బిడ్డకు అరిష్టమట. పిల్లవాడు గనక మూలానక్షత్రంలో జన్మిస్తే మిక్కిలి అదృష్టవంతుడవుతాడట. కాని ఈ నక్షత్రంలో ఆడపిల్ల జన్మిస్తే ఆమె కష్టాలకు గురికావలసి వస్తుందట. ఒక వ్యక్తికి ఊరి సమీపంలో భూమివుండి అతనికి గనుక ఉత్తరాషాఢ నక్షత్రంలో బిడ్డపుడితే అదృష్టంగా భావింపబడుతోంది. భరణిలో పుట్టినవాడు ప్రపంచాన్ని ఏలుతాడని భావిస్తారు. తన మనుమడు జ్యేష్ఠానక్షత్రంలో పుట్టాడని వినడం కంటె ఒకవ్యక్తి చావడంమేలని భావిస్తారు పిల్లవాడు చైత్రములో జన్మిస్తే అతని తండ్రి భిక్షమెత్తుకోవలసి వస్తుందట. రోహిణి నక్షత్రంలో పసిపాప జన్మిస్తే మేనమామకు కీడు కలుగుతుందంటారు. ధనిష్ఠ నక్షత్ర జాతకురాలు తవుడుకుండలోకూడా బంగారం తియ్యగలదంటారు. ఆడపిల్లలు పూర్వాషాఢ నక్షత్రములో పుట్టగూడదంటారు. వారు నిరాశ్రయులవుతారట.

ఆడపిల్లలు పుట్టుక బేసిసంఖ్యలో కలగాలి అంటే ఒక ఇంట్లో మొదటి

సంతానం, మూడోగి ఐదవది, ఇవన్నీ ఆడపిల్లలుగా పుడితే మంచిది. ఒక ఇంట్లో నాలుగో సంతానం ఆడపిల్ల అయితే ఇహ ఆఇల్లు సర్వనాశన మవుతుందట. అదే ఐదో సంతానం గనక ఆడపిల్ల అయితే ఐశ్వర్యం కలుగుతుందట, మగపిల్లవాడయితే ఆస్తిపాస్తుల్ని పోగొట్టుకుంటాడట. ఆరోపిల్ల ఆడపిల్ల అయితే ఐశ్వర్యం కలుగవచ్చు లేదా దారిద్ర్యము సంభవించనూవచ్చు. ఏడో సంతానంగా పుట్టిన ఆడపిల్ల కుటుంబానికి దుర్భర దారిద్ర్యమును కలిగించుటేకాక ఆవిడ బిక్షమడిగినా ఎవరూ పెట్టరట. ఎనిమిదో సంతానం ఆడపిల్ల అయితే ఆమెకంట్లో పడిన ప్రతివస్తువూ సర్వనాశన మవుతుందట. పదో సంతానం ఆడపిల్ల అయితే ఐశ్వర్యమంతా దూదిపింజల్లా ఎగిరిపోతుందట. గ్రుడ్డినమ్మకాలు బలంగా పాతుకుపోయి వుండటంవల్ల పెళ్లిళ్లలో వధువుగాని వరుడుగాని ఎన్నోసంతానమో ఆరాతీస్తారు.

కవలపిల్లలు పుడితే ఇద్దరూ మగపిల్లలయితే ఆయింటికి మంచికాలం వచ్చినట్టే భావిస్తారు. ఇద్దరూ ఆడపిల్లలే అయినా ఫరవాలేదు. కాని ఒకమగబిడ్డ ఒక ఆడబిడ్డ పుడితేమాత్రం అది అశుభసూచకంగా పరిగణింపబడుతుంది.

## పిల్లలు

పసిపాపలకు అద్దం చూపిస్తే వారు మూగవారు అవుతారట. ఒళ్ళో పసిపాపను ఉంచుకుని ఎవరూ ముఖ ప్రక్షాళనం చేసుకోరు.

పసిపిల్లలకు మొదటిపన్ను పడినప్పుడు దానిని పేడముద్దలో ఉంచి ఇంటి పైకప్పుపైన పారేస్తారు. అలా చెయ్యడంవల్ల రాలిన పన్ను త్వరలో మొలుస్తుందట

ఒకరి చూపు తగలడం వల్ల బిడ్డకు రోగం రావడమో లేదా ఇంట్లో ఏదో విషాదం జరగడమో సంభవించినదని భావించినప్పుడు దానికి కారకుడైన వ్యక్తి మళ్ళీ కనిపించినప్పుడు ఆ ఇంట్లో ఒకరు అతణ్ని వెంబడించి ఆ వ్యక్తి కాలికింద నలిగిన పిడికెడు మట్టిని తీసుకొచ్చి దృష్టి తగిలిన బిడ్డ

చుట్టూ మూడుసార్లు త్రిప్పి మెటికలు విరిచి పొయ్యిలో వేస్తారు. అలా చేస్తే దిష్టి విరగడవుతుందట. ఒక బిడ్డ పుట్టిన వెంటనే సరిగా ఊపిరి తీయకపోతే సూదిని కాగబెట్టి ఆపాప నొసట్లో వాత పెడతారు.

మొదటి ఇద్దరు బిడ్డలూ చచ్చిపోతే మూడోబిడ్డ దీర్ఘాయువుగా ఉండాలని దాని ఎడమ ముక్కు పుటంలో బంగారు ముక్కుపోగు గ్రుచ్చుతారు. ఇలా చేస్తే పసిపాప మొహం వికారం అవుతుందనీ ఎలాటి చెడ్డచూపులూ తగల వనీ నమ్మిక. ఈ బిడ్డకు ఎలాటి హానీ జరుగకుండా ఉండాలని కుప్పుస్వామి (పెంటకుప్పల దేవుడు) కుప్పమ్మాళ్ (పెంటకుప్పల దేవత) పక్కిరి (ఫకీరు) పిచ్చై (బిచ్చగాడు) మున్నగు పేర్లు పెడతారు.

## గర్భిణీ స్త్రీలు

గర్భిణీ స్త్రీలను ఫోటో తీయగూడదంటారు. గర్భిణీ స్త్రీ ఏ తినుబండారం కోరినా తప్పక చేకూరుస్తారు. ఆమె కోరికను తీర్చకపోతే పుట్టే బిడ్డకు చెవుడు వస్తుందని భయపడతారు. గర్భిణీ స్త్రీలపైన చిరుకప్ప గెంతితే పుట్టబోయే పాపకు ఏదైనా రోగము రావచ్చునట. గర్భము దాల్చినప్పటినుంచీ ప్రసవించేవరకూ ఆ చూలాలు ఎలాటి కష్టమైన పనీ చెయ్యరాదు. గర్భిణీ స్త్రీని గనక తేలుకుట్టితే పుట్టబోయే బిడ్డకు తేలుకుట్టే అపాయం కలుగదని నమ్ముతారు. ఇంట్లో పిచ్చుకగానీ కందిరీగగానీ గూడు కడితే ప్రసవం సవ్యంగా జరుగుతుందంటారు.

## పునర్జన్మ

సమాజంలోని దళితజాతి ప్రజలమధ్య పునర్జన్మలు గురించీ రాబోయే పుట్టుకలు గురించీ జోస్యము చెప్పేవారు బాగా రాణిస్తున్నారు. దేవుడి విగ్రహం ముందర కొబ్బరికాయలు కొట్టడం నరబలికి సమానమనీ అలాగే పసుపూ సున్నమూ నిమ్మరసమూ కలిపిన ఎర్రనీళ్ళ హారతి ఇవ్వడం రక్త తర్పణంతో సమానమనీ వీళ్ళు నమ్ముతారు.

## ప్రయాణములు

అరికాలిలో దురదపడితే చేయబోయే ప్రయాణమును సూచిస్తుందంటారు. ఎవరైనా అతి ముఖ్యమైన పనిమీద వెళ్ళేటప్పుడు గరుడపక్షి ఆకాశంలో తిరుగుతూంటే శుభ శకునంగా భావిస్తారు. మంచి మాటలు వినిపిస్తే కార్య సిద్ధి జరుగుతుందని గ్రామీణుల విశ్వాసం. ముఖ్యమైన పనిమీద ఒక వ్యక్తి ఇంట్లోంచి బయలుదేరేటప్పుడు ఎక్కడనించయినా "ఈ ఉదయం మా ఆవు ఎక్కువ పాలుపిదికింది" అనే మాటలు కనుక వినిపిస్తే అతడికి జయం కలుగుతుందట. ఈశకునమును 'విరిచ్చి' అని వ్యవహరిస్తారు.

బయలుదేరేముందు పుష్పములుగాని, ముత్తయిదువునుగాని, నీటికుండను గాని చూస్తే మంచిదంటారు. వెళుతున్నప్పుడు ఆకాశంలో గరుడపక్షి కని పించినా, కుక్కగానీ. ఉడతగానీ కుడివైపునుంచి ఎడమవైపుకు అడ్డువచ్చినా కార్యసిద్ధిని సూచిస్తుందట. కాకి, పావురం, నెమలి, కోడి, జింక, పులి, దున్న మున్నగునవి ఎడమవైపునుంచి కుడివైపుకు అడ్డం వెళితే అదీ మంచి శకునమేనట.

ప్రయాణకుడికి గొడుగు, జండా, గుడి, వింజారము, చెరకుగడ, మాంసము, పాలు, పెరుగు, తేనె, ఎద్దు, ఆవు, ఏనుగు, వ్యభిచారిణి, గుర్రము, పళ్ళు - ఏది ఎదురు పడినా మంచి శకునమట. అలాగే బయలు దేరే సమయంలో గంటలు మ్రోగినా, ఫిరంగి మ్రోగినా, గాడిద ఓండ్ర పెట్టినా, గ్రద్ద అరచినా, వేదపారాయణము జరిగినా శుభ సూచకంగా భావిస్తారు.

పాము, పిల్లి, సన్యాసి, ఒంటి బ్రాహ్మణుడూ, మంగలి విధవరాలు, గాండ్లవాడు మున్నగు అపశకునములు కలిగినా, కర్ణకఠోరమైన శబ్దము విన బడినా, కాలు జారడంగాని, తూలి పడటంగాని, సంభవించినా, తలకు గుమ్మం తగిలినా "పోవద్దు" అనే మాటలు ఎక్కణ్ణించయినా వినిపించినా,

వాన ముసురుకున్నా — బయలుదేరిన వ్యక్తి ఇంటికి తిరిగొచ్చి, గ్లాసెడు నీళ్ళు త్రాగి, కాస్సేపు విశ్రాంతి తీసుకొని, తర్వాత ప్రయాణం మొదలెట్టడం ఆనవాయితీ.

ప్రయాణం మొదలెట్టే వ్యక్తి తనతో నూనె, మురికి గుడ్డలూ తీసుకొని పోగూడదు. ప్రయాణం గురించి ఇంకా ఎన్నో నియమాలు కలవు. భార్య బహిష్టు అయి ఉన్నప్పుడు భర్త ఏపనిమీదా బయటికి వెళ్ళడు. వార శూలలు కూడా పాటిస్తారు. మంగళ బుధవారములలో ఉత్తర దిశగా, గురువారం దక్షిణానికీ, సోమ శనివారాల్లో తూర్పుకూ, శుక్ర ఆదివారాల్లో పశ్చిమ దిశకూ ప్రయాణం చెయ్యరు. అయినా అత్యవసర పరిస్థితులలో దేవుడికి పెరుగు సమర్పించి మలిపొద్దులో ప్రయాణము గైకొన వచ్చును. ఈ వారశూలల్ని ఎక్కువగా పాటించడంవల్ల మద్రాస్నుంచి దక్షిణాభిముఖంగా వెళ్లే రైళ్ళలో గురువారాలలో అంతగా జన సమ్మర్ధము కనుపించదు.

ఇలాగే రాహుకాలంలో ప్రయాణం మొదలెట్ట కూడదని నిషేధించారు ప్రతిరోజూ గంటన్నరసేపు రాహుకాలం వస్తుంది. ఈ సమయంలో ఏ ముఖ్యమైన పని అయినా వాయిదా వేస్తారు. జనం తమతోబాటు ఈ రాహుకాలం పట్టికను ఎల్లప్పుడూ ఉంచుకుంటారు. రాహుకాలాన్ని సులభంగా గుర్తు పెట్టుకోవడంకోసరం "సోమ శని శుక్ర బుధ గురు మంగళాది" అనే పద సముచ్చయమును గుర్తు పెట్టుకుంటారు. అంటే సోమవారం ఉదయం ఏడున్నరకు రాహుకాలం మొదలవుతుంది, ఆదివారం సాయంత్రం ఆరు గంటలకి ముగుస్తుంది.

మధురైలోని కొన్ని కొండజాతులవారు సోమవారం ఉదయాత్పూర్వము· మంగళవారము మధ్యాహ్నము తర్వాత, బుధవారము చీకటి పడినాక గురు వారం చల్ది తిన్న తర్వాత, శుక్ర శని వారాలలో సూర్యోదయము తర్వాత ప్రయాణం మొదలు పెడతారు.

## సంఖ్యలు

సంఖ్యలను గురించి ఎన్నో ఆచారములు వాడుకలో వున్నాయి. గ్రామీణ ప్రజలు లెక్కపెట్టేటప్పుడు ఒకటికి బదులుగా "మొదలు" అని వాడుతారు. వడ్లు కొలుస్తున్నప్పుడు "ఒకటికి" బదులుగా "లాభం" అంటారు. అనేక చోట్లలో ఒకటికి బదులు ఆ ప్రాంతంలోగల దేవుడి పేరు చెబుతారు.

ఏ పనిలోనయినా తొలి ప్రయత్నం విఫలమయితే ఇహ మూడో ప్రయత్నం తర్వాతే జయం కలుగుతుందని అంటారు.

మూడో సంఖ్య మంచిది కాదనే అభిప్రాయం ప్రబలంగా ఉంది. అందు కనే ఏపని కోసరమయినా ముగ్గురు కలసి వెళితే ఆ పని జరగదని అంటారు. కొందరు "ఏడు" అనడానికి బదులు "ఆరున్నొకటి" అంటారు. "ఎట్టు" (ఎనిమిది) అనే ఉచ్చారణ అశుభ సూచకమని భావించి ధాన్యాలు కొలిచే టప్పుడు "ఎనిమిది శేర్లు" "ఎనిమిది తూములు" అని కలిపి చెబుతారుగాని ఉత్తినే "ఎనిమిది" అనరు.

మామూలుగా ప్రజలు బేసి సంఖ్య సంఖ్యనే కోరుకుంటారు. విరాళా లిచ్చేటప్పుడు వెయ్యిన్నొకటి, ఐదువేలా ఐదు, ఐదు లక్షలా ఒక రూపాయి- ఇలా ఇవ్వడం పరిపాటి. అలాగే కొందరు ఛాందసులు టెలిఫోను కనె క్షను గాని మోటర్ రిజిష్ట్రేషన్ గాని తాము కోరుకున్న సంఖ్యలే కావాలని వేచి ఉంటారు.

## రోజులు

పెళ్ళి జరిగిన కొత్తలో ఆడపడుచు శుక్రవారమునాడు పుట్టింటినుంచి వెళ్ళ కూడదు. చాలమంది శుక్రవారం ఎవరికీ పైకము చెల్లించరు (బిక్ష గాళ్ళకు పైసలు ధర్మం చేస్తారు) శుక్రవారం రోజున ఆస్తిపాస్తులు అమ్మరు. మంగళవారం ఏదన్నా ముఖ్యమైన పని మొదలెడితే అతనికి కష్టాలు తప్పవట. బుధవారము ముఖ్యమైన కార్యమునకు చాలా అనువైన

బంగారం లాంటిదని భావిస్తారు. గురువారము సత్కారానికి మంచిరోజు కాదు. ఆదివారం ఏదన్నా పని మొదలెడితే అతను కుక్కలా తిరగవలసి వస్తుందట. (జ్ఞాయిట్రు కిళమై నాయ్ పదాద పాడు)

## నెలలు

తమిళ నెలలైన ఆని, పంగుణి (జ్యేష్ఠము, ఫాల్గుణము)లో గృహ ప్రవేశములుగాని జ్యేష్ఠపుత్రుల వివాహములుగానీ చెయ్యరు. ఆడి, మార్గళి (ఆషాఢము మార్గశిరము) నెలల్లో ఎవరికీ పెళ్లిళ్లు చెయ్యరు.

## మరణము

తీరని వ్యాధులతో బాధపడే వయోవృద్ధులు అమావాస్యనాడు చస్తారని నమ్మకం. అమావాస్యరోజు చావులు చాలా ఎక్కువగా ఉంటాయట. అలాగే పక్షవాతము వచ్చినవారు మొదటి పోటు వచ్చిన మూడురోజులలోనో, మూడు నెలల్లోనో లేదా మూడు సంవత్సరాల్లోనో మరణిస్తారని నమ్ముతారు. కలలో దేవుడి రథముగానీ, దొంగతనము జరుగుటగానీ కనిపిస్తే ఆత్మబంధువు ఎవర యినా మరణింపవచ్చునట. గుళిక కాలములకే దహనకర్మలాంటి కార్యములు చేయరు.

## దిశలు

ఆఫీసులోకాని ఇంట్లోకాని రాసుకునే బల్లతో మామూలుగా ఈశాన్యమూలలో కాని నైఋతి మూలలోకాని వేస్తారు. ఇతర చోట్లలోవేస్తే శత్రువులవల్ల తీరని నష్టం సంభవిస్తుందంటారు. అలాగే ఇళ్లలో బావులు ఈశాన్యము లేదా నైఋతిదిశల్లో మాత్రమే తవ్వుతారు. ఎవరూ ఉత్తరము వైపున తలఉంచు కుని నిద్రించరు. నటరాజ దేవాలయములు ఎల్లప్పుడూ దక్షిణాభిముఖంగానే కట్టబడుతాయి. దానికి ఎదురుగాఉన్న వీధినాశన మవుతుందని భయపడి గుడికి

ఎదురుగా ఇంకొక్క చిన్నగుడి, బావి లేదా గోడ నిర్మిస్తారు. పెరట్లోని అరటి చెట్టు దక్షిణవైపున పిల్లమొక్కలువేస్తే అది రాబోయే విపత్తును సూచిస్తుందట. వేరేదిశల్లో మొలకలెత్తితే ఐశ్వర్యాన్ని సూచిస్తుందట.

## వివాహములు

తంజావూరు జిల్లాలోని ప్రజలు పెళ్లిప్రయత్నాలు చేసేముందు తిరుమన చ్చేరిలోని కల్యాణసుందర దేవుని విగ్రహానికి అభిషేకం చేస్తారు. అలా చెయ్యడంవల్ల తమ ప్రయత్నం సఫలమవుతుందని నమ్ముతారు. కళ్యాణ సుందరుని మెడలో అలంకరింపబడిన పూదండను కన్య మెడలోవేస్తే ఆవిడకి ఏడువారాల లోపున కళ్యాణం జరుగుతుందని నమ్ముతారు. అలాగే మధురాంతకంలోని కోదండరామునికి అర్చనచేస్తే అతిత్వరలో వివాహం నిశ్చయింపబడుతుందట.

కొన్ని ప్రత్యేక తెగలలో అభ్యంగన స్నానముచేసిన తర్వాత పెళ్లిళ్లలో పాల్గొనడం నిషేధింప బడుతుంది. దహనక్రియల్లో ఉల్లాసంగా ఉండటం, పెళ్ళిళ్ళలో దిగులుగా వుండటం తగదని చెబుతారు. ఒకేరోజున చావులోనూ, వివాహంలోనూ పాల్గొనడం ఆచారానికి విరుద్ధముగా భావిస్తారు.

తమ మనస్సుకు నచ్చిన వరుడులేదా వధువు దొరకాలంటే తైలాదులతో తయారుచేసిన అలంకరణ వస్తువులను రహస్యంగా తాము కోరుకున్న వారి దుస్తుల పెట్టెలో దాస్తారు.

## సూర్యాస్తమయ సమయం తర్వాత నిషేధాలు

సూర్యుడు అస్తమించిన తర్వాత కొన్ని కార్యక్రమములు మొదలుపెట్టరు, క్రాపుకత్తిరించు కోవడం, గోళ్లుకత్తిరించడం, చాకలికి మైలగుడ్డలు వేయడం, పామునుగురించి లేదా మంగలిని గురించి ప్రస్తావించడం, సూదులు ఇవ్వడం

ఉప్పు, మజ్జిగ, తెల్లవస్తువులు మొదలైనవి ఇవ్వడం—చీకటిపడిన తర్వాత నిషేధింప బడినవి. అలాగే చీకటి అయిన తర్వాత నిప్పుకాని అగ్గిపెట్టెకాని అరువు ఇవ్వరు.

గ్రామీణ ప్రాంతాలలో ఉదయం పొయ్యి రాజెయ్యడానికి ఇరుగు పొరుగు ఇళ్లలోంచి నిప్పుతెచ్చుకోవడం పరిపాటి. కొందరు తమ ఇళ్లలో ఇరవైనాలుగు గంటలూ పొయ్యి రాజుతూనే ఉంటుందని సగర్వంగా చెప్పుకుంటారు. అలా ఎల్లప్పుడూ పొయ్యిమండుతూ ఉండటం వాళ్ల ఐశ్వర్యానికి, అతిథి సత్కారానికి నిదర్శనంగా భావిస్తారు.

## సూర్యోదయ దృశ్యాలు

ఉదయం నిద్రలేవడంతోటే అద్దము, నీటికుండ, బావులూ, దీపము. చేపలజంట, పసుపు వీటిల్లో దేన్నయినాచూస్తే శుభం కలుగుతుందట. నిద్ర లేచినవ్యక్తి మొదలు తామరపువ్వుమగానీ, బంగారు రాజు.దీపము, సూర్యుడు, నిప్పు, సముద్రము. గుడిగోపురము వర్షావృతమైన కొండ, ఆవూ—దూడా, తనకుడిచేతి అరచెయ్యి, భార్యముఖము వీటిల్లో దేనినయినా ఇంకా పిచ్చి వారిని, నల్లకోతిని, ఏనుగును కానీ మృదంగముగాని చూస్తే అదృష్టమని అంటారు.

## కలలు

వేకువ జామున వచ్చే కలలు నిజమవుతాయని నమ్ముతారు. పెళ్ళిగురించి కలగనడం శుభసూచకంగా భావిస్తారు. కన్యాకుమారి జిల్లాలో మాత్రం ప్రతి కలా ఫలితాన్ని ఇస్తుందని నమ్ముతారు.

## వ్యాపారములూ, లావాదేవీలు

ఉదయం మొట్ట మొదటవచ్చిన డబ్బును భక్తి పూర్వకంగా తీసుకుంటారు,

కొట్టువాడు ఆ డబ్బును కళ్ళకద్దుకొని కాసేపు ప్రార్థనచేసి తర్వాత గల్లా పెట్టెలో వేస్తాడు. పని వేళల్లో వ్యాపార స్థలములలో నిద్రించడం అపచారముగా భావింపబడుతుంది.

కొట్టులోని విక్రేత ఏ వస్తువు అడిగినా లేదు అని చెప్పకూడదు. మనం ఉప్పుకావాలని అడిగి అది నిలవలేదనుకోండి, వెంటనే దుకాణదారుడు నిలువ ఉన్న వేరొక వస్తువును ఉందని చెబుతాడు. గృహిణులు తమ ఇళ్ళలో ఏవస్తువయినా అయిపోతే ఇరుగు పొరుగు వాళ్ళు అడిగినప్పుడు ఆ వస్తువు మా ఇంట్లో "నిండుకుంది" అంటారేగాని లేదు అని చెప్పరు.

నూనె కొట్లలో రోజువారీ మొదటి వ్యాపారంగా వేరే వస్తువు ఏదయినా అమ్మిన తర్వాతగాని నూనె విక్రయించరు.

## మత విశ్వాసాలు

దేవతలు తమ కోర్కెలను ఈడేరుస్తారన్న నమ్మకముతో ప్రజలు మొక్కుబడులు మొక్కుకుని వాటిని చెల్లిస్తూ ఉంటారు. పిల్లలు కావాలనుకునే వారు తమకు పుట్టబోయే బిడ్డ తలనీలాలు సమర్పిస్తామని లేదా దేవుడి గుడిలో ఊయెలచేసి పెడతామని దేవుడికి మొక్కడం కద్దు.

పసిపిల్లలకు సుస్తీ చేస్తే వాళ్ళు కోలుకున్నాక దేవుడికి వెండి కాసులు, బంగారు కాసులు, కానుకగా ఇస్తామని ఇంట్లోని పెద్ద వాళ్ళు మొక్కుకుంటారు. శరీరంలోని ఏ అవయవాలు రోగాలకి గురి అయినవో వాటి ఆకృతిలో వెండి బంగారు నగలు చేసి కానుక ఇస్తారు.

వయోవృద్ధులు గుడిచుట్టూ ప్రదక్షిణములు చేసి, దేవుడికి తమ కృతజ్ఞతను తెలుపుకుంటారు. కొన్ని చోట్ల వాళ్ళు ఎన్నో కిలోమీటర్ల దూరం అలా ప్రదక్షిణం చెయ్యవలసి ఉంటుంది. తిరువ కామ్మలైలోని గిరివలం (కొండను చుట్టి రావడం) దాదాపు 13 కిలోమీటర్లు ఉంటుంది.

చాలా మంది కొత్తగా కారు కొంటే దానిని మొట్టమొదట దేవాలయమునకు

నడుపుకుని పోతారు. ఆవు కొంటే దానిలోంచి తొలిపాలు పిదకగానే దేవుని అభిషేకానికి వినియోగిస్తారు. అలాగే తొలుత కాచిన నేతిని గుడి దీపంలో పోస్తారు.

ప్రజలు ఏ విషయంలోనయినా నిర్ణయం తీసుకోలేని పక్షంలో దేవుని సమక్షములో పువ్వులు పెట్టి అవి ఏ దిశకు రాలుతాయో దానిబట్టి తమ నిర్ణయాలు తీసుకుంటారు. శస్త్రచికిత్సలాంటివి చేసుకోవలసి వచ్చినప్పుడు దేవుడి సమక్షంలో లాటరీ వేసి అందులో ఏ తీర్పు వస్తే అలాగే నడచుకుంటారు.

దేవుడి సమక్షములో కొబ్బరికాయ కొడితే అది రెండు సమభాగాలుగా పగలాలి. అందులో ఏదయినా కొంకర్లు పోతే లేదా కొబ్బరికాయ చెడిపోయిగాని, కుళ్ళిపోయిగాని ఉంటే అది ఆ భక్తుడికి కీడును సూచిస్తుంది.

(కొత్తగా వినాయకుని గుడి స్థాపించాలంటే అందులో ప్రతిష్ఠింపబోయే గణేశుని విగ్రహం వేరే దేవాలయంనించి దొంగిలింప బడినదై ఉండాలట.)

రెండు కుటుంబాలమధ్య వైషమ్యాలు వచ్చి వేరుపడిన తర్వాత మళ్ళీ పునస్సమాగమము కావాలంటే రెండు కుటుంబాలూ, కలిసికట్టుగా దేవుడి హుండీలో కానులు వేసి దేవుడి ఆశీర్వచనాన్ని పొందుతారు. అలా చెయ్యక పోతే వాళ్ళ మధ్య మళ్ళీ తగాదాలు వస్తాయట.

దేవుడి రథచక్రములోని ఇరుసు విరిగితే లేదా జారిపడితే ఆ గ్రామానికి అనర్థం వాటిల్లుతుందని జంకుతారు. అలాగే ఎరయినా గుడి గోపురం కంటే ఎత్తుగా ఇల్లు కడితే అది ఆ గ్రామ వాసులందరికీ అరిష్టదాయకమట.

తుమ్మిన వెంటనే "శివ శివ" "రామా" "కృష్ణా" అని చెప్పటం పరిపాటి. ఎవరైనా ఆవులిస్తున్నప్పుడు ఆవ్యక్తి స్వయంగానో లేదా ప్రక్కన ఉన్న మనిషో అతని నోటికి ఎదురుగా చిటిక వేస్తారు. అలా చేస్తే ఆ వ్యక్తికి దుష్ట శక్తులు సోకవని నమ్ముతారు.

మొదట కాచిన గుమ్మడికాయను, ఇతర కాయగూరలను గుడిలో వంట కోసరం కానుకగా ఇస్తారు.

తిరుచ్చి జిల్లాలోని తెంబరనాడు గ్రామములో పెళ్ళిచూపుల కోసరం వెళ్ళే యువకుడికి వెదురుగాని, వంట చెరకుగాని, పాముగాని, ఎదురు పడినా లేదా జింక అరుపు వినిపించినా అతను వెంటనే ఆ ప్రయత్నం విరమించుకుంటాడు.

## ఇతర విశ్వాసాలు

ఆడపిల్లలు పెరిగి పెద్దవారవుతున్న కొద్దీ, ఇంటిని అలికి శుభ్రంగా ఉంచడానికి, వంట పాత్రలను పరిశుద్ధముగా తోమడానికీ నేర్చుకుని గృహిణికి కావలసిన అన్ని లక్షణాలు బాగా అలవరచుకుంటారు. ఇల్లు ఊడ్చినప్పుడు చెత్తా చెదారమంతా తీసి బయట పారెయ్యమని తల్లి సలహా చెబుతుంది. ఇంటిలోపల మూలలో నయినా దుమ్ము చేర్చి పెడితే తల్లి ఆవిడను చివాట్లు పెడుతుంది "ఉత్సవం రోజున లేదా తోబుట్టువు వివాహ సమయాన ఆ పిల్ల బహిష్టు అయి ఏ మూలనో ఒదిగి కూర్చోవలసి" వస్తుందట. పైగా ఇంటిలో దుమ్ముచేరితే అది దురదృష్టానికీ, అప్పులకూ మూలకారణం అవుతుందట.

పగిలిన అద్దాన్ని ఉపయోగింపరాదు.

కుడి అరచెయ్యి దురద పెడితే ఆదాయానికి సూచన. చైత్రమాసంలో వాన చినుకులు పడితే రాబోయే ఏడాది హర్షదాయకంగా ఉంటుందట. పౌర్ణమి తర్వాత నాలుగో రోజున చంద్రుణ్ని చూస్తే జ్ఞాపకశక్తి మందగిస్తుందట. కొత్త సంవత్సరం పుట్టిన రోజున డబ్బులు వ్యయం చేసినా ఇతరులతో మాట్లాడినా ఆ సంవత్సరమంతా అలాగే జరుగుతుందట.

గోళ్ళు గిల్లడం, కాగితాన్ని చింపివెయ్యడం, కాళ్ళను తరచు కదిలించడం, రాబోయే దారిద్ర్యాన్ని సూచిస్తుందంటారు. ఇంట్లోకి తాబేలు ప్రవేశిస్తే అపచారంగా భావిస్తారు.

పీడకాలు వేసుకుని కూర్చోవడం, మోకాళ్ళపైన భుజాలు ఆనించు

క్రోవడం- రాబోవు చావుని సూచిస్తుంది.

కొత్త దుస్తుల్ని వస్తువుల్ని వాడేముందు చెడ్డ శక్తులనుంచి రక్షణకోసరం వాటి మూలల్లో పసుపు పూస్తారు. కొత్తగా ఆవుగాని, గుర్రముగాని కొంటే ఆ ఇంటికి అదృష్టము రావడమో, దురదృష్టం కలగడమో జరిగి తీరుతుందట.

సూర్యాస్తమయం తర్వాత దీపం పెట్టగనే (విద్యుత్తు దీపాలయినా) గ్రామీణులు చేతులు జోడించి వెలుగు ప్రసాదించిన దేవుడికి నమస్కరిస్తారు. అలాగే సూర్యోదయ సమయాన సూర్య నమస్కారముతోనే దినచర్య ప్రారంభమవుతుంది.

దస్తావేజులలో ఏవయినా తప్పులు వస్తే వాటిని కొట్టివేయరు. అందుకు బదులు దస్తావేజు చివరి భాగంలో సవరణలు ప్రత్యేకంగా సూచిస్తారు. రాసిన దానిని కొట్టివేస్తే అది దురదృష్టమునకు హేతువు అని భావిస్తారు. ఏదైనా దస్తావేజు రాస్తున్నప్పుడు యాధృచ్ఛికంగా సిరా చిందితే దానిని శుభ శకునంగా తలుస్తారు.

ఏ వస్తువు అయినా ఎడమ చేతితో ఇవ్వడం అగౌరవంగా భావింపబడుతుంది. అది పుచ్చుకునే వ్యక్తిని కించ పరచినట్టు అవుతుంది.

తేవాంగు (Sloth) అనే జంతువు ఎముకల బూడిదతోను, చనిపోయిన స్త్రీ పుర్రెతోను పచ్చ కర్పూరము కలిపి ఒక అంజనము తయారు చేస్తారు. ఏదైనా వస్తువు దొంగతనం అయితే ఈ అంజనమును తమలపాకులో రాసి దుర్భిణీ వేసి ఆ దొంగ ఎవరో అతని ప్రవర్తన ఎలాంటిదో అతను ఏ దిశ నుంచి వచ్చాడో కనిపెడతారట.

## మాయలు, మంత్రాలు

**మాయాజాలము:-** వీధి మొగసాలల్లో మాయాజాలురు జనాన్ని ప్రోగు చేసుకుని కొన్ని వింతల్ని చేసి చూపిస్తుంటారు. దీర్ఘ వ్యాధుల్ని నయం

చేస్తామని చెబుతూ వుంటారు. వాళ్ళు కోసిన తాడును యథాతథంగా అతి కించడం, ఒకవ్యక్తికి నాలుక పీకేసి మాట్లాడించడం, కాగితాన్ని నమిలేసి రంగు రంగుల పూవుల్ని బైటికి తీయడం, శూన్యంలోంచి కొబ్బరికాయలు తియ్యడంలాంటి మాయా జాలాలు చేసి చూపిస్తారు.

## వైద్యము

యూరోపియనులు మన దేశమునకు వచ్చే ముందు శతాబ్దములలోనే వైద్య శాస్త్రము భారత దేశంలోనూ తమిళనాడులోనూ బాగా అభివృద్ధిలో ఉండేది. ఈ వైద్య పద్ధతులలో కొన్ని తాళ పత్రములపై పద్య రూపములో వ్రాయ బడి తంజావూరులోని సరస్వతీ మహాలు లైబ్రరీలో ఇప్పటికీ భద్రపరచబడి ఉన్నవి.

తమిళ దేశంలో రూపొందింపబడి మిక్కిలి ప్రచారము చెందిన వైద్య విధానము సిద్ధ వైద్యము. అతి ప్రాచీన కాలంలో నివసించిన 18 మంది సిద్ధులచేత ఈ పద్ధతి కనుగొనబడిందని చెబుతారు. తమిళ సాహిత్యము పరిశీలిస్తే ఈ సిద్ధులు వైద్యములో ఆరితేరినవారే కాక గొప్ప వేదాంతులనీ శరీర శాస్త్రములోను రసాయన శాస్త్రములోను నిష్ణాతులనీ దేశంలో పలు ప్రాంతములలో సంచరించి అపార విజ్ఞానం సముపార్జించారని వెల్లడవు తున్నది. వాళ్ళు రసవాదము తెలిసిన వారనీ (ఇతర లోహములను బంగా రుగా మార్చడాన్ని రసవాదము అంటారు) తెలుస్తోంది.

సిద్ధులు తమ విజ్ఞానాన్ని రహస్య శాస్త్రములుగా రాసి ఉంచారని చెబు తారు. 64 విధములైన ఔషధములతో వారు దీర్ఘాయుస్సును, నిత్య యౌవ నమును ప్రసాదింప గలిగేవారట. వాళ్ళచేత నయముకాని రోగము ఏదీ లేదని ఇచ్చటి ప్రజల నమ్మకం. వీళ్ళు మరణించిన వారిని సైతము బ్రతి కించి వాళ్ళచేత మాట్లాడగలిగించే సమర్థులట.

త్రికాల జ్ఞానులైన ఈ సిద్ధులు తమ అభీష్టానుసారం జీవించడం,

మరణించడం జరిగేదట. వాళ్ళు ప్రజల మధ్య తిరుగుతున్నా వారిని ఎవరూ గుర్తు పట్టలేరట. వాళ్ళు ఆకుల పసరును లోగొని తన్మయత్వంలోకి యోగ నిద్రలోకి జారిపోయేవారట. వాళ్ళ దగ్గర "గమన ఓడి" అనే ఒక వైద్య సూత్రము ఉండేదట. దాని సహాయముతో శరీరమునకు తన్మయత్వము కలిగించి కోరిన చోటికి తృటిలో వెళ్ళగలిగేవారట.

కాంచమలై (సేలం జిల్లా) లో నివసించిన సిద్ధులు మామూలు లోహాలను బంగారంగా మార్చే విశేష శక్తిని కలిగి ఉండేవారని లిఖిత పూర్వకమైన ఆధారములున్నాయి.

ఇప్పటికిని సేలం జిల్లాలో ఉక్కు కర్మాగారము కోసరం కేటాయింప బడిన ప్రాంతంలో "ఏళుమట్టనూర్" (ఏడు భాగముల గ్రామము) అనే పేరుతో ఒక గ్రామము వ్యవహరింపబడుతున్నది. ఒకస్థానిక దేవాలయము లోని శాసనముల ప్రకారము సిద్ధులు తమ మంత్ర శక్తితో గనుల్లో దొరికే బంగారం కన్నా మేలిమి బంగారం తయారు చేసేవారని వెల్లడవుతున్నది.

ఇప్పటికిని కొందరు సిద్ధులు మంత్ర శక్తుల పట్ల నమ్మకం లేని వాళ్ళ దేహములో తేలు విషమును ప్రవహింపచేస్తారని, శూన్యములోంచి విబూది, కొబ్బరి కాయలు సృష్టిస్తారని, ఉంగరమును మాయం చేస్తారని, మూగవారి అరచేతిలో పువ్వుఉంచి వారిచే మాట్లాడిస్తారని చెప్పుకుంటారు. అనుభవజ్ఞు లైన శిష్యులు చెప్పేదేమిటంటే - వారి నమ్మకాలను బట్టి ఈ సిద్ధులు తమ మహత్తును ప్రదర్శిస్తాడట. (నంభియవడక్కు కల్ కండు, నంబాబ వరుక్కు కల్‌గుండు అనే సామెత వాడుకలో వున్నది. అంటే నమ్మిన వారికి కండె చక్కెర, నమ్మని వారికి గులక రాళ్ళు లభిస్తాయని భావము)

వేసవి కాలంలో ఉప్పు చిప్పలలో దొరికే లవణంలాంటి పదార్థమును వీరు మందుల తయారీలో వినియోగిస్తారట. కాని వారు మూలికల నుంచి, లోహముల నుంచి ఔషధములు చేయుటలో సుప్రసిద్ధులు, వారు మూలికల

మొక్కలతో సంభాషింపగలిగేవారట. వాళ్ళు లోహములను ఔషధచూర్ణములుగను, గొప్పశక్తిగల మాత్రలుగను చేసేవారట.

18 సిద్ధులలో ప్రథములైన నంది దేవర్, మరియు అగస్త్యుడు చాలా ప్రయాసపడి మూలికలలోని ఔషధగుణములను కనుగొన్నారట. "వేయి రకాల చెట్ల మూలికలను తన వద్దకు వచ్చే రోగులపైన ప్రయోగించిన, వాడు తప్పక వైద్యుడవుతాడు" అనే నానుడి వాడుకలో వున్నది. కొన్ని మూలికలు మందు తయారీకి పనికి వస్తాయని కనుగొన్న తర్వాత సిద్ధులు ఆ మూలికల చెట్లను చాలా ఎత్తయిన ప్రదేశములలోనూ ఎవరికీ కనబడని ప్రదేశములలోనూ, పైరు చేసేవారట.

తమిళనాడులో అనేక ప్రదేశములలో ఈ ఔషధమూలికలు విరివిగా ఉన్నాయి. పురాణేతిహాసములను పరిశీలిస్తే ఈ మూలికలలో కొన్ని వయో వృద్ధుని సైతం నవయువకుడుగా మార్చగలశక్తి గలిగి ఉండేవని వెల్లడవుతుంది. సేలం సమీపంలోని ఇళం పిళ్ళై (యువకుడు) అనే గ్రామములో ఒక కథ ప్రచారములో ఉన్నది. ఒకసారి ఒక ముసలి సన్యాసీ, అతని ముసలి శిష్యుడూ, ఒక అడవిలో విశ్రమించి ఉన్నప్పుడు ఆ ముసలి సన్యాసి తాను ధ్యానములోకి వెళ్ళే లోపల చేయమని శిష్యుణ్ని ఆదేశించాడట. శిష్యుడు ఒక కొయ్య పుల్లతో అన్నము కలుపుతుంటే అన్నము నల్లగా మాడిపోయిందట. ఈ వింతను చూసి దిగ్భ్రాంతి చెందిన ఆ శిష్యుడు గురువు ఆగ్రహానికి భయపడి తను ఆ అన్నమును భక్షించాడట. తక్షణం అతను అందమైన దృఢకాయుడయిన యువకుడుగా మారిపోయాడట. తదుపరి ఆ అన్నము తిన్న ముసలి సన్యాసి సైతం యువకుడుగా మారిపోయాడట. ఈ కథకు దృష్టాంతముగా ఆ ఊరికి ఇళం పిళ్ళై అనే పేరు వచ్చింది. ఇప్పటికీ కొందరు ధనవంతులు వృద్ధాప్యమును జయించడానికి తంగ భస్మము (స్వర్ణ భస్మము) తీసుకుంటారని చెబుతారు.

పై పూతకు ఉపకరించే తైలలేపము తయారు చేయుటలోనూ సిద్ధవైద్యులు

ఆరితేరినవారు. ఆ తైలముతో అభ్యంగన స్నానముచేస్తే చర్మవ్యాధులు రాకుండా కాపాడుతుందట. జలుబుచేస్తే ముక్కురంధ్రములలో కొన్ని చుక్కలు ఆముదము పోస్తారు. ఉబ్బసవ్యాధిని నయంచెయ్యడానికి మూలికలు వాడుతుంటారు. ఆకుల పసరు ఉపయోగించి విరిగిన ఎముకలను కట్టడం కొందరు తమ పూర్వీకులనుంచి నేర్చుకుని ఇప్పటికిని పెద్దపెట్టున ఆవృత్తి చేస్తున్నారు. విరిగిన ఎముకలు కట్టుటలో కారైక్కుడి దగ్గరవున్న తుళవూరు, తిరుచ్చిరాపల్లిలోని పాలక్కరై, కోయంబత్తూరులోని తెలుంగు పాళ్యం, మరియు మద్రాసు సమీపములోవున్న పుత్తూరు (ఆంధ్రప్రదేశ్) ప్రఖ్యాతి గాంచాయి.

రోగములను నయంచేయుటకు తమిళనాడులో యంత్రములు(బీజాక్షర చక్రములు) బాగా ప్రచారములో వున్నాయి. రాగి మున్నగు లోహపు రేకులపైన ఈ చక్రములువేసి వాటితో తాయెత్తుచేసి రోగిభుజమునకో మెడలోని బంగారు గొలుసులోనో కడతారు. ఆ తాయెత్తులో దైవికశక్తి చొప్పించడం కోసరం ప్రత్యేకమైన మంత్రాలు వల్లిస్తారు. ఆనక ఆ తాయెత్తు సకల అరిష్టాలను తొలగించి ఆయురారోగ్యములు, ఐశ్వర్యమూ కలుగచేస్తుందని నమ్ముతారు.

సిద్ధవైద్యులు మూలవ్యాధి, తామర మున్నగు వ్యాధులను నయం చేస్తారట. భోగర్ అను పేరుగల ఒక తమిళ ధన్వంతరి (దేవవైద్యుడు) ఉపయోగించిన రసాయనములు రోగనివారణలో చాలా గొప్పగా పనిచేసేవట. ఇప్పటికిని మధురై జిల్లాలోని పళని ప్రాంతములో సిద్ధఔషధములు తయారుచేసే వైద్యులు బంగారు భస్మమును, వెండి తదితర లోహములను, ముత్యములు మణులు మున్నగు వాటిలోంచి తీసిన సారమును, మూలికల రసమును తమ మందులలో వాడుతున్నారు. మూలికలనుంచి తయారుచేసే మర్మతైలము అనబడే మందును నిద్రపోయేముందు ఒంటికి పట్టిస్తారు. మరుసటి ఉదయం వేడి నీళ్ళతో స్నానంచేస్తే నొప్పులనుంచి దేహానికి స్వస్థత చేకూరుతుందట.

అనేకములైన ఒంటినొప్పుల నివారణ కోసరం నువ్వులనూనెలో కొద్దిగా మిరపకాయలు, పసుపూవేసి కాచి ఒంటికి మర్దనచేసి వేడినీళ్లతో స్నానం

చేస్తారు. అతిసారవ్యాధి (రక్తబేది)ని నిరోధించాలంటే ఉడకబెట్టిన జాజికా యను పొడిచేసి అరటిపండుతో కలిపి తీసుకుంటారు. కోరింత దగ్గు తగ్గా లంటే నక్కచర్మములో కొంత ముక్కకోసి పొయ్యిలో కాల్చి తేనెతో కలిపి ఆలేహ్యాన్ని ఆరగిస్తారు.

శరీరములో ఏభాగంలోనైనా కురుపులువేస్తే పచ్చిబియ్యపు పిండిని పసుపు పొడినీ ఉడుకబెట్టి పట్టీవేస్తారు. గొంతుక రాసుకునిపోతే మునగాకు రసము పిండి సున్నము రసముతో కలిపి గొంతుకపైన లేపనముగ పూస్తారు.

ఔషధగుణము కలిగిన శొంఠి, పసుపు ఉల్లిగడ్డ, ఆవాలు జాజికాయ, లవంగము మున్నగు సుగంధ ద్రవ్యములు ఆహారముతో కలిపి ఆరగిస్తారు. అన్నము వార్చిన గంజినీళ్ళను రాత్రికి ఉండనిచ్చి మరురోజు అందులో ఉప్పు, పసుపూ, ఇంగువకలిపి ప్రతిమూడు గంటలకొకసారి టానిక్కులాగా సేవిస్తారు. మూత్రవ్యాధులలాంటి రోగముల నివారణకోసరం మర్రిచెట్టు పాలు ఉపకరిస్తుంది.

మతిభ్రమణము కలిగిన వ్యక్తులను పెద్దపెద్ద జట్లుగా కుట్రాలం సమయ పురం దేవాలయములలోకి పిలుచుకుని వెళతారు. నలభై అయిదు రోజులుస్నానం చేసి పూజలు జరిపిన తర్వాత చాలామందికి పిచ్చిబాగు పడిందని చెబుతారు.

శైవదేవాలయములలో పంచిపెట్టే విబూధికూడా రోగనివారణకు ఉపకరి స్తుందట. తిరుజ్ఞాన సంబంధర్ అనే గొప్పసాధువు విబూభి సహాయంతో అలనాటి పాండ్యరాజును విషజ్వరంనించి రక్షించాడట. ఇప్పటికిని నాటుపుర ములలో ఒకముఖ్యమైన తేవారం (పాట) పాడి కొన్నిమంత్రాల జపించిన తర్వాత పంచిపెట్టబడే విబూది ఏరోగాన్నయినా పోగొడుతుందని నమ్ముతారు. అలాగే జ్వరముతో బాధపడే పిల్లలకు, గాలిసోకిన పిల్లలకూ ఒంటిమీద విబూది పూస్తే వారికి స్వస్థత చేకూరుతుందట. తేలుకుడితే మంత్రాలతో నయం చేస్తారు. కొందరు పామువిషమును సైతము విరచగలిగ మంత్రశక్తి కలిగి వున్నారని చెబుతారు బెస్తవాళ్ళు ముత్యాలసేకరణకు వెళ్లేముందు మంత్రాలు జపించే దైవభక్తులను సందర్శించి వెళతారు. అలాచేస్తే వారికి

సముద్రములో అపాయము కలుగదట. ఆ భక్తులకు బెస్తవారు కానుకగా కొన్ని ముత్యములు చెల్లిస్తారు.

ఆవుపేడ ఇళ్ళలో క్రిమిసంహారిణిగా ఉపకరిస్తుంది. ఇది గ్రామీణ ప్రజలకు ఫినాయిల్ లాంటిది. దానితో ఇల్లు అలుకుతారు. ఇంటిముంగిట కళ్లాపి జల్లుతారు. రోజూ అలా చెయ్యడంవల్ల ఇంటిముంగిలి గట్టిపడి సిమెంటు గార పూసినట్టు నున్నగా తయారవుతుంది. పసిపాపలకు పాలాద్రై (గవ్వ) లో పంచ గవ్యము అనబడే అయిదు పదార్ధముల మిశ్రమమును (ఆవుమూత్రము, పేడ, పాలు. పెరుగు మరియు నెయ్యి) కొద్దిగా తాగిస్తారు. అలాచేస్తే పసిపాపలకు రోగములు సోకవని నమ్ముతారు. మతప్రవక్తలు ఈ పంచగవ్యమును కాలుష్యమును తొలగించే పవిత్రతీర్ధమని భక్తులకు పంచిపెడతారు.

రోగములపట్ల కొండతెగల వైఖరి ఎలాఉంటుందో ఇక్కడ ప్రస్తావించవలసి ఉంది. వాళ్లల్లో ఎవరికైనా మశూచికము సోకితే ఆవ్యక్తిని అందరూ నిర్లక్ష్యముచేసి అతన్ని వీధికి వదిలేస్తారు. తమదేవత ఆగ్రహించడం వల్లనే మశూచి వ్యాపిస్తుందని వారు దృఢంగా నమ్ముతారు.

పళియర్ అనబడే కొండజాతివారికి అడవులలో దొరికే మూలికలూ, దుంపలూ ఔషధములో వాడుతారు. వాళ్ళు ఈ దుంపలను పొడిచేసి పాము కాటుకు వేస్తారు. వారు పచ్చి దుంపలను నమిలి అందలి రసమును కొద్దిగా పాము కాటువేసినచోట ఉమ్ముతారు. మిగతా రసమును కడుపులోకి మింగుతారు.

ఈ పళియరు తెగవారు మంత్ర తంత్రములలోను ఘటికులు. వారు తమ మంత్రశక్తితో క్రూర మృగములను సైతము అచేతనముగా చేయగలరు. వాటి నోరు మూయించి గోళంలోను, పంజాలలోను తిమ్మిరి పుట్టిస్తారు. వారు గ్రామానికి నాలుగు దిశలలోనూ గుంటనక్క తోకలను పాతిపెట్టి కొన్ని మంత్రాలు ఉచ్ఛరిస్తే ఆ గ్రామము క్రూరమృగముల బారినుంచి రక్షింపబడుతుందట,

## మంత్రములు, మాయాజాలములు

గ్రామస్తులు ఏదయినా వింతలు సంభవిస్తే అది ప్రకృతి లీలలని నమ్మరు. ఎవరో మాయలూ, మంత్రాలు చెయ్యడంవల్ల అలా జరిగిందంటారు. మంత్రాలు జరిపించిన తర్వాత విచిత్రశక్తి పొందిన విభూధిని తమ విరోధి ఇంట్లోగాని ఇంటి పైకప్పుమీదగాని చల్లుతారు. ఏదో ఒక నక్షత్ర మండలము కనిపించినరోజు మొదలు కాని మంత్రాలు పనిచెయ్యడం ప్రారంభమవుతుందట. ఆ గృహస్తుని కార్యకలాపాలలో విఘ్నము కలగటమో, లేదా అతని ప్రయత్నంలో కాలయాపన జరగడమో సంభవిస్తుందట. నలభై ఎనిమిది గంటలలోగా అతనికి తీవ్రమైన సంక్షోభం సంభవిస్తుందని నమ్ముతారు.

ఏవల్ (చెరుపు చెయ్యటం) మూలంగా ఒక వ్యక్తిపైన చెడ్డ శక్తులని ఉసిగొల్పి అతనిని నిర్ణీత కాలము లోపల చంపుతారట. కొందరు మాంత్రికులు ఈ దుష్ట శక్తులను తమవైపు తిప్పుకుని వాటిచేత అపాయం కలుగకుండా రక్షిస్తారట. మంత్రాలు వల్లించడం ద్వారాను నిష్ఠతో ప్రార్థనలు చెయ్యడం ద్వారాను దేవుణ్ని ప్రసన్నం చేసుకుని తమ విరోధి పేరును ఉచ్చరిస్తే అతను మంచం పడతాడని నమ్ముతారు. పాములనుంచి, క్రూర మృగాలనుంచి తప్పుకోవడానికి మంత్రాలు జరిపిస్తారు. విరోధి పాద ముద్రలు సేకరించి స్మశానములోకెళ్ళి మంత్రాలు వల్లిస్తారు. పోటీ మాంత్రికుల చేత ఈ ఎత్తుగడలను కనుగొని ప్రతిచర్య తీసుకోవడం వల్ల జరుగనున్న హానినుంచి తప్పుకుంటారట.

విరోధికి కాళ్ళు చేతులు లేదా నోరు పడిపోవడానికి మాయాజాలం చేస్తారు. ఆ వ్యక్తి దిష్టిబొమ్మను గుడ్డతోగాని పిండితోగాని తయారుచేసి మంత్రములు వల్లించిన తర్వాత ఆ బొమ్మను విరిచేస్తారు. అలా చేస్తే విరోధికి పక్షపాతం తగులుతుందని నమ్ముతారు.

ఒక రాగిరేకుపైన మంత్రము వ్రాసి దానిని విరోధి ఇంటి గుమ్మంవద్ద నేలలో పూడ్చిపెడితే అతని కుటుంబం సర్వ నాశనమవుతుందని నమ్ముతారు.

రోగ నిర్ణయం కోసరం మాంత్రికులను రప్పించి ప్రయోగాలు జరిపిస్తారు. వారు సంజెవేళ వీధి చివర్లలో విబూది చల్లి రోగానికి మూలకారణ మేమిటో కనిపెడతారట.

కొన్ని సందర్భాలలో ఈ మాంత్రికులు పెద్ద విస్తరిలో పచ్చిబియ్యము, అరటిపళ్ళు, తమలపాకులు, వక్కలు, కొబ్బరికాయలు, నిమ్మపళ్ళూ సమకూర్చమంటారు. వాటిపైన ఒక విల్లుపెట్టి దాని మొనలో అడకత్తెర ఉంచుతారు. తదుపరి ఆపదకు కారణభూతమైన క్షుద్రదేవత పేరు చెబుతారు. తర్వాత ఆ దేవతకు కావలసిన వస్తువులను అర్పణ చేస్తారు. రక్షరేకుల మూలంగా దుష్ట శక్తులను పాలద్రోల వచ్చునని అంటారు. అలా దుష్ట శక్తులు ప్రవేశించిన ఇంటిని లేదా వ్యక్తిని అనుభవముగల మాంత్రికులు చక్కబరుస్తారట.

కురలి లేక కుట్టి సాత్తాన్ అనబడేది మామూలు కళ్ళకు కనిపించని ఒక మహా దుష్టశక్తి అని అంటారు. దానిని ఉసిగొల్పితే విరోధి నివాస గృహంలో వంటయింట్లో రాళ్ళవాన కురిపిస్తుందనీ, వెంటకుప్పల గాలి వీయిస్తుందనీ, కుళ్ళిన గ్రుడ్లను కురిపిస్తుందనీ భూకంపము కలుగ జేస్తుందని నమ్ముతారు. ఈ క్షుద్రశక్తి భయంకరమైన కేకలు పుట్టిస్తుందనీ, ఇళ్ళ పైకప్పులను కూల్చేస్తుందని అంటారు. దొంగలు, దోపిడిగాళ్ళు రొట్టెలో కొన్ని మందులు కలిపి కుక్కలకు వేస్తే అవి మొరగకుండా నిశ్శబ్దంగా ఉండిపోతాయట.

ఆడపిల్లలు దిష్టి తగలకుండా గాలి సోకకుండా ఉండటానికి తమ నొసట్లో తిలకము పెట్టుకుంటారు.

మానవాతీతమైన ఈ మంత్ర శక్తులను పొందటానికి మాంత్రికులు భూతాలను ప్రసన్నం చేసుకుంటారని అంటారు. కొండజాతులలోను కొందరు

ఈ శక్తులు కలిగివున్నారు. వాళ్ళు మంటవేసి, భూతాలను అక్కడకు రప్పించి తర్వాత వాటిని అక్కణ్నించి శాశ్వతంగా పారద్రోలేస్తారట.

మంచి ఔషధగుణములు కలిగిన వేపాకు ఈ మాయా మంత్రములలో బాగా వినియోగింపబడుతుంది. దుష్టశక్తులను నిరోధించడం కోసరం ఈ వేపాకు తోరణాలను ఇంటి గుమ్మాలలోను, ఇళ్ళపైనను కట్టిస్తారు.

కొన్ని తైల పదార్థములను విరోధి దేహంలో రహస్యంగా రాయడం లేదా అతను తీసుకునే నీటిలో, పాలలో, చక్కెరలో, ఉప్పులో లేదా అన్నంలోనో కలపడం కూడా జరుగుతుంది. అలా చేసే ముందు మంత్రములు వల్లించి విరోధి నామమును పదే పదే ఉచ్చరిస్తారు. వేరే పద్ధతులు కూడా కలవు. ఒక వ్యక్తి ఈ తైల పదార్థమును తన నొసట పూసుకుని జనుల మధ్య సంచరిస్తే అతని విరోధి తప్పకుండా అతనికి లొంగిపోతాడట.

పురాణకాలపు కవయిత్రిగా ప్రఖ్యాతిగాంచిన అవ్వై ఒక రాత్రి ఒక సత్రములో నిద్రకుపక్రమించినదట. అక్కడ ఆత్మహత్య చేసుకున్న ఒక కన్నె పిల్ల ప్రేతము తిరుగుతుందట. ఆ ప్రేతము అక్కడ బస చేసిన ప్రయాణీకులనందరినీ, భయభ్రాంతులను చేసిందట. చివరికి అవ్వై కూడా ఆ భూతం బారినుంచి తప్పించుకోలేక పోయిందట. ఆ రాత్రంతా నిద్రలేక జాగరణ చేస్తూ ఈ క్రింది విధంగా పాటలు రాస్తూ గడిపిందట.

రెండు సార్లు విన్నా ఒక
పద్యపదాన్ని నేర్చుకోలేని దద్దమ్మ ఒకడు
ఖాళీ తాళ పత్రం కనిపించినా
వ్రాయడం చేతగాని మూర్ఖుడొకడు-
గట్టిగా బాదు దయ్యమా!
వాళ్ళని గట్టిగా బాదు!

తమిళనాడులోని ఆటవిక జాతులలో నీలగిరి కొండ ప్రాంతములో నివసి

స్తున్న కురుంబలు అనబడే తెగవారు ఈ మంత్రతంత్రాలలో నేర్పరులనీ వారు తమ శక్తిని కోటాలనబడే మరో తెగపై ప్రయోగిస్తారని చెబుతారు. కోటాతెగల జీవిత విధానంలో ఈ నమ్మకాలు గాఢమైన ముద్రవేశాయి.

దిష్టి:- కొందరు చెడ్డ వ్యక్తులు కొన్ని మృగాలు చూడటం వల్ల దిష్టి తగులుతుందంటారు. అలా దిష్టికి గురైన మనిషిని కూర్చో బెట్టి ఉప్పూ, మిరపకాయలూ, ఆ వ్యక్తి ముఖం వద్ద హారతిలా మూడుసార్లు తిప్పుతారు. తర్వాత వాటిని మండుతున్న పొయ్యిలో వేస్తారు. పొయ్యినుంచి చెడ్డ వాసన వస్తే దిష్టి తొలగిపోతుందని దానికి కారకుడైన వ్యక్తికి తగినశాస్తి జరుగుతుందనీ అంటారు. ఇలాటి దిష్టి బారినుంచి రక్షించడానికి గుమ్మడికాయపైన మనిషి బొమ్మ వేసి కొత్త ఇంటి ముంగిట్లో వేలాడదీయడం, ఒక అలవాటు. ఆ గుమ్మడికాయ కుళ్ళిపోతే దిష్టి హరించుకు పోయినట్టే లెక్క! పంటలు పుష్కలంగా పండిన వరి చేలలో రైతులు ఎండి గడ్డిలోనూ, గుడ్డపీలికతోనూ, దిష్టి బొమ్మ చేసి చేను మధ్య భాగంలో నాటుతారు. అలాగే వర్తకులు తమ విక్రయశాల ముందర రెండుకళ్ళ చిత్రములో మిరపకాయతో బంధించిన నిమ్మకాయనో వేలాడదీయడం కద్దు.

ఒకవ్యక్తి తింటుంటే ఆ దృశ్యాన్ని ఆకలి కడుపుతో ఉన్న మరో వ్యక్తి చూడటం సంభవిస్తే తినినవ్యక్తికి కడుపునొప్పి వస్తుందంటారు. ఈర్ష్యా భావం కల రైతు కుటుంబాల వారు ఈ దిష్టి యొక్క చెరుపును గురించి ఎక్కువగా పట్టించుకుంటారు.

## శకునము

శకునము గురించిన మూఢనమ్మకాలు ఎక్కువగా వాడుకలో ఉన్నాయి. ప్రయాణము మొదలెట్టేటప్పుడు కాలు జారితే అది అపశకునము. ప్రజలు సామాన్యంగా బయలుదేరేముందు తమ ఇంటి గుమ్మంలో నిల్చొని మంచి శకునంకోసరం ఎదురు చూస్తారు.

కాకి అరిస్తే బంధువులు వస్తారని అర్థం. భోజనవేళలోన్లూ పెళ్ళి

సందర్భములోనూ దీపం ఆరిపోతే అది అశుభ సూచకంగా భావిస్తారు. కట్లపాము ఇంట్లో ప్రవేశించినా, గుంటనక్క, కుందేలు వంటి జంతువులు ఊళ్ళోనికొచ్చినా అది కీడును సూచిస్తుంది. ఇంటిముందర కాకులు ఒక దాన్నొకటి పొడుచుకుంటూ గోలచేస్తే చావుకబురు వస్తుందని నమ్ముతారు. మరీ పుష్కలంగా పంటలు పండినా ఆ వ్యవసాయదారుడికి మృత్యువు సంభవిస్తుందట.

కొన్ని నక్షత్రాలతో మృత్యువు సంభవిస్తే (అశ్వని నుంచి రేవతిదాకా) ఆ ఇంటిలోని తతిమ్మా వ్యక్తులకి కీడు జరుగుతుందట. అలా జరిగితే ఆ ఇంట్లో కొత్తగా గచ్చు వేయడమో, కొంత భాగాన్ని పునర్నిర్మించడమో చేస్తే కీడు తొలగిపోతుందట. ఒక వ్యక్తి శనివారం గనక మరణిస్తే ఆ ఇంట్లో ఇంకో చావు వస్తుందట.

## జోస్యము

జన్మ రాసులను బట్టి పంచాంగము సహాయముతో జ్యోతిష్కులు జోస్యము చెబుతారు. పుట్టిన వేళలో గ్రహస్థితులు ఎలా ఉన్నాయో లెక్కించి జరుగబోయే వాటిని పసిగడుతారు. అందరికీ అనువుగా ఇప్పుడు దిన పత్రికలలోనూ వార పత్రికలలోనూ రాశి ఫలాలు ప్రచురిస్తున్నారు. గ్రహాల సంచారమునుబట్టి జోస్యము చెప్పే ప్రత్యేక పత్రికలు కూడా ఉన్నాయి.

వళ్ళువర్ అనే జాతివారు ఈ జోస్యము చెప్పుటలో ప్రాచీన కాలం నించీ ప్రసిద్ధికెక్కారు. వీళ్ళు తమ జోస్యమును జ్యోతిష గీతాల (నంది వాచకంగళ్) ద్వారా వెల్లడిస్తారు. వళ్ళువర్ కుటుంబంలోని జ్యేష్ఠ పుత్రుడు తన తండ్రివద్దనుంచి ఈ గీతాలను నేర్చుకుంటాడు. తక్కిన కుమారులు వేరే వృత్తులు చేబడతారు. ఈ వళ్ళువ జోస్యులు చెప్పేవాటిపైన గ్రామస్థులకు అపార నమ్మకం ఉంది.

సంగకాలపు సాహిత్యములో పేర్కొనబడిన పూజారి, నిమిత్తకారన్

(గుడి సేవకుడు) మున్నగువారి వంశీయులైన గుడి జోస్యులు ఇప్పటికిని గుళ్ళో పూజలు ముగిశాక జోస్యం చెబుతున్నారు. సంగకాలపు సాహిత్యంలో పేర్కొనబడిన అగవళ్ మగళిల్ (జోస్యము చెప్పే స్త్రీలు) వంశీయులుగా చెప్పబడుతున్న ఎరుకల జాతిస్త్రీలు గురి చెప్పడం వృత్తిగా జీవిస్తున్నారు. వారికి మంచి ఆదాయం వస్తుంది. వీళ్ళను సూదులోళ్ళు అనడం కూడా కద్దు. వీళ్ళు ఉండేలుదెబ్బ సహాయంతో పక్షుల్ని కొట్టి తింటారు. గ్రామాలలో తిరుగుతూ మట్టిపూసలూ కుట్టుసూదులూ మున్నగునవి అమ్ముతారు. వీళ్ళు రాబోయే వర్షంగురించి అదృష్టము గురించీ జోస్యం చెబుతారు.

తమిళనాడులో వాడుకలో వున్న హస్తసాముద్రిక శాస్త్రము పాశ్చాత్యుల హస్తరేఖా శాస్త్రమునుంచి వేరుపడినది. అరచేతిలోని రేఖలనూ, గుర్తులనూ ఆధారం చేసుకుని ఫలితములు చెప్పబడుతాయి, వీటిని ప్రజలు నమ్ముతారు.

ఒక నాసికా రంధ్రమును మూసుకుని ఒకే వైపున శ్వాసిస్తూ జోస్యము చెప్పడము కూడా కద్దు.

తన భవిష్యత్తు గురించి భయపడుతున్న ఆడపిల్ల కళ్ళుమూసుకుని నేల పైన వలయాకారంగా రేఖ గీస్తుంది. ఆ రేఖ రెండు కొనలూ కలుసుకుంటే ఆవిడ కోరిక నెరవేరుతుందంటారు. తమిళ స్త్రీలకు మిక్కిలి ఇష్టమైన ఈ క్రీడా వినోదమును కూడల్-ఇళైత్తల్ (పొందడం లేదా పోగొట్టుకోవడం) అంటారు.

బల్లిపలుకులకు ఎంతో ప్రాముఖ్యత ఉన్నది. జ్యోతిష్కులు వీటి పలుకుల ఆధారముగా భవిష్యత్తును గురించి చెబుతారు. ఏ మూలలో పలికిందో ఏ సమయంలో పలికిందో దానినిబట్టి ఫలితాలు నిర్ణయిస్తారు.

మగవారికి ఉన్నట్టుండి కుడికన్ను అదిరినా కుడి భుజం అదిరినా త్వరలో శుభం కలుగుతుందట. ఆడవారికి ఎడమకన్నూ ఎడమ భుజమూ అదిరితే శుభం.

సామియాడిగళ్ (పూనకం వచ్చే వ్యక్తులు) అనబడే వ్యక్తుల ద్వారా దేవుళ్ళు భవిష్యత్తును గురించి చెబుతారని నమ్ముతారు. కొందరు పూనకం దార్లు అడిగిన ప్రశ్నలకు మాత్రమే బదులు చెబుతారు. కొందరు వ్యక్తులను చూస్తూనే జరుగబోయే విషయం చెబుతారు. వీళ్ళు వచ్చిన వ్యక్తుల సమస్యలేమిటో, అవి ఎంతకాలం లోపున తీరతాయో. దాని కోసరం ఏమేమి కానుకలు సమర్పించుకోవాలో - ఏకరువు పెడతారు. గ్రామస్థులు కోడెదూడ, మేకపోతులాంటివి దొంగతనం చేయబోతే వెంటనే ఈ సామియాడి దగ్గరికి పరుగెత్తుతారు. వీళ్ళద్వారా వర్షము గురించి కూడా జోస్యము చెప్పించుకుంటారు.

చిలక జోస్యము కూడా పేర్కొన దగినది. ఈ జోస్యములన్నిటిలోనూ అతి ముఖ్యమైనదిగా పరిగణింప బడేది లంబాడి జోస్యము. లంబాడి, రాత్రి పూట స్మశానంలో నిదురించి మరునటి ఉదయం లేచి జరిగిపోయిన దానిని గురించి ఖచ్చితంగా చెబుతారట. అందుకే లంబాడీ మాటలు వేదవాక్కులుగా గౌరవింపబడతాయి. అతనంటే గ్రామస్తులు భయపడతారు. అతని కోరికలను తీరుస్తారు.

నాడి :- సామాన్య ప్రజలకి ఈ నాడి జోస్యముపైన నమ్మకము వుంది. ఈ నాడి పరీక్ష అన్నది మనిషిలో దైవచింతనను పెంపొందిస్తుందని నమ్ముతారు.

నాడి అనగా రక్త ధమనుల వేగమును పరీక్షించుట. అతి పురాతనమైన తాళ పత్రములలోగల రాతలను బట్టి ఈ నాడిని గణిస్తారు. ఈ తాళ పత్రములోని ఒక్కొక్క పుట, ఒక్కొక్క ప్రత్యేక వ్యక్తిని గురించి వ్రాయబడిందంటారు. ఒక వ్యక్తికి తన నాడికి సరిపోయే తాళ పత్రము దొరికితే అది అతని అదృష్టమట. ఒకొక్కప్పుడు కొందరు వ్యక్తులకు కలసి ఒకే కోవకు చెందిన నాడిగల తాళ పత్రము ఉంటుంది. ఈ నాడీ పరీక్ష

చెంగల్పట్టు జిల్లా అచ్చర పాక్కంలోని వళ్ళువీర్ తెగవారిచే చేయబడు తుంది. ఇతర చోట్లలోను కొన్ని జాతులు నాడీ పరీక్ష చేస్తున్నారు. అచ్చర పాకం వళ్ళువర్ జాతిని గురించి ఒక గాథ ప్రచారములో వున్నది. పురాతన కాలంలో ఆకాశంలో వెళుతున్న ఒక పుష్ప విమానం సరిగ్గా అచ్చర పాకం దగ్గర ఆగి పోయిందట. ఈ వళ్ళువ జాతి వ్యక్తుల సహాయంతో ఆ విమానం తిరిగీ ఎగరగలిగిందట. దేవుడు సంతోషించి కృతజ్ఞతా సూచకంగా నాడి పత్రాలను చదివే జ్ఞానాన్ని ఈ వళ్ళువ జాతి వారికి ప్రసాదించాడట

ఈనాడీ చదివే వ్యక్తులు కొన్నివారాలపాటు దేవుళ్లకు పూజలుచేసి తమ శక్తిని పెంపొందించుకుంటారట. తాళ పత్రగ్రంథములలో రాయబడిన నాడి లెక్కలను ఏకాగ్రత గలిగిన ఆరితేరిన జోస్యులు మాత్రమే చదువగల రంటారు. వాళ్లు నాడి చదువుతున్నప్పుడు త్వరత్వరగా విరామం లేకుండా చదువుతారు. వాళ్లు చదివేటప్పుడు ఆ అక్షర రూపాలలో ఋషులు కళ్లముందర గోచరిస్తారట. నాడి చదువుతున్నప్పుడు శ్రద్ధగా, ఓర్పుగా, త్రికరణ శుద్ధిగా వినాలని అంటారు. మధ్యలో ప్రశ్నలు అడగటంగాని జవాబు చెప్పటంగాని జరగదు. కాని నాడి చదివించుకుంటున్న వ్యక్తి తనలోని సందేహాన్ని మనస్సులో అనుకుంటే దానికి సమాధానం తనంతట తానే నాడి చదువుతున్న ప్పుడు బయల్పడుతుందట. నాడీ పాఠము అన్నివిధాలా పరిపూర్ణమైనదని అంటారు. అది చక్కటి సలహాలు ఇస్తుందనీ, పృచ్ఛకులను ఒకానొక దేవా లయమునకు యాత్రవెళ్లమనో, ఉత్సవంలో పాల్గొనమనో పరిహారం చెల్లించు కోవలసిందనో—నిర్దేశిస్తుందట. గొప్ప గొప్ప వ్యక్తులు సైతం ఈ లెక్కలని నమ్ముతారు. ఈ నాడీ శాస్త్రంలో విదేశపధానం మొదలుకొని సాంకేతిక శాస్త్రందాకా ఇమిడిఉంటాయట.

ఈ నాడీ శాస్త్రమును అగస్త్యర్ నాడి, వసిష్ఠర్ నాడి, హుజంగర్ నాడి, జ్యోతినాడి, కుమారనాడి అని పలురకాలుగా విభజిస్తారు.

నాడీ చదవడంలో మొదట ప్రార్థన ఉంటుంది. తర్వాత అడిగిన వ్యక్తిని

గురించిన విషయాలు వస్తాయి. చివరగా ఆ వ్యక్తి చేయవలసిన పనులను గురించి వస్తుంది.

ప్రదేశాలు, వ్యక్తులు సంకేతభాషలో పేర్కొన బడుతాయి. ఉదాహరణకు అమెరికాను 'అ' కారనాడు అని అనడం జరుగుతుంది. వ్యక్తిపేరు లక్ష్మణన్ అయినప్పుడు నాడీ పఠనంలో రాముని సోదరులలో ముఖ్యుడు అని చెప్పబడుతుంది.

ఒకవ్యక్తి ఒకనాడీ జ్యోతిష్కుని వదిలేసి ఇంకొక జ్యోతిష్కుని దగ్గర కెళితే ఆ రెండో జ్యోతిష్కుడు మొదట జ్యోతిష్కుడు ఎక్కడవరకు చదవాలో కనిపెట్టి తదుపరి భాగాన్ని చదువుతారట. పౌర్ణమి రోజులేదా కొన్ని ముఖ్యమైన పండగ రోజులలో నాడీ చదివించుకుంటే చక్కటి ఫలితం ఉంటుందంటారు నాడీ జోస్యులపట్ల నమ్మకమూ మర్యాదా ఉండాలట.

విశ్వాసంలేని వ్యక్తులకు నాడీ చదివితే సరైన లెక్కలు రావంటారు. అసలు వారికి సంబంధించిన నాడీ పత్రమే దొరకదట.

# 4 వ అధ్యాయము

## ఆచార వ్యవహారములు

### రక్త సంబంధము

తమిళనాడులో రక్తసంబంధము చాలా సన్నిహితమై ఉంటుంది. సాంఘిక వ్యవస్థలో అనేక యూనిట్లు (Units) ఉన్నాయి.

అందులో మొదటిది తల్లిదండ్రులూ, వారి సంతానమూ కలసిన కుటుంబం రెండోది రెండు, మూడు తరాలుగా పుత్ర పౌత్రాదులు కలసి ఉండే ఉమ్మడి కుటుంబము. వీళ్ళ ఆస్తిపాస్తులు ఉమ్మడిగా కలిగి వుంటారు. ఒకే ఇంట్లో నివసిస్తారు. మూడో బంధము పెళ్లిళ్ల వల్ల ఏర్పడుతుంది. పిల్లనిచ్చిన మామ గారి కుటుంబముతో సత్సంబంధాలు కలిగి ఉంటారు. మామగారిపైన గౌర వము చూపించటమే కాక కుటుంబ వ్యవహారాల్లో భార్య పుట్టింటి వ్యక్తులు ప్రాముఖ్యము వహిస్తారు. పెళ్ళయిన ప్రతి స్త్రీ తన పుట్టింటి పట్ల ఎక్కువ మక్కువ కలిగి వున్నా అత్త వారింట్లోనూ ప్రేమతో ప్రవర్తిస్తుంది. తన భర్త పట్ల, పిల్లల పట్ల ఎనలేని ఆప్యాయత చూపిస్తుంది.

ప్రతి కులంలోనూ, వాడుకలో వున్న ప్రత్యేక ఆచార వ్యవహారాలు తమ తమ బంధుత్వాన్ని మరింత సన్నిహితంగా ఉంచుతాయి, పిల్లల పుట్టుక, పెళ్లిళ్ల దహనక్రియ, శ్రాద్ధము మున్నగు కార్యములలో బంధువులందరూ కలుసుకుంటారు. మామూలుగా స్వజాతిలోనే వివాహాలు జరుగుతాయి.

తమిళ ప్రజల ఆచారమును పరిశీలిస్తే - తల్లి తరపు బంధువులతోనూ, భార్యవైపు బంధువులతోనూ, ఎక్కువగా సంబంధము కల్పించుకుంటారు,

ఉమ్మడి వ్యాపారములలో సైతము పాలి వాళ్ళు విడిపోయి తమతమ వియ్యం కులతో పొత్తు కుదుర్చుకుని కొత్త వ్యాపారాలు స్థాపించడం జరుగుతుంది. ముత్యముల సేకరణలాంటి అపాయకరమైన వృత్తి చేపట్టేవారు తన బావ మరిదిని నమ్మినట్టు ఇతరులను నమ్మరు. కొన్ని జాతులలో ముఖ్యమైన సాంఘిక కార్య కలాపములలో మామాగారు (భార్య తండ్రి) ప్రాధాన్యం వహిస్తారు. అలాగే మేనమామ కూడా ఈ తంతుల్లో కొన్ని విధులు నెర వేర్చవలసి ఉంటుంది. కొన్ని సందర్భాలలో మేనమామ తన డబ్బు ఖర్చు పెట్టవలసి వస్తుందికూడాను. అనేక కులాల్లో మేనమామకు తన అక్క కూతురిని పెళ్ళాడే హక్కు ఉన్నది. అతను అనుమతి ఇస్తేనే తప్ప వేరే వరుణ్ని వెతుక్కోవడం వీలుపడదు. కొన్ని కొన్ని జాతుల్లో మేనమామకు ధనరూపంగా కానుకలిచ్చి అతని అంగీకారమును పొందిన తర్వాత తమ పిల్లకు వేరేచోట పెళ్ళి చేస్తారు. కొన్ని సందర్భాల్లో అతనికి తమ రెండో కూతుర్ని ఇస్తామని వాగ్దానం చేస్తారు.

తమ జాతిలోని సంప్రదాయములు సక్రమముగా పాటిస్తేనే ఒక వక్తి మోక్షమును సాధించగలడని నమ్ముతారు.

## పుట్టుక

శిశు జననం, ముఖ్యంగా తొలిబిడ్డ పుట్టుక కుటుంబంలో అతి ప్రాము ఖ్యత వహిస్తుంది. సంతానం లేని మహారాజుల ఇంట్లో ఎంతో సంబరం కలుగుతుంది.

ఎండవేడిమివల్ల ఒళ్ళు ఉష్ణము చెందకుండా ఉండటానికని తమిళులు చాలావరకు వారంలో రెండురోజులు నువ్వుల నూనెతో అభ్యంగ స్నానం చేస్తారు. పురుషులు బుధ శనివారాలలోనూ స్త్రీ మంగళ శుక్రవారములలోను అభ్యంగ స్నానం చేస్తారు. స్త్రీలకీ పురుషులకీ వేరు వేరు రోజులు నిర్దే శించడంలో ఏదో ముఖ్యమైన కారణం ఉందని వీరు నమ్ముతారు. తలంటి

పోసుకున్న రోజున శరీరానికి పూర్తిగా విశ్రాంతి ఇస్తారు. ఈ అభ్యంగన స్నానమును తమిళుల కుటుంబ నియంత్రణా పద్ధతిగా పేర్కొనవచ్చును.

కొందరి వాదన ప్రకారం చెవులకూ కడుపుకూ నూనె రాయకూడదు. కళ్ళకూ పాదములకు మాత్రమే మర్దించాలి. ఒక జానపద గేతం ఈ క్రింది విధంగా సాగుతుంది.

విట్టుకెట్టదు కాదు
విడామల్ కెట్టదు కణ్
తొట్టు కెట్టదు వయిడు
తొడామల్ కెట్టదు కాల్.

అంటే చెవులలో పోస్తే చెవుడు వస్తుందనీ ఆడవాళ్ళు తమ కంటికి కాటుక దిద్దడంవల్ల ముఖంలో కొత్త అందం వస్తుందనీ కళ్ళకు రుద్దకపోతే చూపు మందగిస్తుందనీ అతిగా భుజిస్తే అజీర్తి వస్తుందనీ పాదాలను జాగ్రత్తగా చూసుకోవాలనీ భావము.

గర్భవతి ఒంటరిగా నిద్ర పోకూడదనీ, చీకటి పడిన తర్వాత బయటకి వెళ్ళగూడదనీ, మసాలా ఎక్కువగా వాడకూడదనీ అంటారు. గ్రహణాలు పట్టినప్పుడు ఆమె కాళ్ళు కదపకుండా పడుకోవాలని అంటారు. గర్భిణీ స్త్రీ నదిని దాటడం, పర్వతముపైకి ఎక్కడం మంచిదికాదని అంటారు,

గర్భిణీ స్త్రీకి అయిదో నెలలోనో ఏడో నెలలోనో "వళైకాప్పు (గాజులు తొడుగుట) అనే పేరంటము జరుపుతారు. ఆమె చేతులకి కొత్త గాజులు తొడుగుతారు. ఆమె అత్తగారు లేదా ఆడపడుచు ఆవిణ్ని దేవాలయములోకి పిలుచుకొని పోతారు. తర్వాత గాజుల దుకాణమునకు పిలుచుకొని పోయి ఇష్టమైన గాజుల్ని ఎన్నుకుంటారు. కొన్ని కుటుంబాలలో గాజుల చెట్టిని తమ ఇంటికే రప్పించి గాజులు తొడిగించడం కూడా కద్దు. గాజులు తొడుగుకున్న తర్వాత ఆ చూలాలు పెద్దవాళ్ళకు పాదాభివందనంచేసి ఆశీర్వాదము పొందుతుంది.

ఆరో నెలలో లేదా ఎనిమిదో నెలలో నెలలో సీమంతము జరుపుతారు. హోమము ముగించి భార్యాభర్తలిద్దరూ అగ్ని హోమమును ప్రదక్షిణం చేసి సుఖప్రసవం జరగాలని ప్రార్థిస్తారు. భార్య తన తొలి సంతానం మగ బిడ్డ కావాలని కోరుకుంటుంది. అలా జరిగితే తనకి భర్తనించీ అత్తగారి నించీ ఆదరణ లభిస్తుందని భావము.

సనాతనత్వం పాటించే బ్రాహ్మణుడు తన భార్య చూలాలుగా వున్నప్పుడు గడ్డం గీసుకోడు. గడ్డం గీసుకుంటే తల్లికడుపులోని శిశువుకు హాని కలుగుతుందని భయపడుతారు.

చైత్ర మాసంలో (ఏప్రిల్-మేనెలలు శిశువు జనించడం మంచిది కాదని పది నెలలకు ముందే జాగ్రత్త వహించి ఆడి నెలలోనే (జూలై-ఆగస్టు) నూతన దంపతుల్ని సుమారు నెల రోజులు వేరుచేసి ఉంచుతారు. దీనిని "ఆడిక్కు అళైత్తల్" అడి నెలలో అమ్మాయిని పుట్టినింటికి పిలుచుకుని పోవడం) అని వ్యవహరిస్తారు.

ప్రసవం జరిగాక పసిపాపను తల్లినీ సుమారు పక్షము రోజులు మైల తగలకుండా ప్రత్యేక గదిలో ఉంచుతారు. సాధారణముగా బిడ్డ పుట్టిన ఏడో ఎనిమిదో రోజున బంధువులు పసిపాపకు స్నానం చేయించి వస్త్రాలంకరణ చేసి ఊయెలలోని పూల సెజ్జపై పరుండబెడతారు. మామూలుగా పసిబిడ్డకు తాత పేరుగాని అవ్వ పేరుగాని ఇటీవల మరణించిన దగ్గరబంధువు పేరుగాని ఇలవేల్పు పేరుగానీ పెట్టడం జరుగుతుంది. జిల్లేడు నారతో తయారుచేసిన మొలత్రాడు కడుతారు. ఆ మొలత్రాడులో తెల్లగడ్డ పేరుగాని, కుక్క బొమ్మ వేసిన రాగి నాణెము కానీ పాప బొడ్డుకోసిన దారము చుట్టిన తాయెత్తు గానీ వేలాడదీస్తారు. ఎర్రపూసలూ తెల్లపూసలూ కూర్చిన హారమును పసి పాప మెడలో వేస్తారు

తమిళనాడులోని క్రైస్తవులు బిడ్డ పుట్టిన ఏడు రోజుల తర్వాత ఆదివారము నాడు జ్ఞానస్నానము చేయించుటకై మాదా గుడి (చర్చికి) తీసుకుని పోతారు.

అక్కడ జరిగే తంతులల్లో ఏవరో ఒక స్త్రీ తల్లిగా వ్యవహరిస్తుంది. ఆవిడని జ్ఞానమాత అని పిలుస్తారు. చర్చినుంచి ఇవ్వబడే ధ్రువ పత్రములో జ్ఞానమాత పేరూ, తండ్రిపేరూ, రాయబడి ఉంటాయి. ఏ స్త్రీ అయితే ఎక్కువసార్లు జ్ఞానమాతగా వ్యవహరిస్తుందో, ఆవిడకు సంఘంలో ఉన్నతమైన గౌరవం లభిస్తుంది.

పళని కొండలలోని ముదువలు అనే తెగవారు ప్రసవం జరిగిన మూడు రోజుల పిదప తల్లీబిడ్డలను నదీ జలంలో స్నానం చేయిస్తారు.

పసిబిడ్డకు తలనీలాలు తీసి చెవులు కుట్టడం అతి వైభవంగా జరిపిస్తారు. ఈ వైభవంలో బంధు వర్గమంతా కలుసుకుంటారు. ఈ తంతు జరిగిన తర్వాత పసివాళ్ళ మర్మావయవములు బయటికి కన్పించకుండా చూసుకుంటారు. అందుకని గోచీ కడతారు. ఆడపిల్ల అయితే అరమూడి అనబడే బంగారు లేదా వెండితో చేసిన బిళ్ళను మొలత్రాడులో తగిలిస్తారు.

చదువుకునే వయస్సులో ఆడపిల్ల తన శిరోజాలను జడ అల్లి రిబ్బను ముడిచి అలంకరించుకుంటుంది. యౌవనంలో అడుగు పెట్టిన తరువాత జడబిళ్ళ పెట్టుకుంటుంది. మధ్యవయస్కురాలు జడను కొప్పువేసి గుండ్రముగా కట్టుకుంటుంది. వృద్ధాప్యంలో శిరోజాలను ముడి వేసుకొంటారు.

## ఆడపిల్ల పుష్పవతి అగుట

ఆడపిల్ల పుష్పవతి కావడమన్నది సంఘంలో ఒక ముఖ్యమైన ఘట్టముగా గుర్తింపబడుతోంది. బ్రాహ్మణేతరులు బంధుమిత్రులను ఆహ్వానించి ఈ తంతును బాగా జరుపుకుని పెళ్ళి సంబంధాలకి అవకాశం కల్పిస్తారు. ఆడపిల్ల పుష్పవతి అయిన రోజున చుట్టపు స్త్రీలు కలసి ఆవిడకు స్నానం చేయిస్తారు. ఆ తర్వాత ఆ పిల్లను వారం రోజులు ప్రత్యేక గదిలో ఉంచుతారు. పుష్టికరమైన భోజనము సమకూరుస్తారు, ఆవిడ జడలోని పువ్వు తీసి దానికి కొంత కుంకుమ పువ్వు కలిపి ఒక శుభముహూర్తములో ఇంటిపై కప్పులో

ఒక పెంకు మీద ఉంచుతారు. తొమ్మిదో రోజున ఆ పువ్వుల్ని తీసి వాటిలో కాస్తంత పాలు చిలకరించి తర్వాత వాటిని నేలలో పూడ్చి పెడతారు. ఆనక ఆ కన్యను ప్రత్యేక గదిలోంచి విడిపిస్తారు. ఆమెకి స్నానము చేయించి, పెళ్ళికూతురిలా అలంకరించి, కర్పూర హారతి పట్టి ఇంటిలోకి ఆహ్వానిస్తారు. విందు వినోదములు ముగిశాక ఆ పిల్లకు కానుకలు సమర్పిస్తారు.

పుష్పవతి అయినది మొదలు పెళ్ళి జరిగేదాకా ఆ కన్య నొసట్లో నల్ల తిలకం పెట్టుకుని కళ్ళకుకాటుక దిద్దుకుంటూ ఉంటుంది. ధనవంతుల ఇళ్ళలో అయితే ఆ కన్నె పిల్ల తన వాళ్ళను తప్పించి ఇతరులను చూడటంగాని, ఇతరుల కంటబడటంగాని, జరగదు. ఆమె ముడుచుకోదగిన పువ్వు దినుసు లేమిటో, ధరించవలసిన నగలేమిటో నిర్ణయిస్తారు. ఇప్పుడిప్పుడు ఆడ పిల్లలు కాలేజీలకూ, ఉద్యోగాలకూ, వెళ్ళడంవల్ల ఈ కట్టుబాట్లు సడలింపబడినాయి. ఈ నాటి ఆడపిల్లల్ని చూస్తే వాళ్ళ కట్టూ, బొట్టూ చూసి వాళ్ళు కన్నెపిల్లలా, వివాహితలా కనిపెట్టడం కష్టం. అలాగే వితంతువుల విషయంలోనూ, కట్టుబాట్లు, మార్పుచెందుతున్నాయి, ఈ సనాతన ఆచారములపట్ల, సంస్కారులూ, విద్యావంతులూ, ఏవగింపు చూపుతున్నారు. సాంఘిక ఆంక్షలూ, నిర్బంధములూ, లేని స్వేచ్ఛా జీవితము ఉండాలని అనేకులు కోరుకుంటారు.

## మగపిల్లలు యువకులగుట

చెట్టినాడు ప్రాంతమునకు చెందిన చెట్టియార్ అనబడే జాతి వారు అబ్బాయిలకు కార్తీక ఉత్సవమూ, అమ్మాయిలకు ఆరుద్ర ఉత్సవమూ, జరుపుతారు. వాళ్ళ ఆచారము మేరకు ప్రతి అబ్బాయి, అమ్మాయీ, వివాహమునకు పూర్వము ఈ ఉత్సవము జరిపించుకోవాలి.

అబ్బాయిల కోసరం కార్తీకమాసంలోనూ, (కార్తీక నక్షత్రం) అమ్మాయిల కోసరం, మార్గళి (మార్గశిర) నెలలోనూ, (ఆరుద్ర) ఈ తంతు జరుపుతారు. ఒక అబ్బాయి కాని, అమ్మాయికాని, యౌవనంలో అడుగు

పెడుతూనే వారికి ఆనందము అతిశయములతోబాటు బాధ్యత కూడా పెరుగు తుంది. యూదులు కూడా తమ అబ్బాయిలకు ఇలాంటి తంతు జరిపిస్తారట.

తండ్రి తరపు బంధువులూ, తల్లి వైపు బంధువులూ, ఈ ఉత్సవములో పాల్గొని, అబ్బాయికి శుభాకాంక్షలు తెలియజేస్తారు. అబ్బాయిని చక్కగా ముస్తాబు చేసి అతని మెడలో అంగవస్త్రము కప్పి, తలకు తలపాగా లేదా టోపీ తగిలించి అతనిని గుర్రము పైన కూర్చో బెట్టి గుడిలోకి తీసుకుని వెళతారు. ఆ వూర్లోని అదే జాతికి చెందిన అనేక అబ్బాయిలకు ఒకే రోజున ఈ వేడుక జరిపిస్తారు. గుడిలో పూజా పునస్కారాలు ముగిశాక ఆ అబ్బా యిలు గుర్రములపై ఊరంతా తిరిగి స్వజాతికి చెందిన ఇళ్ళ వద్ద ఆగి పెద్దలు ఇచ్చే హారతి స్వీకరించి ఆశీర్వాదములు పొందుతారు.

కార్తీక ఉత్సవం జరిగిన తర్వాతనే అబ్బాయికి పెళ్ళి ప్రయత్నాలు జరుగు తాయి. ఇది పెళ్ళి సంబంధములను ఆహ్వానించడానికి ఒక చక్కని సంద ర్భము. విషయము తెలుసుకున్న ఆడపిల్లల తండ్రులు సంప్రతింపులు జరుపుతారు.

ఈ వేడుక జరపడంవల్ల బాలుడు యువకుడుగా గుర్తింపబడతాడు. ఆ యువకుడు అకాల మరణం చెందితే అతనికిజరిగే దహనక్రియల్లో ప్రత్యేకత ఉంటుంది. కార్తీక ఉత్సవం జరుపుకోని అబ్బాయిలు పసిపాపలు క్రింద లెక్కింప బడతారు.

ఆడపిల్లలకు జరిగే వేడుకకు తిరునాథిరై (ఆరుద్ర) అంటారు. ఆథిరై అన్నది ఒక గుణవంతురాలైన కన్యపేరు. ఆవిడ పురాణకాలంలో మణిమ్ ఖలై అనే స్త్రీకి పిడికెడు అన్నము పెట్టి ఇకపైన ఈ ప్రపంచంలో ఆకలి అన్నమాటే ఉండ కూడదని కోరుకున్నదట. అలా పురాతన కాలంలో ప్రారంభమైన ఈ వినోదము తిరువాథిరై ఉత్సవము రూపంలో ఇంకా వాడు కలో వున్నది. ఈ ఉత్సవం జరుపుకున్న కన్నెపిల్లలు ఆ గ్రామములోని తమ కులంవాళ్ళ ఇళ్ళలోకి గుంపుగావెళ్ళి ఈ క్రింది పాటను గొబ్బెమ్మ పాటలా పాడుతారు.

ఆడుతున్నాం, కదులుతున్నాం
అన్నం పెట్టండి చిక్కుడుకూరతో
పాడుతున్నాం, నడుస్తున్నాం
వడ్డించండి పొట్లకూర
గుంపులుగుంపుగా వచ్చాము
గోరుచిక్కుడు కూర పెట్టండి.

## విళక్కిడు కల్యాణం (దీపకల్యాణం)

తిరునెల్వేలి జిల్లాలోని వెళ్ళాళర్ అనేజాతి ఉపశాఖ అయిన కర్కార్తార్ అనే తెగలో ఈ ఆచారం వాడుకలో వుంది. ఇది తై నేల (జనవరి మధ్య) ఒకటో తారీఖున 'మాదిరి పెళ్ళి'గా జరుపబడుతుంది. ఈ జాతికి చెందిన ఏడేళ్ళు, తొమ్మిదేళ్ళ వయస్సుగల ఆడపిల్లలకు ఈ తంతు జరుపుతారు. ఈ వేడుకను పురస్కరించుకుని ఆడపిల్ల మెడలో బంగారు గొలుసు లేదా నవ మాల (పది ఎర్రపూసలూ తొమ్మిది బంగారు పూసలూ పొదిగినది) అలంక రిస్తారు. ఈ హారమును పిల్లతాత, అమమ్మ, మేనమామ లేదా మేనత్త - ఎవరో ఒకరు ఆమె మెడలో ధరింపజేస్తారు. ఈశుభ కార్యములో బ్రాహ్మణ పురోహితుడు పాల్గొంటాడు. ఆ పిల్లకు కుత్తు విళక్కు (ఇత్తడి దీప సెమ్మె) బహూకరిస్తారు. దానిని ఆపిల్ల వెలిగిస్తుంది. ఆమె మెడలో కట్టిన హారము "అసలు పెళ్ళి" జరిగే వరకూ అలాగే ఉంచుతారు. పెళ్ళి అయినాక ఈ నవమాల జ్ఞాపకచిహ్నంగా అందులోని ఒక పూసను తాళిబొట్టు ప్రక్కన గ్రుచ్చి ధరిస్తారు.

## పెళ్ళి

మామూలుగా పెళ్ళిళ్లు స్వజాతుల మధ్యనే జరుగుతాయి. స్వజాతిలో సైతము యువతీయువకులకు పూర్తి స్వేచ్ఛ వుండదు. స్వాతంత్ర్యానంతరం

పాంఘికంగా కొన్ని మార్పులు వచ్చాయి. కొన్ని కులాంతర మతాంతర వివాహాలు జరిగాయి. దంపతులు తమ తమ మతమును అవలంబిస్తూ తమ పిల్లలకు మాత్రం రెండిట్లో ఒక దానిని ఎన్నుకొనే స్వేచ్ఛ ఇచ్చారు. ఇటీవలి కాలంవరకూ కులాంతర వివాహాలపట్ల ప్రజలకి ఏహ్యాభావం ఉంటూవచ్చింది. కులం వదిలి పెళ్ళి చేసుకున్న యువతీ యువకులు అనుభవించే యాతనలను గురించి అనేక కథలు ప్రచారములో వున్నాయి. ముత్తుపట్టన్ అనే కథ జాతి యువకుడు ఉన్నతజాతి అమ్మాయిని ప్రేమించడంవల్ల ఆ జాతి వ్యక్తుల ఆగ్రహానికి గురి కావలసి వచ్చిందట. పై జాతి మగవారు క్రింద జాతి యువతులను ఉంపుడు కత్తెలుగా ఉంచుకునే ఆచారము ఉండేది. ఆ పుంపుడు గత్తెకు పుట్టే సంతానానికి తన తండ్రి సొత్తుపైన హక్కు ఉండదు.

పెళ్ళిళ్ళు స్వర్గంలో నిశ్చయింపబడతాయని నమ్ముతారు. అమ్మాయికీ అబ్బాయికీ జాతకాలు కలిస్తేనే ఆ పెళ్ళి నిశ్చయిస్తారు. అన్ని తతంగాలు అయ్యాక కట్నం కానుకల విషయంలో ఒడంబడిక కుదిరితే నిశ్చయతాంబూలానికి, పెళ్ళికి తేదీలు నిర్ణయిస్తారు. ఇరువైపులా వున్న శ్రేయోభిలాషులూ, పెళ్ళి దళారీలూ చొరవతీసుకుని పెళ్ళి సంబంధం కుదిరేందుకు సహకరిస్తారు. "వేయి అబద్ధాలు చెప్పి అయినా ఒక పెళ్ళి జరిపించాలి" అనే ఒక లోకోక్తి ఉంది.

తమిళనాడులో మేనరికాలు ఎక్కువగా ఆచారములో వున్నాయి. కొన్ని జాతులలో మేన మామకు తన అక్కకూతుర్ని పెళ్ళి చేసుకునే వాడుకఉన్నది. మరికొన్ని జాతుల్లో ఈ పద్ధతి పూర్తిగా నిషిద్ధము. ఒకే గోత్రములో పెళ్ళిళ్లు జరగవు. మరవర్, యాదవర్ మరియు నాడార్ లాటి జాతులలో పెక్కు శాఖలున్నాయి. ఈ శాఖలు స్త్రీల పరంగా వస్తుంది.

పైన పేర్కొన్న జాతుల్లో ఒకే శాఖలో పెళ్ళి జరగదు. మేనత్త కూతుర్ని. మేనమామ కూతుర్ని పెళ్ళాడమన్నది ఆచారములో వున్నది, అలాగే ప్రతి జాతిలోనూ, పెళ్ళి సంప్రదింపులు ఏ తరఫున మొదలెట్టాలో నియమ నిబంధనలు ఉన్నాయి.

పెళ్లిళ్లకు తైనెల (పంటలు కోతకు వచ్చే సమయము) చాలాముఖ్యమైనది. నది. "తై పిరందుల్ వళిపిరక్కు" (తైనెల పుడితే పరిష్కారం దొరుకుతుంది) అదే సామెతను పెళ్ళిడు కొచ్చిన బ్రహ్మచారులు చెప్పుకుంటూ ఉంటారు.

సామాన్యంగా పెళ్ళి వధువు గృహములో జరుగుతుంది. కానీ, ముక్కులత్తార్, నాడార్, చక్కిలియాన్, మున్నగు జాతులలో పెళ్ళి వరుని గృహములో జరుగుతున్నది. ఈ జాతులు కూడా ఇప్పుడు తమ ఆచారాన్ని మార్చుకుంటున్నాయి.

పెళ్ళికొడుకు తరఫువారు పసుపూ, కొబ్బరికాయలు, అరటిపళ్ళు, తమలపాకులు పువ్వులు పళ్ళూ, పెళ్ళిచీర, తాళిబొట్టు, పసుపుతాడు, తీసుకుని వధువు ఇంటికి చేరుకుంటారు. పెళ్ళి పందిరి నిర్మింపబడుతుంది. (చెట్టినాడులో ఉత్తర క్రియల కోసరం కట్టిన దానిని 'పందల్' అనీ పెళ్ళికి నిర్మించే దానిని 'కొట్టగై' అనీ వ్యవహరిస్తారు.) పెళ్ళి పందిరి కొబ్బరి కీతులతో నిర్మింపబడుతుంది. పందిరిలో ఒకచోట పెళ్ళిపీట ఏర్పాటు చేస్తారు. మంగళ సూత్రధారణ అయ్యేదాకా పెళ్ళికూతురు పెళ్ళికొడుకు కుడి ప్రక్కన కూర్చుంటుంది తాళి కట్టిన తర్వాత ఆమె ఎడమ వైపుకు మారి కూర్చుంటుంది, ఇద్దరూ తూర్పు దిక్కుగా తిరిగి ఉంటారు. కొబ్బరి కాయలు కొట్టి ప్రార్థనలు జరిపిస్తారు. ముహూర్తమునకు ముందు తాళిబొట్టును ఒక పళ్ళెములో ఉంచి పందిట్లోని అందరి చెంతకూ తీసికెళతారు. వాళ్ళ ఆశీర్వచనము పొంది, తాళిబొట్టు పెళ్ళిపీట దగ్గరకి తిరిగి వస్తుంది. తాళి కట్టేటప్పుడు పెళ్ళికుమారునికి అతని సోదరి సహాయపడుతుంది. తాళి కట్టినప్పుడు మూడు ముళ్ళు వేస్తారు. ఈ సమయంలో శంఖము పూరించి ఉచ్ఛస్థాయిలో మంగళ వాద్యము ప్రమోగిస్తారు.

దేవర్ మరియు ఉగముడియర్ అనే జాతుల్లో "కులవై ఇడల్" అనే ఒక విచిత్రమైన ఆచారము అమలులో ఉన్నది. ముహూర్త సమయంలో స్త్రీలు గుమిగూడి కీచుగొంతుతో శబ్దం చేస్తారు. ధీనినే కులవై అంటారు.

అలా చేయడం వల్ల మంగళ సూత్రధారణ జరుగుతున్నప్పుడు ఎవరైనా ఏడ్చినా, తుమ్మినా, తెలియదట.

వధూవరులపైన పువ్వులూ, అక్షింతలూ, చల్లుతారు. వధూవరులు మాలలు మార్చుకుంటారు. వరుడు వధువు యొక్క కుడిచేతిని పుచ్చుకుని పెళ్ళి మంటపమును మూడుసార్లు చుట్టివస్తారు. ఆనక వధూవరులు తమ తల్లిదండ్రులకు సాష్టాంగ నమస్కారం చేసి వాళ్ళ శుభాకాంక్షలు పొందుతారు. ఇతర పెద్దలకు కూడా నమస్కరించి ఆశీర్వాదం పొందుతారు. అక్కడ గుమిగూడిన జనులంతా వధూవరులను సత్సంతానమును పొంది దీర్ఘాయువుగా వర్ధిల్లమని దీవిస్తారు.

అనేక కులాలవారు పెళ్ళిళ్ళలో బ్రాహ్మణ పురోహితులను నియమిస్తారు. నాడార్ జాతివారు, కొంగు వెళ్ళాళ జాతివారు తమ కులపెద్దను పురోహితుడుగా నియమిస్తారు. ఆత్మ గౌరవము (సుయ మరియాదై) అనే పేరుతో లేచిన ఉద్యమం కొద్దిగా బలపడి పెళ్ళిళ్ళలో బ్రాహ్మణులను బహిష్కరించడం కూడా జరుగుతున్నది. ఆ పెళ్ళిళ్ళని సంస్కరణ వివాహాలు అంటారు. అందులో రాజకీయవేత్తలూ, పండితులూ ముందు నిలిచి పెళ్ళి జరిపిస్తారు. ఇలాటి పెళ్ళిళ్ళకు 1968 లో చట్టబద్ధమైన రక్షణ కల్పింపబడినది.

## వింత ఆచారములు

పెళ్ళిళ్ళలో జరిగే కొన్ని వింత ఆచారములను ఇక్కడ పేర్కొనవలసి వుంది. పెళ్ళి భోజనములో పప్పు తప్పని సరిగా ఉండాలి. "పరుప్పిల్లాద కల్యాణమిల్లై" (పప్పులేని పెళ్ళి జరగదు) అనే లోకోక్తి ఇందుకు నిదర్శనం. ఒక ప్రత్యేకమైన భక్షణం (పాయసం లాంటిది) భోజనం ముగిసిందనటానికి సంకేతంగా ఉంటుంది. ఒక్కొక్క జాతిలో భోజనం పద్ధతులు ఒక్కొక్కరకంగా ఉంటాయి.

కొన్ని జాతులలో పెళ్ళి జరిగిన తర్వాత వావి వరుసలు గల బావామరదళ్ళు ఒకరిపై ఒకరు పసుపునీరు చల్లుకోవడం ఆచారము. పెళ్ళిలో ఏదో చిన్న తగాదా వచ్చి అందరూ గట్టిగా మాట్లాడుకోవడం వల్ల గొంతు రాచుకుపోతే ఈ పసుపునీరు మందులా పనిచేసేదట. కాలక్రమేణ అది ఆచారమైనది.

కొన్ని జాతులలో నలుగు పెట్టడం ఆనవాయితీగా పెళ్ళికూతురు సందర్భోచితంగా గానం చేస్తూ పెళ్ళికొడుకును ఆహ్వానిస్తుంది. తరువాత ఆవిడ వరుని పాదాలకు పసుపూ, కుంకుమా పూస్తుంది. పెళ్ళి కొడుకూ, వధువు పాదాలకు అలాగే పూస్తాడు. తరువాత పెళ్ళి పడుచు వరుని శరీరానికి గంధం పూస్తుంది. అతను ఆమెపై పువ్వులు రువ్వుతాడు. ఆమె అతనికి అద్దం చూపుతుంది. ఇద్దరూ కాస్సేపు పూల బంతులతో ఆడుకుంటారు. ఇద్దరూ కలిసి కొన్ని తీపి వస్తువులు తింటారు. ఈ కార్యక్రమములో ప్రతి ఘట్టములోనూ తగినట్లుగా పాటలు పాడటం జరుగుతుంది.

బ్రాహ్మణేతర జాతులలోని వైష్ణవులు అడవిలోకివెళ్ళి అడవి దేవుడికి పూజ చేసి రావడమన్నది పెళ్ళితంతులలో ఒకవిధిగా పాటిస్తారు. పులిని చంపిన వాడే పెళ్ళికి అర్హుడుఅనే సామెతకూడాఉంది. పెళ్ళికూతురుని మేనమామ ఎత్తుకుని పోయిన తర్వాత పెళ్ళి కొడుకు కోసరం వదలి పెట్టడం ఒక ఆచారము.

ఇలాగే తూత్తుకుడి ప్రాంతములోని క్రైస్తవ బెస్త వాళ్ళలో వాసల్‌పడి మఱిత్తల్ (గుమ్మంలో అడ్డు పడటం) అనే ఆచారము పాటిస్తారు. వధువు తన బావకు డబ్బు లేదా నగలు కానుకగా సమర్పించి అతని అనుమతి తీసుకున్న తర్వాత గానీ శోభనం గదిలోకి ప్రవేశించదు.

కొన్ని జాతులలో ఈ క్రింది విధంగా పాటలు పాడి వియ్యాల వారు ఒకర్నొకరు పెళ్ళికి ఆహ్వానిస్తారు.

పరుప్పుం, అన్నముం, పాయసముం,
పలవగై కరిగళుం వందరుళ
వేణుమట్టుం విధవిధమాగవే

తేంగాయ్ పచ్చడి కిచ్చడి తాంగె
పరంగికాయ్ కూట్టుదన్ పలపలకరిగళ్
మాంగాయ్ ఊరుగాయ్, మణమిగుసాంబార్
రసముం, దివ్య భక్షణంగళుడనే—

అంటే—

పప్పూ, కూడూ, పాయసమూ,
పలురకాల కూరలూ, వండాము. రండి
సుష్టుగా భోం చేయండి.
కొబ్బరి పచ్చడి, కిచ్చడి తిండి
గుమ్మడి కాయకూటుతో ఎన్నో పదార్థములు
ఆవకాయ, ఊరగాయ, చవులూరించే సాంబారు
రసమూ, దివ్య భక్షణాలు ఆరగించండి"

అని తాత్పర్యము.

## కొండ జాతి వివాహము

**పళియర్ తెగ :—** పళియర్ తెగలలో పెళ్ళిళ్లు నిరాడంబరంగా జరుగుతాయి. వియ్యాలవారు పెద్దల ఎదుట పెళ్ళికి సమ్మతం తెలియ జేయంగానే గొప్ప విందు భోజనం పెడతారు. తరువాత వివాహం జరిపిస్తారు. వీళ్ళ పెళ్ళికిగల నిబంధన ఏమిటంటే కాబోయే పెళ్ళికొడుకు అడవికి వెళ్ళి కొన్ని దుంపలూ, గెడ్డ దినుసులూ, త్రవ్వకుని ఏదైనా జంతువును వేటాడి తీసుకు రావాలి. కాబోయే పెళ్ళి కూతురు పెద్దలకు చక్కగా వండి పెట్టాలి.

**తోడాలు :—** తోడా జాతి వాళ్ళు ఏ రోజైనా సరే (అమావాస్య రోజు కూడా) పెళ్ళి జరిపిస్తారు. వీళ్ళు ఒక స్థావరమునుంచి ఇంకో స్థావరములోని వ్యక్తుల్ని ఒక విధమైన కేకలద్వారా ఆహ్వానిస్తారు. ఆలా దాదాపు రెండు వందల స్థావరాలు ఒకరికొకరు కబురు అందించుకుని ఈ తెగ ప్రజలందరూ ప్రతి పెళ్ళిలోనూ కలుసుకుంటారు.

పెళ్ళికి ముందు రోజున తోటలోనో ఆరుబయటనో పూజలు జరుపుతారు. పెళ్ళి కూడ చెట్ల కిందనే జరుగుతుంది. ఆ రాత్రికి ఆ స్థలం శుభ్రం చెయ్య బడుతుంది. పెళ్ళికొడుకుకూ, పెళ్ళి కూతురికీ సంకేతంగా రెండు కొయ్యలు నాటి వాటిని నల్లగుడ్డలతో అలంకరించి దైవప్రార్థన చేస్తారు. పెళ్ళికూతురు కొత్త కుండలో వండిన అన్నమును విస్తళ్ళలో పెట్టి ఈ కొయ్యల ముందు ఉంచుతారు. పెళ్ళి కూతురు చేతిని నాలుగు చోట్లలో కొద్దిగా కాలుస్తారు. పెళ్ళి కూతురి తరపున ఒక పసిపిల్లవాడు కుండలో నీళ్ళు తెచ్చి ఆ కొయ్యలపైనా తమ జాతి సౌభాగ్యానికి చిహ్నమైన గేదెపైన కుమ్మరిస్తారు. తరువాత మిగి లిన నీళ్ళను పెళ్ళికూతురు, పెళ్ళి కొడుకు తలపైన పోస్తుంది. తదనంతరం విందుచేస్తారు.

మరుసటి రోజున తోడాలు తమ సాంప్రదాయక దుస్తులతో మళ్ళీ గుమి గూడుతారు. స్త్రీ పెద్దలనుంచి దీవెనలు పొందుతారు. ఆ తరువాత అందరూ మద్యము సేవించి కొండ శిఖరములో చెట్లకింద ఏర్పాటయిన పెళ్ళి జరిగే చోటికి చేరుకుంటారు. నేతి దీపం ముట్టించి ఒక చెట్టుకు వేలాడదీస్తారు.

వధూవరులు పెద్దలకు మొక్కుతారు. పెళ్ళి కొడుకు తండ్రి అనుమతి పొందాక తాళిబొట్టు పెళ్ళి కొడుకు చేతికి ఇవ్వబడుతుంది. అక్కడ చేరిన గుంపంతా బృందగానం చేస్తూతాళిబొట్టు కట్టిస్తారు. తదుపరి ఫలహారం తీసు కుని అందరూ శలవు తీసుకుంటారు. అంతటితో వివాహం ముగిస్తుంది.

పెళ్ళి పనులలో పెళ్ళి కొడుకూ, పెళ్ళి కూతురూ పాలు పంచుకుంటారు. పెళ్ళి రోజున సైతము వారు ఏలాటి సంకోచము లేకుండా ఒళ్ళు వంచి పని చేస్తారు.

కున్నువర్ తెగ :- కున్నువర్ తెగవారు పెళ్ళికి ఎంత ప్రాముఖ్యత ఇస్తారో తాంబూలానికి కూడా అంతే ప్రాముఖ్యత ఇస్తారు. పెళ్ళి సుఖ ప్రదంగా ముగియాలని ప్రార్థనలు చేస్తారు. దేవుడికి పువ్వులూ, గంధమూ, సమర్పించి ఈ క్రింది పాటను గానం చేస్తారు.

కోర్త్తేన్ మాలయుం
కుశ్తైల్ప్పేన్ చందనముం
ఆరుక్కు ఉగందదు?
కల్లు వినాయగం అవరుక్కె ఉగందదు
తల్లోలం........

(కట్టాను పూమాల
కలిపాను గంధమూ
ఎవరికి నివేదన?
రాతి వినాయకుడికే నివేదన
లాలి............ )

## విడాకులూ - పునర్వివాహాలు

ముక్కులత్తార్ జాతిలో విడాకులు ఇచ్చుకోవడం సర్వసాధారణ విషయము. ఏ దంపతులైనా తాము వద్దనుకున్నప్పుడు తమ వివాహబంధమును ముగించుకొనవచ్చును.

భార్యాభర్తల మధ్య తగాదా వస్తే తమకుల పెద్దలైన పంచాయతీదార్ల దగ్గరికి పరిష్కారం కోసరం వెళతారు. వాళ్ళు ఉభయ పక్షముల నుంచి ఫిర్యాదులను విని తమ తీర్పును ప్రకటిస్తారు. వారి తీర్పులో న్యాయం కంటె మానవత్వానికి ఎక్కువ ప్రాముఖ్యత ఉంటుంది. సాధ్యమైనంత వరకు ఆ కులపెద్దలు తీర్పు చెప్పేముందు కాస్త వ్యవధి తీసుకుంటారు. ఆలోగా భార్యాభర్తల మధ్య సామరస్యం కుదరటానికి ఏదయినా వీలు ఉంటుందేమోనని అలా చేస్తారు. అప్పటికీ భార్యాభర్తలు విడిపోవాలని పట్టుబట్టితే పంచాయతీదార్లు తమ తీర్పును తాము ప్రకటిస్తారు.

ఈ విడాకులు ఇచ్చే పద్ధతి అతి విచిత్రంగా జరుగుతుంది. భర్త తరపు వాళ్ళు తమ ఇంటి చూరులోంచి కొంచెం గడ్డి తీసి పెళ్ళి కూతురి తరపు

వాళ్ళకి తాంబూలంలో పెట్టి ఇస్తారు. తమ ఇంటి చూరు చీలి పోయినట్లే ఆ జంటకూడా చీలిపోయిందని దాని భావము. పిల్లల విషయంలో తండ్రిదే పూర్తి బాధ్యత.

భర్త విడాకులు కోరుకుంటే పెద్దల తీర్పుమేరకు అతను ధనరూపంలో తన భార్యకు భృతి చెల్లించుకుంటాడు. భార్య విడాకులు కోరుకుంటే భర్తకు కన్యాశుల్కమును త్రిప్పి ఇచ్చి వేయటమేకాక తన చేతుల్లోని గాజులను తీసి తన భర్త యింటి గుమ్మం దగ్గర వదిలి పెట్టి శలవు పుచ్చుకుంటుంది. తరువాత వాళ్ళు తమ తమ ఇష్టానుసారం నచ్చిన వారిని పెళ్ళి చేసుకోవచ్చును విడాకులు పుచ్చుకున్న తర్వాత వారు ఒకరిపట్ల ఒకరు ఎలాటి విరోధ భావమునూ ప్రకటించుకోరు. తన మునుపటి పెళ్లాము ప్రక్క ఇంట్లో కాపురము చేస్తున్నా మొదటి భర్త పట్టించుకోడు. నిమ్నజాతులలోని ఒక విచిత్రమైన ఆచారమేమిటంటే ఒక ఇల్లాలు వక్రమార్గము పట్టి అక్రమ గర్భము దాల్చినా ఆమెను వెలివేయడం జరగదు (ఉన్నత జాతులని చెప్పబడే వారి ఇళ్ళల్లో ఏది జరిగినా గుప్తంగా జరుగుతుంది.)

బాగా భూవసతులు కలిగిన రైతులు వ్యవసాయంలో బాగా పనికివస్తారని చిన్న వయస్సు ఆడపిల్లల్ని పెళ్ళాడడం కోసరం తమ భార్యలను వదిలేస్తూ ఉంటారు. బహు భార్యాత్వము చట్టములో నిషేధింపబడి ఉన్నా వీళ్ళపైన దాని ప్రభావము అంతగా ఉండదు. ముక్కులత్తార్ జాతిలోనూ ఇంకాకొన్ని జాతులలోనూ బాల్యవితంతువులకు పునర్వివాహములు జరుగుతాయి.

## మరణము

అంత్యక్రియలు ముగ్గు సమయములలో బంధువులందరూ తప్పక కలుసుకుంటారు. ఒక ఇల్లాలు భర్తను పోగొట్టుకున్నప్పుడు ఆమెకు కావలసిన తెల్ల దుస్తులను పుట్టి నింటి నించి ఇస్తారు. దహనక్రియలకు అయ్యే ఖర్చులో కొంత పైకమును కూడా పుట్టింటి వాళ్ళు భరిస్తారు.

నామకరణోత్సవములోనూ పెళ్ళి సందర్భములలోనూ మేనమామ ఆ పసిపాపకు లేదా వధువుకు కొన్ని బంగారు నగలు బహూకరించవలసి ఉంటుంది. లేదా డబ్బులయినా చదివించాలి. అతను తోడు పెళ్ళి కొడుకుగా వ్యవహరించి తన సోదరి బిడ్డల (వధువు లేక వరుడు) పెళ్ళిళ్ళకో పాలు పంచుకుంటాడు. శుభ కార్యమైనా, అశుభకార్యమైనా బంధువర్గాలను సమకూర్చి తీసుకుని వచ్చే బాధ్యత అతనిపైన ఉంటుంది.

ఒకరు మరణిస్తే తమిళుల ఆచారం ప్రకారము ఆవ్యక్తి "శివలోక పదవి" (శివుని సాన్నిధ్యము) "పరమ పదము" (విష్ణు సాన్నిధ్యము) లేదా "పళ్ళి పడై ఎయ్‌దినాన్" (పైలోకం చేరాడు) అని అంటారు.

డిశంబరు—జనవరి నెలల్లో వచ్చే మార్గశిరు వాధిరై (మార్గశిరము-ఆరుద్ర) రోజున మరణించినా ఏకాదశినాడు మరణించినా ఆవ్యక్తి అదృష్టవంతుడని అంటారు. పండుగలనాడు మరణం సంభవిస్తే ఆవ్యక్తిని దురదృష్టవంతు డంటారు.

ఎవరైనా శనివారం మరణిస్తే అదే ఇంట్లో ఇంకొక చావు సంభవిస్తుందని అంటారు. "శనిప్పిణం తనియో పోగాదు" (శనిరోజు వెళ్ళే పీనుగు ఇంకో పీనుగను తీసుకెడుతుంది) అనే లోకోక్తి వాడుకలో వున్నది. శనివారం మరణం సంభవిస్తే ఆకీడును తొలగించడానికి ఇంట్లో ఒక భాగాన్ని పడగొట్ట డమో, లేదా ఆ పీనుగను తీసికెళ్ళడానికి వేరే ద్వారము నిర్మించడమో జరుగుతుంది. ఒక్కొక్కప్పుడు పాడెకు కోడిపుంజును కట్టి పీనుగతో బాటు ఆ కోడిపుంజును పూడ్చి పెట్టడమో దహనం చెయ్యడమో జరుగుతుంది.

ఒక పురుషుడు మరణిస్తే ఎక్కువగా దుఃఖించేది అతని భార్య, తన గాజుల్ని పగులగొట్టుకుని జుట్టువిరబోసుకుని ఘోరున ఏడుస్తుంది. సంపన్న జాతి గృహములలో 12నుంచి 16 రోజులవరకు సంతాప దినములు ప్రకటిస్తారు. శ్రామిక్ జాతుల వారు తక్కువ రోజులు పాటిస్తారు. ఈ పాత ఆచారములన్నీ గ్రామీణ ప్రాంతములలోని సంపన్న కుటుంబాలలో మాత్రమే ఖచ్చితముగా

పాటింప బడుతాయి. కాలం కోసరం పోటీపడే నగర ప్రాంతాల ప్రజలు వారం రోజులు ఇంకా తక్కువ రోజులు సంతాపదినాలుగా పాటిస్తారు.

ఆ కుటుంబానికి కావలసిన ముఖ్యస్నేహితులు, స్వజాతి వ్యక్తులు, వెళ్ళి తమ సంతాపాన్ని తెలియ జేస్తారు. చావుకు విడిగా హాజరవుతారు. చావు జరిగిన ఇంటికి వెళ్ళి సంతాపము ప్రకటించకపోతే అదినేరము క్రింద పరిగణింపబడుతుంది. ఎవరైనా ఆలస్యముగా వచ్చి సంతాపము వెలిబుచ్చితే శోకనాదము పెట్టే స్త్రీలు వాళ్ళను ఎత్తి పొడుస్తూ తమ విలాపమును కొనసాగిస్తారు.

సంతాపదినములలో చావు జరిగిన ఇంటికి వచ్చే ప్రతివ్యక్తీ మైలపడతారని అంటారు. ఆ వ్యక్తి తన ఇంట్లోకి ప్రవేశించేముందు స్నానంచేసి మైల తొలగించుకోవాలి. తర్వాతనే అతను మంచినీళ్ళయినా ముట్టుకోవాలి.

బంధుమిత్రులంతా వచ్చి చూశాక కళేబరాన్ని కడిగి సువాసన ద్రవ్యములు చల్లి కొత్త గుడ్డతో కప్పుతారు. వితంతువును శవం దగ్గరికి తీసుకొచ్చి ఆమెకి తెల్ల చీర ధరింపజేస్తారు. బంధువు లందరూ మూడుసార్లు శవం చుట్టి వచ్చిన తర్వాత పీనుగను తీసి పాడెలో పెడతారు. ఆచారము ప్రకారము అతి దగ్గర బంధువులు మాత్రమే ఆ పాడెను మోస్తారు. స్త్రీలు స్మశానంలోకి వెళ్ళగూడదు. "వీడువరై మనైవి వీధి వరై ఉరవు, కాడువరై పిళ్ళై" అనే సామెత ఉన్నది. (భర్త మరణిస్తే భార్య బంధము ఇంటిలోనే తీరి పోతుందనీ, బంధు వర్గాలు వీధిదాకా వస్తారనీ కన్నకొడుకు కాటిదాకా వస్తాడనీ అర్థము)

శవం సాగిపోతున్నంతవరకూ దారి పొడువునా చావు మేళం వాయింప బడుతుంది. రోడ్ల కూడలి దగ్గర పాడెమోసేవాళ్ళు మూడుసార్లు తిరుగుతారు. అలా చెయ్యడం వల్ల దుష్టశక్తులకు దిక్కుతెలియదనీ గ్రామం వాటి బారి నుంచి తప్పించుకుంటుందనీ నమ్ముతారు. దేవాలయము సమీపించినప్పుడు చావు మేళము ఆపుచేస్తారు. చచ్చిన వ్యక్తి ఇల్లు గనక గుడి సమీపములో ఉంటే శవం ఎత్తేవరకూ గుడిలో పూజలు ఆపు చేస్తారు.

శవాన్ని దహనం చెయ్యవలసిఉంటే చెరువు గట్టునగానీ నదీ తీరమునగానీ చితిపేర్చి అందుతో దహనం చేస్తారు. ఆభస్మము తీసుకొనివెళ్లి రెండో రోజున నదిలోనో చెరువులోనో కలుపుతారు. శవాన్ని పూడ్చిపెట్ట వలసి ఉన్నట్లయితే గ్రామానికి దూరముగావున్న స్మశానములోకి తీసుకెళ్లి పాతి పెడతారు. పెళ్లి కానివ్యక్తి మరణిస్తే అతని పాడెకు చెట్టు మొలకలను కట్టి తీసుకెడతారు శిశువులు మరణిస్తే వాళ్ళను పసుపు గుడ్డతో కట్టిన ఊయెలలో తీసుకెడతారు. శిశువులూ పసిపిల్లలూ మరణిస్తే పాతిపెడతారు. యుక్త వయస్సు దాటిన వారు మరణిస్తే దహనం చేస్తారు.

మరణించిన వ్యక్తి నోట్లో బంధు మిత్రులందరూ ఆఖరిముద్ద అన్నము పెట్టిన తర్వాత కొరివి పెట్టబడుతుంది. శవముపైన పిడకలూ, ఎండుకట్టెలూ పేర్చిన తర్వాత జ్యేష్ఠ పుత్రుడు శిరోముండనము చేసుకుని చితికి నిప్పు పెడతాడు. అతనొక నీటి కుండను భుజంమీద మోసుకుని చితిచుట్టూ మూడు సార్లు తిరిగి వచ్చి తలపైపున ఆ కుండను పగులగొడతాడు. తరువాత అందరూ నదిలో పవిత్రస్నానము చేసి చావు జరిగిన ఇంటికి వస్తారు.

సంతాప దినములలో కొందరు స్త్రీలు సోకనాదముల ద్వారా తమ సంతాపాన్ని వెలి బుచ్చుతారు. కొన్ని జాతులలో భర్తను కోల్పోయిన స్త్రీ తనని ఓదార్చటానికి బంధులు వచ్చినపుడల్లా శోకనార్తము పెడుతూ ఉంటుంది. ఆ శోకగీతములో తన భర్త గుణగణాలను శ్లాఘించడం జరుగుతుంది.

ఒక గర్భిణీ స్త్రీ మరణిస్తే ఆవిడ జ్ఞాపకచిహ్నంగా రహదారి ప్రక్కన "సుమైతాంగి"(మోపుబండ) అనే బండను స్థాపిస్తారు. ఆమె కడుపులోని బిడ్డను ఆబండ మోస్తుందని నమ్మకము. వాస్తవానికి ఆ బండ బాటసారులు విశ్రాంతి తీసుకోవడానికీ, బరువు దించుకోవానికీ పనికొస్తుంది. క్రింద చెరోవైపున రెండు రాతి చెక్కలు నాటి వాటిపైన ఒక పెద్దరాతి చెక్కను బల్ల చెక్కలా పరుస్తారు. అంటే బెంచీలాగా ఉంటుంది.

ప్రమాదము వల్లనో ఆత్మహత్య వల్లనో మరణం సంభవిస్తే ఆ ఇంటికి కీడు కలుగుతుందని నమ్ముతారు. అలా మరణించిన వ్యక్తి ప్రేతము ఇంటి గోడల చుట్టూ, చెట్లపైనా లేదా మరణం సంభవించిన పరిసరములలో సంచరిస్తూ ఉంటుందంటారు.

బ్రాహ్మణులు ముస్లిములు దహనక్రియలు చాలా నిరాడంబరముగా జరుపుతారు. వారు జరిపే కర్మ కాండములలో మేళతాళాలు లేకుండా మౌనంగా జరిపిస్తారు. గ్రామ ప్రాంతములలో మామూలుగా ఒక్కొక్క జాతికీ మతం వారికి వేర్వేరుగా స్మశానములు ఉంటాయి.

చావు సంభవించిన ఇల్లు మైలపడినదని అంటారు. ఆ ఇంట్లో కొద్ది రోజుల వరకూ వంటా వార్పూ చెయ్యడం జరగదు. ఇరుగు పొరుగు వారు ఆ ఇంట్లోని వ్యక్తులకు భోజనం సమకూరుస్తారు. శవాన్ని ఎత్తిన రోజున పెద్ద కర్మ జరిగే రోజునా ఇంటిని పరిసరములను పరిశుభ్రము చేసి ఇరవై నాలుగు గంటలూ దీపం వెలిగించి ఉంచుతారు. చచ్చిపోయిన వ్యక్తి ఆత్మకు శాంతి చేకూర్చడం కోసరం ఒక పాత్రలో నీళ్ళు ఉంచుతారు. అలాగే పెద్ద కర్మ రోజున బీదలకు అన్నదానము చేస్తారు.

తమిళులలో కొన్ని తెగలు పునర్జన్మ పట్ల విశ్వాసం కలిగిఉన్నారు. ఆత్మ ఒక కాయము విడిచి, మరొక కాయమును పొందుతుందని నమ్ముతారు. పాపాత్ముడు మరోజన్మలో ఏ పక్షిగానో, జంతువుగానో పుడతాడనీ, పుణ్యము సంపాయించిన మనిషి స్వర్గం పొందుతాడనీ, అందాకా మళ్ళీ మళ్ళీ జన్మిస్తూనే ఉంటాడనీ అంటారు. ఈ భూప్రపంచంలో చేసిన పాపాలకు ప్రాయశ్చిత్తంగా నరకంలో యమధర్మరాజు వివిధములైన శిక్షలు విధిస్తాడని కవులు చెబుతుంటారు.

## తద్దినము

బ్రాహ్మణేతరజాతులలో మరణించిన పదహారో రోజుదాకా ప్రతివారమూ

కిళమై అనబడే కర్మ జరుపుతారు. వారంలో ఏ రోజు మరణం సంభవించినదో అదే రోజున కిళమై జరుగుతుంది. ఆ రోజున మరణించిన వ్యక్తి దుస్తుల్ని పూజించి అతనికి ప్రియమైన ఆహార పదార్థములను నివేదిస్తారు. ప్రతి సంవత్సరమూ జరిగే తద్దినము రోజున బంధువులందరూ కలుసుకుంటారు. బ్రాహ్మణులకు కానుకలు ఇవ్వటమేకాక సజ్జనులకూ, బీద సాదలకూ, భోజనము పెడతారు.

## సుమంగళి ప్రార్థనలు (పేరంటాలు)

ఒక స్త్రీ ముత్తయిదువుగా మరణిస్తే ఆవిడ పుణ్యాత్మురాలిగా భావింపబడి, పూజలూ, ప్రార్థనలూ, అందుకుంటుంది. చెట్టినాడులో చెట్టియార్ జాతిలో ఈ క్రింది ఆచారము వాడుకలో నున్నది.

పడైప్పు (నైవేద్యం) అనే శ్రాద్ధము రోజున బంధువర్గమంతా కలుసుకుంటారు. మరణించిన వ్యక్తి కోసరం పిండి వంటలు చేసి నివేదించి పూజలు జరుపుతారు. కొన్ని కుటుంబాలలోనయితే తమ పూర్వీకులు కట్టిన ఇళ్ళలో ఒక గదిని ఈ శ్రాద్ధము కోసరము ప్రత్యేకించి ఉంచుతారు. ఆ గది పవిత్రమైనదిగా భావింపబడుతుంది.

మరణించిన స్త్రీ ఆత్మకు సంతుష్టి కలిగించడం కోసరమూ, దుష్ట శక్తుల నుంచి కుటుంబమును కాపాడడం కోసరమూ, ఈ నివేదన చేస్తారట. ఆవిడ మరణానంతరం భర్త పిల్లల్ని చూసుకోవలసి ఉంటుంది. అతను రెండో పెళ్ళి చేసుకుంటాడు. మొదటి భార్య పిల్లల పట్ల సవతితల్లి సరిగా ఆదరణ చూపక పోవచ్చును. అలాంటి విపరీతములు జరగకుండా ఉండటం కోసరమే హెచ్చరికవలె ఈ సుమంగళి ప్రార్థనలు (పేరంటాలు) నిర్ణయింపబడి వుండవచ్చును.

ఈ శ్రాద్ధము జరుపుకొనుటకు నిర్ణీతమైన తేదీ ఏదీ ఉండదు. ఏడాదిలో తమకు అనువైన రోజున ఈ పేరంటము జరుపుకుంటారు. జేష్ఠపుత్రుడు తన

కుటుంబంలో పెళ్ళివంటి శుభకార్యము జరిపేటప్పుడూ, కొత్త వ్యాపారము మొదలెట్టేటప్పుడూ, విదేశ యాత్రకు బయలుదేరేముందూ, ఈ సుమంగళి ప్రార్థన విధిగా జరుపుతాడు.

బంధువర్గమంతా ఆహ్వానింపబడతారు. అందరూ ఇలా చాలా రోజుల తర్వాత కలుసుకోవడం జరుగుతుంది. మరణించిన స్త్రీ యొక్క దుస్తుల్ని పరిశుభ్రము చేసి ఆమె ఫోటో ముందుగానీ, తైలవర్ణ చిత్రము ముందుగానీ ఉంచుతారు. ఆమెకు ఇష్టమైన పిండి వంటలు వండి పెద్ద పెద్ద విస్తళ్ళలో వడ్డించి నివేదన చేస్తారు.

వీటితో బాటు ఆమె నగల్ని కూడా పెట్టి పూజిస్తారు. ఈ పేరంటములో పాల్గొనే ప్రతి ఇల్లాలూ, తనకూ ముత్తయిదువుగా మరణించే అదృష్టం కల గాలనీ విధవకు జరిగే చిన్నచూపు రాకుండా ఉంచాలనీ తనకూ తన సంతతి వారు ఇలా ప్రార్థనలు జరిపే భాగ్యం కలగాలనీ ప్రార్థిస్తుంది. ఒక స్త్రీ తన ప్రియమైన భర్తనుంచీ, పిల్లలనుంచీ కోరుకునే "తాజ్‌మహల్" ఇది!

## కొండ జాతులలో దహనక్రియలు

**నీలగిరి కోటాలు** :- వీళ్ళు శవాన్ని కుడిగట్ (తేరులా కట్టిన పాడె) అనబడే పాడెలో తీసుకుని వెళతారు. చావు రోజున ఈ తెగవారు చావు సంభవించిన కుటుంబానికి అన్ని విధాలా సహాయం అందిస్తారు. ప్రతి ఒక్కరూ మరణించిన వ్యక్తి పాదాలను తమ నొసటితో స్పృశిస్తూ అతని ఆత్మశాంతి కోసరం ప్రార్థిస్తారు. ఈ పద్ధతిని 'ధవమూతమూ' అని వ్యవహరిస్తారు. అతని భస్మముకాని అస్థికలు సేకరించి వార్థవ స్థలము అని పిలవబడే ఒక ప్రదేశంలో భద్రపరుస్తారు. ఆ చోట సంవత్సరంలో ఒక రోజున స్వర్గస్థులైన వారందరికిని ఒక్కుమ్మడిగా తద్దినము చేస్తారు. ఈ తద్దినములు ముగిశాక వితంతువులు తమ వైధవ్యాన్ని వదిలిపెట్టి మళ్ళీ పెళ్ళి చేసుకోవచ్చును.

**తోడాలు** :- తోడాల సంస్కృతిలో అత్యంత ప్రాధాన్యత వహించేది,

ఈ అంత్య క్రియలే. వీరి నియమనిబంధనలు చాలా సంక్లిష్టముగా ఉంటాయి. మరణించిన వ్యక్తి పరలోక యాత్రలో అతనికి తోడు వెళతాయని వీళ్ళు దున్నల్ని బలి యిస్తారు. ఈ సందర్భంలో పురుషులు దున్నల్ని తరిమి పట్టుకుని తమ పరాక్రమమును ప్రదర్శిస్తారు. అంత్యక్రియల సందర్భములో ఈ జాతి ప్రజలు రంగు రంగుల దుస్తులు ధరించి మద్యము సేవించి నృత్యము చేస్తూ ఆనందిస్తారు.

# 5 వ అధ్యాయము

## పండగలు—పర్వాలు

తమిళనాడు దేవాలయములకు పుట్టినిల్లు. ఆ రాష్ట్రి ప్రభుత్వము దీనికి తార్కాణముగా గుడి గోపురమును తమ ప్రభుత్వచిహ్నంగా కలిగి వున్నది. హిందూదేశములో గుడి గోపురమును ప్రభుత్వచిహ్నంగా కలిగిన రాష్ట్రిము ఒక్క తమిళనాడు మాత్రమే.

దేవాలయములకును తిరనాళ్ళకును అవినాభావ సంబంధము కలదు. తిరునాళ్ళు జరుగని కోవెలకానీ కోవెలతో సంబంధముకాని ఉత్సవము కానీ అరుదు. ఈ ఉత్సవాలు మత పరంగానే కాక సాంస్కృతికంగానూ వ్యాపారరీత్యానూ ప్రాముఖ్యము వహిస్తాయి. అవి ప్రజాజీవన విధానంలో అంతర్భాగంగా కలిసి పోయాయి. ఈ పండగ పర్వాలలో బంధు మిత్రులందరూ ఒకటవుతారు. చిన్న తగాదాలవల్ల ఎడమొహం పెడమొహంగా ఉన్నవాళ్ళు సైతం ఈ ఉత్సవాల సమయంలో కలిసి ఆనందిస్తారు.

ఏకాదశి, స్కంధ షష్ఠి మున్నగు పర్వ దినములలో భక్తులు ఉపవాసము ఉంటారు. తక్కిన హిందూ పర్వదినములను విందు వినోదములతో ఘనంగా జరుపుకుంటారు.

### ఋతువులలో వచ్చే పర్వదినములు

తమిళుల ఋతువులకు కార్ (మబ్బుల కాలం) కుదిర్ (వానాకాలం) మున్ పని (తొలి మంచు) పిన్ పని (మలిమంచు) ఇళవెనిక్ (లేత ఎండ) ముదువెనిల్ (ముదురెండ) అని పేర్లు.

అలాగే సంవత్సరాన్ని రెండు అర్ధ సంవత్సరాలుగా విభజించారు. (1) ఉత్తరాయణము :-ఇది జనవరి మధ్యలో ప్రారంభమై జూలై మధ్యలో ముగిస్తుంది. ఈ కాలంలో పగలు ఎక్కువ, రాత్రి తక్కువ. (2) దక్షిణాయణం:- జూలై ఉత్తరార్ధంలో ప్రారంభమై జనవరి పూర్వార్ధంలో ముగిస్తుంది. ఈ కాలంలో రాత్రి ఎక్కువ, పగలు తక్కువ. ఉత్తరాయణంలోనే పండుగలూ, పబ్బాలు విరివిగా జరుగుతవి. దక్షిణాయణంలో సాధారణముగా ఎక్కువ వేడుకలు జరుగవు. దక్షిణాయణం ప్రారంభం కాగానే మత గురువులూ, సన్యాసులూ, చాతుర్మాస్యము అనే విధిని పాటిస్తూ ఒక్కో ప్రదేశంలో బసచేసి అక్కడ భక్తి మార్గమును చూపించే ఉపన్యాసములు ఇస్తూ ఉంటారు.

## మత సంబంధమైన పర్వదినములు

బహుశా తమిళనాడులో ఉన్నన్ని మత సంబంధమైన పర్వదినాలు మరే రాష్ట్రంలోనూ ఉండవేమో. ఇక్కడి ప్రజల్లో తొంభై శాతం హిందువులు కావడం వల్ల క్రైస్తవులు, మహమ్మదీయులు జరుపుకునే ఉత్సవాలలో సైతం హిందూ ఆచారముల ప్రభావం ఎంతయినా కనబడుతుంది. పండుగలను పర్వములను పురస్కరించుకొని కొత్త వస్తువులు కొనడం, భారీ ఎత్తున అతిథులను సత్కరించడం, దేవాలయములకు మెండుగా విరాళములు ఇవ్వడం జరుగుతుంది.

దేవాలయములలో జరిగే ఉత్సవాలు చాలావరకు సెప్టెంబర్ - అక్టోబర్ నెలల్లోనూ, పంటలు ఊర్పిడి జరిగే మార్చి - జూన్ నెలల్లోనూ వస్తాయి. ఆ సమయాల్లో ప్రజలు తమ ఆదాయంలో కొంత భాగాన్ని ఆడంబరముగా ఖర్చు పెట్టి వినోదిస్తారు.

ప్రతి తిరనాళ్ళు మూడు రోజులనుంచీ పదిరోజులదాకా కొనసాగుతుంది. ఈ ఉత్సవములలో దేవుని విగ్రహాన్ని రంగు రంగుల వస్త్రములతోనూ, విలువైన ఆభరణములతోనూ, అలంకరించి వాహనములలో అమర్చి

దేవాలయము చుట్టూ మెరవిణి చేస్తారు. మధురై, శ్రీరంగము, ఇంకా కొన్ని పట్టణాలు ఈ తిరునాళ్ళకు ప్రసిద్ధిగాంచాయి. అక్కడ ప్రతి వీధికీ ఒక ఉత్సవం పేరుపెట్టారు. దేవుని విగ్రహమును ఊరేగింపుగా తీసుకు పోవడంలోగల అంతరార్థం ఏమిటంటే దేవాలయమునకు వెళ్ళి దేవుణ్ణి పూజించలేని వ్యాధిగ్రస్తులూ, వయోవృద్ధులూ, దేవాలయ ప్రవేశమునకు నోచుకోని కడజాతివారూ (స్వాతంత్ర్యానంతరం అన్ని జాతులకూ దేవాలయ ప్రవేశం కల్పింప బడినది) దేవుణ్ణి దర్శించే భాగ్యము పొందుతారట.

అంబారీలతో అలంకరింపబడిన గుడిఏనుగులు ఈ ఊరేగింపుకు ముందు వెళతాయి. సూర్యుడి వేడిమినుంచి దేవుణ్ణి కాపాడటం కోసరం పట్టు గుడ్డలతో తయారు చేసిన ఛత్రములు కడతారు. ఉత్సవము జరిగే ముఖ్య దినములలో రాత్రిపూట దేవుడు ఊరేగింపు వస్తున్నప్పుడు గృహస్థులు దేవుడికి నారికేళము, పుష్పఫలాదులు, నివేదించి కర్పూర హారతితో అర్చన చేస్తారు. ఈ ఉత్సవాలు జరుగుతున్న రోజులలో మత బోధలు భోజనాలు, పాటకచేరీలు, గ్రామీణ నృత్య నాటికలూ ప్రతి రాత్రీ జరుగుతుంది. దేవుడు గుడికి తిరిగి చేరే దాకా (సూర్యోదయము) ఈ వినోద కాలక్షేపాల్లో పాల్గొంటూ ఉంటారు.

దేవుడి దీవెనలు పొందటం కోసరం నాటుపురములలో హరిశ్చంద్రోపాఖ్యానము వంటి వీధినాటకాలు జరుపుతారు. హరిశ్చంద్రుడు తన భార్య చంద్రమతితోనూ, మరణించిన తనయుడు లోహితాస్యుడితోనూ దర్శనమిచ్చే శ్మశానకాండం అనబడే అంకమును ప్రదర్శించడంవల్ల వానలు పడతాయని ప్రజలు నమ్మతారు.

రథోత్సవాలలో దేవుడి విగ్రహమును చక్కగా చెక్కబడిన దేవాలయ రథములో ప్రతిష్ఠించి ఊరేగిస్తారు. ఈ రథములు కళానైపుణ్యానికి నిదర్శనం. దేవుడి విగ్రహమునకు అమర్చే విధానము ఎంతో పొందికగా ఉండి నేత్రరంజకంగా వుంటుంది. కొన్ని రథాలు బంగారు లేదా వెండి రేకులతో కప్పబడి

ఉంటాయి. ఈ రథమునకు బలిష్టమైన కొయ్య చక్రాలు ఉంటాయి. ఈ రథము తిన్నగా కదులుతుంది. అన్ని జాతులవారూ కలిసి ఈ తేరును లాగుతారు. మంటపముల దగ్గర ఈ ఊరేగింపు ఆగి ముందుకి వెళుతుంది. అక్కడ పూజానైవేద్యాలు జరుగుతాయి.

తిరువారూరు దేవాలయములోని రథము దేశములోనే మిక్కిలి పెద్దది. దానిని లాగటానికి పదివేలమంది మనుషులు కావలసి వచ్చేది. ఈ రోజుల్లో అంతమంది పోగవడం కష్టం. కావున ఆ రథమునకు ఉక్కు ఇరుసులు చక్రాలు బిగించి ఆవిరి యంత్రాలు అమర్చి ఇప్పుడు రెండువేల మందితో లాగబడుతోంది.

ఈ తిరనాళ్ళు పెళ్ళీడుకొచ్చిన యువతీ యువకుల్ని చూడటానికి, తదుపరి పెళ్ళి ప్రయత్నాలు చెయ్యడానికి ఉపకరిస్తాయి. ఇది బంధుమిత్రుల పునస్సమాగమమునకు కూడా అనువైన సమయము. లోగడ ఏవయినా చిన్న తగాదాలు ఉన్నా ఈ ఉత్సవాలను పురస్కరించుకుని అవన్నీ పరిష్కరింపబడి సత్సంబంధాలు ఏర్పడతాయి.

గ్రామీణ ప్రాంతపు ప్రజలు ఈ తిరనాళ్ళలో పాలుపంచుకోవడం కోసరం దూరదూరముల నుంచి చద్ది అన్నము కట్టుకుని ఎడ్లబండ్లలో వెళతారు. పూర్వకాలపు రాజుల చేతనూ, ధనవంతుల చేతనూ, తమిళనాడులో అన్ని చోట్లా నెలకొల్పబడి వున్న సత్రములు ప్రజలు బసచేయడానికి అనువుగా వున్నాయి. కొన్ని సత్రములకు ధర్మసంస్థలు నెలకొల్పబడి యాత్రికులకు ఉచిత భోజన సౌకర్యములు కూడా కలిగింపబడుతున్నాయి. వారణాసి, రామేశ్వరము రహదారిపైన నెలకొల్పబడిన సత్రములు అమెరికాలోని ఎక్స్‌ప్రెస్ రహదారిలోని మోటల్సులాగా యాత్రికులకు సహకరిస్తాయి.

ఉత్సవాల రోజున వాన రావడం లేదా వాతావరణం చల్లబడటం జరుగుతుందని ప్రజల నమ్మకం. కీడు కలుగకుండా ఉండాలనీ, ప్రజలు సాధ్యమైనంత పీతిగా నిజాయితీగా నడుచుకుంటారు. బహిష్టు అయిన స్త్రీలు మైలపడటం వలన ఈ ఉత్సవాలలో పాల్గొనుటకు అనర్హులు.

మత సంబంధమైన ఉత్సవాలలో పాల్గొనడంలో తమిళులు విశాల దృక్ప థము కలిగి వున్నారు. వారు ఆంధ్రదేశములోని తిరుపతి కొండకూ కేరళ లోని గురువాయూర్ గుడికి తండోపతండాలుగా వెళతారు.

కేరళ రాష్ట్రములోని శబరిమలై అయ్యప్ప ఉత్సవాలలో (జనవరిలో జరుగుతుంది) వేలాది తమిళులు పాల్గొంటారు. ఈ ఉత్సవంలో పాల్గొనడం కోసరం వారు బ్రహ్మచర్యంలాంటి కఠోరనియమాలను నాలుగు వారాలపాటు సక్రమముగా పాటిస్తారు. కొండల్లో మైళ్ళ కొలది దూరము పాదయాత్రతోనే ప్రయాణం చేస్తారు. ఇలాంటి యాత్రలవల్ల రాష్ట్రముల మధ్య సుహృద్భా వము పెంపొందుతుంది.

తమిళనెలలైన ఆడి, పురట్టాసి, మార్గళి, పంగుణి మున్నగునెలల్లో తమి ళులు వివాహములు జరుపరు. వారు ఆ నెలల్లో ఆడిపూరం, ఆడితపస్సు నవ రాత్రి, తిరువాధిరై, మహాశివరాత్రి మున్నగు ఉత్సవములలో ఏకాగ్రతతో పాల్గొనవలసి ఉండటమే దీనికి ముఖ్యకారణము. ఇప్పుడిప్పుడు ఆది, మార్గళి నెలలు తప్పించి తతిమ్మా నెలల్లో వివాహాలు జరిపిస్తున్నారు.

ఈ ఉత్సవాలను పురస్కరించుకుని దేవాలయములలో కొన్ని ప్రత్యేకమైన పాటలు గానం చేస్తారు. మద్రాస్‌లోని కపాలీశ్వరాలయము, మరియు పార్థ సారధి ఆలయములోనూ, కాంచీపురంలోని ఏకాంబరేశ్వర ఆలయములోనూ, తిరునెల్వేలోని నెల్లియప్పర్ గుడిలోనూ ఇలాంటి ఆచారములు వాడుకలో వున్నాయి.

తిరువాన్మియూర్‌లోని త్యాగేశర్ కోవెలలో పంగుణి నెలలో జరిగే తెప్పో త్సవములో ఈ క్రింది పాట పాడటం ఆనవాయితీ.

ఇవ్వాయిల్ సూయ్ సప్పణి నూడ వందదర్కు
ఓ వెండ్రు అళై త్తార్కు ఓంకారవట్టత్తార్కు
పితనెంద్రు అళై త్తార్కు పిరంబడి పట్టదార్కు
పేయ్‌గళ్ ఉడలై ఖుడలై కూత్తాడిన వర్కు....

ఈ పాట కొన్ని శివలీలల్ని ఉటంకిస్తుంది.

అదే గుడిలో పాడే మరోపాట ఆ దేవాలయము ఉనికిని గురించి, దాని గోపురము సోబగును గురించి, రాత్రి విగ్రహముల గురించి విశదముగా తెలియ చేస్తుంది. దేవుళ్ళని పూజించే అవకాశం మాకు సదా కలగాలనే కోరికలతో ఆ పాట ముగిస్తుంది.

ఆ పాట ఇలా సాగుతుంది :-

"తెన్నం శోలై యిల్ సూయ్
తిరు వాన్మియూర్ స్థలత్తిల్
తిరు వాన్మియూర్ త్యాగేశర్
తిగట్టాన కనిపోప్పేల్
తెన్ పాండి తెన్ సోలై నాట్టానే
సొర్ణసభై గోపురత్తిన్ అళగుం
సూదసమన్న నంది అళగుం
వర్ణ పంచాక్షరి అళగుం
వందు పణిందిడ తొంది అళగుం
ఎన్నేరముం ఉనదు సన్నిధి తనిలుళ్ళే
ఇరుక్క వేండుం అయ్యనే"

కోయంబత్తూరుకు వలభై కిలోమీటర్ల దూరములో వున్న చిత్తూర్ అనే గ్రామములో జరిగే చిత్తూర్ అమ్మాళ్ ఉత్సవాలలో పూర్వం చేరరాజును కొంగు దేశపు రాజు జయించిన ఘట్టమును ప్రదర్శిస్తారు. యుద్ధ దృశ్యాలు ప్రదర్శింపబడుటయేగాక విద్యార్థులు కొంగుపడై (కొంగు దేశ సైన్యము) అనే గ్రంథము నించి పాటలు పాడుతారు.

తమిళనాడులో లెక్కలేనన్ని ఉత్సవాలు జరగడంవల్ల ముఖ్యమైన కొన్నిటిని మాత్రము ఈ క్రింద వివరించడం జరిగింది.

## చిత్తిరై (చైత్రోత్సవము)

తమిళులకు చిత్తిరై తొలినెల ఈ నెలలో వసంతకాలమునకు స్వాగతం పలుకుతూ ఈ ఉత్సవం జరుపుతారు. ఈ ఉత్సవం మధురైలో ఆడంబరంగా జరుగుతుంది. అక్కడి దేవాలయములలోని విగ్రహములను చైత్రపౌర్ణమి నాడు వైగై నదీ తీరానికి వేలాది ప్రజలు ఊరేగింపుగా మేళతాళ సమేతంగా తీసుకుని పోతారు. ఆ వాతావరణం ఉల్లాసం తోనూ, ఆనందంతోనూ, నిండి ఉంటుంది. ఈ ఉత్సవాలలో మధురై మీనాక్షికి శివునితో వివాహం జరుప బడుతుంది.

ఈ తిరు కల్యాణమును కన్నులారా గాంచి తరించుటకుగాను ఆ చుట్టుపట్ల వంద కిలోమీటర్లనుంచి జనం తరలి వస్తారు. ఆ ప్రాంతంలో ఆ రోజున సెలవు ప్రకటిస్తారు. మధురై జిల్లాలోని రైతులకు ఒక ఆర్థిక సంవత్సరం ముగిసి కొత్త ఆర్థిక సంవత్సరం ప్రారంభమవుతున్నట్టు లెక్క. పాలేగాళ్ళకు సంవత్సర భత్యము చైత్రోత్సవ దినమునుంచి లెక్క పెడతారు.

## వైకాసి విశాఖము

తమిళుల సంవత్సరంలో వైకాసి రెండోనెల. శివనందనుడయిన సుబ్రమణ్యానికి (మురుగన్) ఉత్సవం జరపడానికి వైకాసి పౌర్ణమి చాలా ముఖ్యమైన దినము ఈ రోజున సుబ్రమణ్య దేవాలయములలో వైశాఖ ఉత్సవం జరుగుతుంది. తిరుచ్చెందూర్‌లోనూ తిరుప్పరం కుండ్రంలోనూ భక్తులు పాలకుండలతో వచ్చి దేవుని అభిషేకిస్తారు అది పవిత్రమైన రోజుగా గుర్తింపబడుతుంది

ఇంకో విశేషమేమిటంటే ఈ వైశాఖ పౌర్ణమినాడే గౌతమబుద్ధుడు జన్మించడం, బోధివృక్షముక్రింద జ్ఞానము పొందడం నిర్వాణము పొందడం జరిగాయంటారు. ఇది ఉత్తర భారత దేశంలో బుద్ధ పూర్ణిమ అన్న పర్వ దినముగా ప్రసిద్ధిగాంచినది.

## వైష్ణవ ఉత్సవాలు

కాంచీపురములోని వరదరాజస్వామి కోవెలలో జరిగే గరుడోత్సవం కడు నేత్ర రంజకంగా ఉంటుంది. కొందరు భక్తులు తరతరాలనుంచి ఈ గరుడ సేవను తిలకిస్తుంటారు. వైకాసి వైశాఖం రోజున నమ్మాళ్వార్ జన్మించడంవల్ల ఆరోజున నమ్మాళ్వార్ సన్నిధిలోకి వచ్చి దీవించి వెళతాడని ప్రతీతి.

అని నెలలో పౌర్ణమి జ్యేష్ఠా (కేట్టయ్) నక్షత్రంలో వస్తుంది. ఆ రోజున శ్రీరంగంలో అభిషేకం, మన్నార్ గుడిలో తెప్పోత్సవమూ, మధురై దగ్గర అళగర్ కోవెలలో పడి ఉత్సవమూ జరుగుతాయి.

## పదినెట్టాం పెరుక్కు (పద్దెనిమిదో వెల్లువ)

ఈ పదినెట్టాం పెరుక్కు అనే పద్దెనిమిదో వెల్లువ ఉత్సవం తమిళనెల అయిన ఆడి పద్ధెనిమిదో తారీఖున (ఆగష్టు మొదటివారంలో) కావేరి డెల్టా ప్రాంతములో కొనియాడబడుతుంది. ప్రతి ఏడాదీ ఈ ఉత్సవం జరిగే సమయంలో కావేరీనది తిరుచ్చి తంజావూరు జిల్లాలో పూర్తిగా నిండి ఇరు వైపుల వున్న స్నాన ఘట్టముల మెట్లు నన్నిటినీ తనలో కలుపుకుని ప్రవహిస్తుంది. తమిళనాడులో కావేరికోసరం జరిగే ప్రత్యేకమైన పండుగ ఇది.

ఈ ఉత్సవానికి రెండు మూడు రోజులనుంచి కావేరినదీతీరానికి వెళ్లే దోవలలో చప్పరము అని పిలవబడే చిన్న చిన్న చెక్కరధములు అమ్ముతారు. అవి గోపురాకారముగా ఉంటాయి. లోపల చిన్న దేవుడిబొమ్మ ఉంటుంది. ఈ రధమును కాకి బంగారుతోను రంగు కాగితములతోను అలంకరించి ఉంటారు. వడ్రంగులు మెత్తటి కొయ్య చెక్కలతో ఈ చప్పరములు తయారు చేస్తారు. పదినెట్టాం పెరుక్కు రోజు ఉదయంనించీ పసిపిల్లలు

ఈ రథాలను కంకర రోడ్డుపైన లాక్కొని వెళుతుంటే చూడ ముచ్చటగా ఉంటుంది. సాయంత్రంపూట పిల్లలు ఆ రథములలో కొవ్వొత్తులు వెలిగించి మళ్ళీ లాగుతుంటారు.

హిందూమతములోని వివిధ జాతులవారు తమ తమ ఆచారముల మేరకు సేవలు జరుపుతారు కొన్ని జాతులవారు మట్టితో బొమ్మచేసి దానికి కుంకుమ, గంధము, సాంబ్రాణి మరియు గంధంపొడి కలిపిన బియ్యమూ, కొబ్బరి ముక్కలూ (కాప్పరిసి అంటారు) నివేదిస్తారు. ఈ ఉత్సవాన్ని పురస్కరించుకుని రక్షాబంధనములాంటి ఎర్రటి త్రాడు కట్టుకుంటారు. భార్యాభర్తలు ఒకరికొకరు కడతారు. మట్టిగాజులూ నల్లపూసలూ నదీ దేవతకు కానుకగా అర్పించిన తర్వాత తాంబూలం సేవించి స్త్రీలూ పసిపిల్లలూ ఇంటికి తిరుగుముఖం పడతారు. కొందరు నూతన దంపతులు తమ పెళ్ళి దండలను భద్రపరచివుంచి ఈ ఉత్సవం సమయంలో కావేరిలో వదులుతారు.

బ్రాహ్మణులు ఉదయంపూట కావేరిలో స్నానంచేసి ఆ నదీమతల్లికి పువ్వులూ, పాలూ నివేదిస్తారు. ఈ పండుగను పురస్కరించుకుని వాళ్ళు తమ ఇళ్ళలో పాయసము తయారుచేసి అందరూ సేవిస్తారు. ఆ రోజు సాయంత్రము చిత్రాన్నము వండుకుని చక్కగా ముస్తాబై నదీతీరానికి వెళతారు. కొంత చిత్రాన్నమును నదికి సమర్పించిన తర్వాత అక్కడ కాసేపు ఉల్లాసంగా విహరించి చిత్రాన్నమును ఆరగించి ఇంటికి తిరిగి వస్తారు. ఈ ఈ పద్దెనిమిదో పెల్లువ అన్నది పసిపిల్లలకూ, స్త్రీలకూ, చాలా ముఖ్యమైన పండుగ.

అలాగే ఈ పవిత్ర దినమున పాతబడిన తాళపత్రములను నదిలో చేరుస్తారు. ఇవి పొయ్యిలో వెయ్యడం అపచారంగా భావింపబడుతుంది. ఈ పర్వదినమున మధ్యాహ్న సమయంలో పరిసరప్రాంత దేవాలయములలోని దేవుళ్ళ దేవతల విగ్రహములను కావేరితీరములలోని ఘంటపములకు తీసుకుని వెళ్ళడం ఆనవాయితీ,

## ఆవణి మేలము

ఆవణి నెలలో మూలానక్షత్రము పుట్టేరోజున మధురైలో ఈ పండుగ జరుగుతుంది. శివుడు మదురై నగరంలో మామూలు కూలీవాడుగా పని చేసి నాడనే ఇతిహాసానికి ఇది నిదర్శనంగా జరుగుతుంది. స్థానిక ప్రాముఖ్యత కలిగిన ఈ ఉత్సవం చాలా కనువిందుగా జరుగుతుంది. భక్తులు ఆ రోజు పిట్టుచేసి ఆరగిస్తారు.

## నవరాత్రి

పురట్టాసి (సెప్టెంబర్-అక్టోబర్)లో నవరాత్రి ఉత్సవాలు జరగడం వల్ల ఆ నెలకు ప్రాముఖ్యత వచ్చింది. కొన్ని శతాబ్దముల క్రితము తమిళ నాడులోని కొన్ని ప్రాంతాలు మైసూరు రాజుల ఆధీనములో ఉండేవి. బహుశా అప్పుడే ఈ దసరా పండుగ తమిళనాడులో ప్రవేశ పెట్టబడి ఉంటుంది. ఇప్పటికి ఈ ఉత్సవాలు పట్టణ ప్రాంతాలలోనూ, పూర్వకాలపు రాజ వంశ ములతో, దళవాయిలతో సంబంధం కలిగిన ప్రాంతములలోనూ జరుగుతాయి. నవరాత్రికి బొమ్మల కొలువు పెట్టడమన్నది ధనవంతుల ఇంట్లో బాగా అట్ట హాసంగా జరుగుతుంది. సామాన్య ప్రజలు వేసవికాలంలో అయ్యనార్ గుడిలో జరిగే పురవి ఎడుప్పు (గుర్రపు బొమ్మల ఉత్సవం)లో పాల్గొంటారు. ఈ ఉత్సవం వాడుకలో వున్నందున తమిళనాడులో బంకమట్టితో బొమ్మలు చేసే గ్రామీణకళ బాగా అభివృద్ధి చెందినది. ఈ మట్టిబొమ్మలు చెయ్య డానికి బంకమట్టి, కాగితపు అట్ట, రంగులు ఉపయోగిస్తారు. ఈ వృత్తి చేసేవారు ఇంకా పాత మోస్తరులోనే బొమ్మలు చేస్తున్నా వీరు పురాణ కథ లను తెలిపే బొమ్మలు కూడా చెయ్యగలరు.

## దీపావళి

ముఖ్యముగా పేర్కొనవలసిన మరో పండుగ దీపావళి, ఆ రోజున

తలంటి స్నానము చేసి కొత్త దుస్తులు ధరిస్తారు. పిండివంటలు వండుకుంటారు. టపాకాయలు కాలుస్తారు. సాధారణముగా ఈ పండుగ అక్టోబర్ నెలలో రావడంవల్ల రైతులు దీనిపట్ల అంతగా ఆసక్తి చూపరు. వారికి ఆ నెలలో ఈ పండుగకోసరం దుబారా ఖర్చు చేసేందుకు డబ్బులు కాని, విరామం కాని ఉండవు. ధనికవర్గాలు మాత్రమే దీపావళిని ఘనంగా జరుపుకుంటారు. కొన్ని సంపన్న కుటుంబాలు వారణాసికి వెళ్ళి గంగా స్నానము చేసి అక్కడ దీపావళి జరుపుకుంటారు.

## కార్తీక దీపం

తమిళనాడులో కార్తీక దీపం దీపాల పండుగగా జరుపుకుంటారు. ఈ పర్వము తొల్కాప్పియం కాలము నించీ వాడుకలోవున్నది. ప్రతి ఇల్లూ మట్టి దీపాలతో అలంకరింపబడుతుంది. ఈ పండుగ చాలా ఉత్సాహంగా జరుపబడుతుంది. పిల్లలు టపాకాయలూ, కాకరొత్తులూ కాలుస్తారు. తమిళనాడులో కొన్ని ప్రాంతాలలోని వైష్ణవులు "పొరివాణం" అనే దీపాల్ని తయారుచేసి తమ ఇళ్ళలో వెలిగిస్తారు. ఇది కొయ్యరెమ్మలో గుడ్డపీలిక, దారము రంపపు పొడి మరుత్తుకాయ మున్నగు వాటితో తయారు చేస్తారు. ఈ మిశ్రమమును వెలిగిస్తే నిప్పు రవ్వలు వస్తాయి. మట్టితో చేసిన ఏనుగు ఆకారముగల దీపాలను పుట్టినింటినించి తమ కూతుళ్ళకు కానుకగా పంపిస్తారు.

ఈ పర్వదినము నవంబర్ - అక్టోబర్ నెలల మధ్య కార్తీక నక్షత్రంలో వస్తుంది. ఇది తిరువణ్ణామలైలో అత్యంత ప్రాముఖ్యత వహిస్తుంది. తిరువారూరులో పుట్టినా, వారణాసిలో గిట్టినా, చిదంబరంలో పూజించినా, తిరువణ్ణామలై దేవాలయమును స్మరించినా ఒకవ్యక్తి తప్పక ముక్తిని సాధిస్తాడని అంటారు. తిరువణ్ణామలైలో కార్తీకం రోజున శివుడు పంచభూతములలో ఒకటైన అగ్నిస్తంభముగా దర్శనమిచ్చాడని ప్రతీతి. ఇక్కడి పర్వతము శివుడిచేత నిర్మింపబడినదనీ కార్తీకం రోజున ఆ కొండపైన వెలుగు కనిపిస్తుందనీ అంటారు. ఇక్కడ ఈశ్వరుడు అరుణాచలేశ్వరర్ అనే పేరుతో పిలవ బడతాడు.

కార్తీకదీపం మామూలుగా పౌర్ణమినాడు వస్తుంది. ప్రజలు "అణ్ణామలైక్కు-అరోహరా" అనే నినాదములు చేస్తారు. ఒక పెద్దరాగిపాత్రలో పచ్చ కర్పూరమూ, నేయీ కలిపి అందులో వత్తివేసి కొండపైన ఆ రోజు సాయంత్రం అయిదు గంటలకి వెలిగిస్తారు. ఈ దీపాన్ని దర్శిస్తే అజ్ఞానము తొలగిపోయి జ్ఞానోదయం కలుగుతుందంటారు.

ఈ ఉత్సవమును పురస్కరించుకుని తిరువణ్ణామలైలో పది రోజులపాటు పశువుల సంత జరుగుతుంది. ముఖ్యమైన రోజులలో విగ్రహములను అలంకరింపబడిన వాహనములపై ఊరేగింపు తీసుకెళతారు. ఈ ఊరేగింపులు తప్పక చూడదగినవి.

## తిరుప్పళ్ళి ఎళుచ్చి (మేలుకొలుపు)

మార్గశినెల ముప్ఫయి రోజులూ ప్రజలు ఉదయాత్పూర్వము స్నానముచేసి పొద్దు పొడిచేలోగా ప్రార్థనలూ దైవదర్శనమూ జరుపుతారు. గజగజ లాడించే చలిని లెక్కపెట్టరు. తిరుప్పావై, తిరువెంబావైలోని పాటలు గానం చేస్తారు.

## తిరువాధిరై

తిరువాధిరై (అరుద్ర ప్రదర్శనం) మార్గశి నెలలోని పౌర్ణమినాడు వస్తుంది. ఇది నటరాజును పూజించడానికి అనువైన పర్వదినము. తమిళ శైవులలో మిక్కిలి గొప్ప దేవాలయముగా శ్లాఘింప బడిన చిదంబరం నటరాజ గుడికి ప్రజలు తండోపతండాలుగా తరలి వెళతారు. తిరువెంబావైని ఆశువుగా పాడిన మాణిక్య వాచగర్ అనే గురువునకు ఇక్కడ శివుడు తిరువాధిరై రోజున ప్రత్యక్షమైనాడట. ఇదే రోజున పేరూరు (మేలై చిదంబరం)లో శివుడు కామధేనువుకు దర్శనమిచ్చాడట. ఉషోదయంనించి సాయంత్రం దాకా శివుని విగ్రహాన్ని నూనె, పాలు, తేనె, కొబ్బరినీళ్ళు మరియు పెరుగు మున్నగు పవిత్ర ద్రవాలతో అభిషేకిస్తారు.

## వైకుంఠ ఏకాదశి

ఇదే మార్గళి నెలలో వైష్ణవులు అత్యున్నతమని భావించే శ్రీరంగం దేవాలయములో శుక్ల పక్షములో ప్రారంభమయ్యే ఈ ఉత్సవాలు ఇరవై ఒక్క రోజులు జరుగుతాయి. పదో రోజున జరిగే మోహిని అవతారం (నాచ్చియార్ కోలం) అనే ఉత్సవానికీ పదకొండో రోజున జరిగే ఏకాదశికీ ప్రజలు వేల సంఖ్యల్లో పాల్గొంటారు. ఆళ్వార్లు పాడిన నాలుగువేల పాటలనూ గానం చేస్తారు. పద్ధెనిమిదో రోజున దేవుడికి తిరుమంగై ఆళ్వారుతో వాగ్వివాదము జరిగిందట. ఆళ్వార్ విరచించిన గ్రంథము జ్ఞాపకార్థము ఇరవయ్యో రోజున "తిరువాయ్ మొళి" ఉత్సవం జరుగుతుంది. పదకొండోరోజు నుంచీ ప్రతి దినమూ శ్రీరంగనాథుని విగ్రహము పరమ పదవాసల్ (స్వర్గ ద్వారము) లోకి తీసుకు రాబడుతుంది. నైవేద్యములను స్వీకరించి భక్తులను దీవించిన తర్వాత దేవుని ఊరేగింపుగా గర్భగుడిలోకి తీసుకొని పోతారు.

## తైపూసం

తైనెలలో పళని, తిరుత్తణి మున్నగు చోట్లలోని మురుగన్ దేవాలయములలో తైపూసం అనే ఉత్సవం జరుగుతుంది. ఈ ఉత్సవం తైనెల పౌర్ణమిరోజున జరుగుతుంది. భక్తులు నెత్తిన కరగం అనబడే కుంభముతోనూ భుజాలపైన కావడులతోనూ దూర దూరాలనించీ కావడి పాటలు పాడుకుంటూ నడచివస్తారు.

ఆదేరోజున మధురైలో తెప్పోత్సవం జరుగుతుంది. గుడిలోని దేవుళ్ళను పట్టు వస్త్రాలతోను, నగలతోనూ, పుష్పమాలలతోనూ అలంకరించి పెద్ద పెద్ద వూరేగింపుగా మధురైకి తూర్పు దిక్కున వున్న మారియమ్మన్ తెప్ప కుళం అనే పెద్ద కొలను దగ్గరికి తీసుకుని వెళతారు. దీపములు వెలిగించిన

తెప్పతో దేవుళ్ళ విగ్రహాలను ఉంచి కొలనులో తిప్పుతారు. మంగళ వాద్యములు మ్రోగిస్తారు. ఇలాటి ఉత్సవమే మద్రాస్‌లోని మైలాపూర్ కపాలీశ్వర ఆలయములోనూ జరుగుతుంది. మార్చి ఏప్రిల్ నెలలమధ్య జరిగే వార్షికోత్సవంలో ఈ కపాలీశ్వర ఆలయంలోని 63 మంది శైవనాయన్ మార్ల విగ్రహాలను ఊరేగిస్తారు. ఇది మద్రాస్ పురజనుల ఉత్సవము లన్నిటిలోనూ చాలా ముఖ్యమైనది.

## (పొంగల్) సంక్రాంతి

పంటల నూర్పిడిని కొనియాడే పొంగల్ (మకర సంక్రాంతి) పండుగ తమిళ దేశంలో పెద్ద పండుగ. దీనిని మత విచక్షణ పాటించకుండా అందరూ జరుపుకుంటారు.

కొత్తబియ్యమును పొంగలి చేసి అందరూ పంచుకుని తినడమే పొంగల్ పండుగ. రెండో రోజున మాట్టుపొంగల్ (పశువుల పొంగలి) అనే పండుగ జరుపుతారు.

ప్రతి తల్లి అత్తవారింటికెళ్ళిన తన కూతురికి పొంగల్ పండుగలలో మట్టిపాత్రలు, బియ్యము, పళ్ళు, కాయకూరలు, కుంకుమపువ్వు, చెరకు గడలు మున్నగు వాటిని కానుకగా ఇస్తుంది. ఇవన్నీ గౌరవ మర్యాదలతో ఇచ్చి పుచ్చుకుంటారు. ఏ తల్లి అయినా అలా కానుకలివ్వకపోతే ఆమె వియ్యపురాలు తను మరణించేదాకా కోడల్ని ఎత్తిపొడుస్తూనే ఉంటుంది.

ఈ పొంగల్ సూర్యుడు కర్కటరాశి నుంచి మకరరాశిలోనికి వెళ్ళేట ప్పుడు జరగడంవల్ల దీనికి మకర సంక్రాంతి అని పేరు వచ్చింది. వండిన పొంగలిని సూర్య దేవుడికి నివేదిస్తారు. పసుపు కుంకుమలతో కొత్తకుండను అలంకరిస్తారు. చెరకుగడ, గుమ్మడికాయ, గెనుసుగెడ్డ మున్నగు వాటిని సేకరిస్తారు. అనకకొత్త కుండను ఇంటిముంగిట్లో నిర్మించిన పొయ్యిమీద ఉంచి పాలతోను, నీళ్ళతోను నింపుతారు.

పాలు పొంగగానే ఇంట్లోని జ్యేష్ఠ సంతానముగాని కనిష్ఠ సంతానము గాని కుండలో భక్తి పురస్సరముగా కొత్తబియ్యము వేస్తారు. బియ్యము బాగా ఉడికిన తర్వాత అందులో సుగంధ ద్రవ్యాలు కలుపుతారు. పొంగలి వండటం పూర్తయ్యాక "పొంగలో పొంగల్" అంటూ కేకలు వేస్తారు. తర్వాత ఈ అన్నమును మూడు విస్తళ్ళలో పెట్టి సూర్యునికి నివేదిస్తారు. కర్పూర హారతిఇచ్చి వచ్చే పొంగల్ దాకా తమని సుభిక్షంగా దీవించమని దేవుళ్ళను ప్రార్థిస్తారు. ఈ పండుగకు బంధు మిత్రులందరూ ఆహ్వానింప బడతారు.

స్వాతంత్ర్యానంతరం పొంగల్ పండుగకు గ్రీటింగ్ కార్డులు (శుభా కాంక్షలు) పంపడం ఫ్యాషనుగా తయారైనది. ఇంటి పరిచారకులకు, పనివాళ్ళకు కొత్తగుడ్డలు బహూకరింపబడతాయి. తమిళ రైతుల ఇళ్ళలో ధాన్యాలూ, డబ్బులూ పుష్కలంగా ఉండే రోజులు కావడంవల్ల తమిళులు ఈ పండుగను చాలా ఆనందంగా జరుపుతారు. ఇది ప్రతి ఏడాది తైనెల మొదటి తారీఖున వస్తుంది. ఈ పండుగకు ముందు ఇళ్ళకు సున్నముకొట్టి బాగా పరిశుభ్రము చేస్తారు.

ఇప్పుడిప్పుడు పొంగల్ రోజునుంచి మూడు రోజులదాకా సాంస్కృతిక కార్యక్రమములు జరుగుతాయి. సాహిత్య సదస్సులూ, కవితా గోష్ఠులూ, జరిపి సామాన్య ప్రజలకు విజ్ఞానం పెంపొందించి ఈ పండగ యొక్క ఔన్నత్యాన్ని వెల్లడిచేస్తారు.

పొంగల్ మరుసటి రోజున మాట్టుప్పొంగల్ అనే పండుగ జరుగుతుంది. ఆ రోజు ఆవులను ఎడ్లనూ కడిగి వాటికి రంగులుపూసి మెడలో పూల మాలలు వేసి కొత్త గుడ్డలు తొడిగి గంటలు కట్టి వాటిని సన్మానిస్తారు.

## కోడె పందెములు

సాయంత్రం పూట ఎడ్ల నన్నింటినీ ఒక చోట ప్రోగుచేసి ఒక దావి

వెనుక ఒకటి వదులుతూ గట్టిగా తాళాలూ, తప్పెటలూ వాయిస్తారు. దీనిని చూడటానికి జనం తండోపతండాలుగా వస్తారు. ఎడ్లు మోరలెత్తుకుని అన్ని దిక్కుల వైపు పరుగులు తీస్తాయి. గ్రామీణ ప్రాంతములలో "జల్లికట్టు" పోటీలు జరుగుతాయి. మొరటు కోడెదూడ కొమ్ములో గుడ్డకట్టి వదులుతారు. ఆ కోడె దూడను పట్టి అదుపులోకి తెచ్చి కొమ్ములోని గుడ్డను తీయాలి. దీనికి జాగరూకత, వేగము, మరియు గుండె ధైర్యమూ కావాలి. ఎవరైతే ఈ పోటీలో నెగ్గుతారో వారు వీరులుగా గుర్తింపబడుతారు. పోటీలో నెగ్గేవారు తరచు గాయపడటం జరుగుతుంది.

పండుగ లేకపోయినా, మామూలుగా గ్రామాల్లో ఈ పందెములు జరుగుతాయి. ఈ వేడుక మధురై రామనాధపురం, పుదుకోట్టై మున్నగు పట్టణముల పరిసర గ్రామములలో జరుగుతాయి. అరలిప్పారై, సిరవాయిల్, ఉరంగన్ పట్టి విరాళిమలై, పుదుకోట్టై ప్రాంతములలో దీని కోసరం విశేషంగా ధన వ్యయం చేసి బ్రహ్మాండమైన ఏర్పాట్లు చేస్తారు. ఇక్కడ జరిగే కోడె పందాలు తప్పక చూడదగినవి.

తమిళనాడులో జరిగే ఈ కోడె పందాలు స్పెయిన్ దేశములో జరిగే కోడె పందెముల నుంచి వేరుపడి ఉన్నాయి. ఇక్కడ కోడెదూడకు ప్రాధాన్యత ఎక్కువ. ఈ పందెములు "మరవర్" అనే జాతిలో బహుళ ప్రచారములో నున్నవి. రైతులూ గోకులము వారూ ఈ పందెములలో ఎక్కువ శ్రద్ధ చూపుతారు.

ఈ పందెములలో ఎవరికీ లొంగని కోడెదూడలు చాలా గొప్పవిగా గుర్తింపబడి అధిక ధరలు పలుకుతాయి. వాటిని పెద్ద భూకామందులు కొని తమ ప్రత్యేక పశువుల మందలో పెంచుతారు. వానిని చూసుకోవడానికి పశు కాపరుల్ని నియమిస్తారు.

ఒకొక్కప్పుడు ఈ కోడె పందెములవల్ల అపాయము సంభవిస్తుంది. ఒక వ్యక్తి పౌరుషాన్ని ప్రదర్శించడానికి ఈ పందెము ఒక పరీక్షలాంటిది.

పూర్వకాలంలో రామనాథపురం రాజకుటుంబములోని ఆడ పిల్లలూ, సేనా నాయకుల కూతుళ్ళూ ఈ పోటీల్లో గెలుపొందే యువకుల నుంచి తమకు నచ్చిన వారిని (స్వయంవరం) భర్తలుగా ఎన్నుకొనేవారట.

ఈ పందెములు పంటలలో అధిక ఫలసాయము వచ్చినందుకు గుర్తుగా జరుగుతాయి. ఇలాటి పందెములు పూర్వకాలములో బ్రిటనులు అనే విదేశీయులు కూడా జరుపుకునే వారనీ పూర్వకాలంలో తమిళులు మధ్యధరా దేశపు నాగరికతలను ప్రభావితం చేశారనీ దానికి ఇది నిదర్శనమని శ్రీ ఎ. ఎల్. భాషం తన అభిప్రాయం వెల్లడించియున్నారు.

మహం :- మహం పండుగ మాసి నెలలో వస్తుంది. దేవుళ్ళ విగ్రహాలను తీసికెళ్ళి సముద్రపునీటిలో స్నానం చేయిస్తారు. సముద్రతీరానికి సుదూరములో ఉన్న చోట్లలో నదులలో లేదా కొలనుల్లో తెప్పోత్సవం జరుపుతారు.

మహం సంవత్సరమున కొకసారి జరిగే పండుగే అయినా పన్నెండేళ్ళ కొకసారి (పుష్కరము) మాత్రం ఇది చాలా ఘనంగా జరుగుతుంది. గురుగ్రహం సింహరాశిలోకి ప్రవేశించినప్పుడు దక్షిణ భారతదేశంలో ప్రఖ్యాతి గాంచిన కుంభమేళ అనే ఉత్సవం కుంభకోణము వద్ద మహామహం అనే చెరువులో జరుగుతుంది. ఈ ఉత్సవాలలో బీదసాదలూ, మతగురువులూ, వేదాంతులూ, ధనికవర్గాలూ, పండితులూ, అందరూ పాలుపంచుకుని చెరువులో మునకలు వేస్తారు. హిందూదేశంలోని నదులన్నీ ఆ రోజున మహామహం చెరువులో కలుసుకుంటాయట. అందుకని ఆ రోజున ఈ చెరువులో స్నానం చేస్తే దేశంలోని అన్ని నదులలోనూ, స్నానం చేసినంత పుణ్యం వస్తుందని నమ్ముతారు.

## మహా శివరాత్రి

మాసి నెలలో వచ్చే అమావాస్య రాత్రిని మహాశివరాత్రిగా జరుపుకుంటారు. ఇది శైవులకు చాలా పవిత్ర పర్వదినము. ఈ రోజున పురాణకాలములో దేవతలూ, రాక్షసులూ, కలిసి క్షీరసాగరమును మధించినప్పుడు

పుట్టిన హాలాహలము అనే విషమును శివుడు తనలోకి తీసుకుని విశ్వమును రక్షించాడట.

ఆ రోజు రాత్రి శివుడికి జరుపబడిన పూజ ప్రతి ఏడాది జరగడం ఆనవాయితీగా వస్తున్నదట. ఇంకో కథనము ప్రకారం పూర్వం గొప్ప ప్రళయము సంభవించి ప్రపంచం చీకటిమయం అయినప్పుడు ఆ రాత్రికి పార్వతి శివుని ప్రార్థించి ప్రపంచానికి వెలుగు ప్రసాదించినదట. ఆనాడు పార్వతి ఎలా పూజించిందో అలాగే ఇప్పుడు సామాన్యజనం పూజలు జరుపుతారని అంటారు.

ఈ మహాశివరాత్రి ప్రతి శివాలయములోనూ ప్రతి శైవుని ఇంట్లోనూ జరుగుతుంది. భక్తులు ఈ రాత్రంతా పూర్తిగా జాగరణ చేస్తారు. ఓం నమశ్శివాయ అనే తారక మంత్రమును వల్లిస్తూ రాత్రంతా గడుపుతారు. మరునటి ఉదయం స్నానంచేసి, శివపూజలు జరిపిన తర్వాత ఉపాహారం తీసుకుంటారు. శివ దేవాలయములన్నీ దీపాలతో అలంకరింపబడుతాయి. రాత్రి నాలుగు జాములలోనూ నాలుగు పూజలు జరుపుతారు. శివలింగము, పాలు, పెరుగూ, నెయ్యి మున్నగు పూజా ద్రవ్యములతో అభిషేకింప బడుతుంది.

## పంగుణి ఉత్తిరం

తమిళ సంవత్సరంలో చివరినెల అయిన పంగుణిలో తమిళనాడులోని ప్రతి దేవాలయములోనూ, దేవుళ్ళకు పెళ్లిళ్ల చేస్తారు. (తిరుక్కల్యాణం)

ఈ నెలలో సుబ్రమణ్యస్వామికి (మురుగ) పదిరోజుల పాటు జరిగే ఉత్సవాలకు "ఉత్తిరం" అంటారు. గ్రామీణ ప్రజలకు ఇది చాలా ముఖ్యమైన పండుగ. ఈ సమయంలో వాళ్ళు తీరికగా ఉండటం వలన ఈ ఉత్సవాలలో ఎంతో ఉత్సాహంగా పాల్గొంటారు. గుడికి వడ్లు సమర్పిస్తారు.

చివరిరోజు ఉదయం మురుగన్ ముఖ్య ఆయుధమైన వేల్ (ఈటె)

ఊరేగింపుగా నదీ తీరానికి కొనిరాబడి అక్కడ పూజింపబడుతుంది. దానితోబాటు ఒక జత కొయ్య చెప్పులూ, కావడీ "ఇడుంబన్ తడి" అనబడే అధికార దండమూ, అభిషేకింపబడుతాయి. పంగుణి ఉత్తిరం మరునాడు ఇడుంబన్ పూజలు జరుగుతాయి. ఇడుంబన్ సుబ్రమణ్యస్వామికి నమ్మిన బంటు. పూజా సమయంలో ఇడుంబన్ ఆత్మ ఎవరిలోనయినా ప్రవేశించి పూనకం వస్తుంది. ఆ వ్యక్తి ఇడుంబన్ తడి తీసి తన్నుతానే కొట్టుకుంటూ అర్థంకాని భాషలో ఏవేవో జోస్యములు చెబుతాడు. జరుగబోయే వాటికి ఇది ఒక హెచ్చరికగా తీసుకొనడమేకాక ఇడుంబన్ మూలముగనే అవన్నీ జరుగుతాయని ప్రజలు నమ్ముతారు.

## శ్రీకృష్ణ జయంతి

మహావిష్ణువు శ్రీ కృష్ణుడుగా అవతరించిన రోజు వైష్ణవ దేవాలయములలో పూజలూ భజనలూ జరుగుతాయి. పదోరోజున ఒక ఉల్లాసకరమైన వేడుక జరుపుతారు. ఒక కుండలో మజ్జిగపోసి పసుపు గుడ్డతో మూస్తారు తర్వాత ఆ కుండను ఒక స్తంభములో ఎత్తున వేలాడదీస్తారు. గిలకలోంచి ఆ కుండకు దారముకట్టి ఒక వ్యక్తి అవతలి నుంచి పైకీ, క్రిందికీ లాగుతుంటాడు. చిన్న పిల్లల చేతికి కర్రలిచ్చి ఆ కుండను పగులగొట్టమని చెబుతారు. పిల్లలు కుండను అందుకోబోయేటప్పుడు అవతలి వ్యక్తి కుండను పైకి లాగేస్తుంటాడు. అక్కడ గుమికూడిన జనం గెలుపొందిన పిల్లలకు బాలకృష్ణుడి వేషం వేసి వాళ్ళ పైన రంగు నీళ్ళు చల్లి (హోలీలాగ) ఆనందిస్తారు. ఇందులో గెలుపొందే పిల్లవాడు చాలా ఎత్తుకు ఎగరగలిగి ఉండాలి. లేదా అదను చూసుకుని కుండ క్రిందికి దిగినప్పుడు కొట్టాలి.

## కంబం పండుగ (స్తంభోత్సవము)

ఈ స్తంభోత్సవము అన్ని గ్రామాలలోనూ జరుగుతుంది. ఒక మంగళవారము రోజున గ్రామ దేవుడయిన అయ్యనార్ విగ్రహానికి గన్నేరు

పువ్వులతో పూజచేసి ఈ ఉత్సవాన్ని ప్రారంభిస్తారు. మరుసటి వారం అదే రోజున మూడు రెమ్మలు కలిగిన ఒక వేప కొమ్మను గుడి ముందర శాస్త్రోక్తముగా నాటిస్తారు. ఇది ధ్వజోత్సవములాగ జరుగుతుంది. ఇలా చేసిన వెంటనే ఈ కంబం పండుగ ప్రారంభమైనదని భావము. దాని తర్వాత పండుగ ముగిసే వరకూ గ్రామస్తులెవ్వరూ ఊరొదలి బయటకు వెళ్ళరు. ఒక వారం రోజుల పాటు ప్రతి రోజూ సాయంత్రం ప్రజలు ఈ కంబం (వేపకొమ్మ) చుట్టూ ఆడుతూ పాటలు పాడుతారు.

మరుసటి మంగళవారం దేవాలయ ప్రాంగణంలో గ్రామస్తులు పొంగలి వండుతారు. బుధవారము రోజున దేవుడి రధమును ఊరిలోని ముఖ్య వీధులలో ఊరేగింపుగా లాగుతారు. ఒక చిన్న మేకపిల్లను రధ చక్రము క్రింద ఉంచి ప్రాణ బలి ఇస్తారు. ప్రతి వీధి చివర్లోనూ మేక పిల్లల్ని బలియివ్వడం జరుగుతుంది. అలా చంపబడిన మేక పిల్లలను రజకులకు ఇచ్చేస్తారు. అది రధమును జోడించినందుకు గాను రజకులకు ముట్టే ప్రతిఫలమన్నమాట. గురువారమునాడు కొందరు పురుషులు తమ శరీరమంతా సూదులూ, ఇనుప కొక్కెములూ, గుచ్చుకుని ఊరేగింపుగా వెళతారు. స్త్రీలు 'మా విళక్కు" (పిండితో చేసిన దీపం) చేసి పళ్ళెములో ఉంచి గన్నేరు పువ్వుతో అలంకరించి, గుడికి తీసుకొని పోతారు. ఆ రోజు రాత్రి అయ్యనార్ విగ్రహమును పల్లకీలో ఉంచి గ్రామంలో మెరవిణి తెస్తారు. టపాకాయలు కాల్చి తమ సంతోషాన్ని వెల్లడిస్తారు. శుక్రవారం నాటికి ఈ ఉత్సవాలు ముగుస్తాయి. గుడి ఎదుట నాటిన వేపకొమ్మ (కంబం) ను పెకిలించి ముఖ్య వీధులగుండా ఊరేగింపుగా తీసుకెళ్ళి బావిలో పడేస్తారు. ఈ ఉత్సవాలలో ఊళ్ళో వ్యక్తులు ఒకరిపై ఒకరు పసుపు నీరు చల్లుకుంటారు. దీనిని "మంజానర్" ఆడటం అంటారు.

ఎనిమిదో రోజున గుడిలోని పందారం ఉపవాసం ప్రారంభిస్తాడు. అతను ఉపవాసం మొదలెట్టే ముందు బావి దగ్గరికి ఊరేగింపుగా తీసుకెళ్ళబడతాడు.

అతని తలపైన - పువ్వులతోనూ, వేపాకులతోనూ. కుంభముగా తయారైన కొత్తకుండ ఉంటుంది. అతని స్నానం ముగిశాక అతని భుజానికి బ్రాహ్మణ పురోహితుడు ఒక రక్షరేకు కడతాడు. తరువాత పందారం గుడిలోకి వచ్చి అక్కడే మూడు రోజులు గడుపుతాడు.

తొమ్మిదో రోజున మూక ఉమ్మడిగా అందరూ దేవుడికి పొంగలి నివేదిస్తారు. దీనికోసం గ్రామస్థులందరికిని తండోరా ద్వారా పొంగలి నైవేద్యము ఎప్పుడు జరిగేది ముందుగా తెలియజేస్తారు. పొంగలి చేసే వాళ్ళంతా గ్రామ చౌకులోకి గుంపుగా వెళ్ళి అక్కడ విడివిడిగా వండి గుడికి వెళ్ళి నివేదిస్తారు. పూజ ముగిసిన తర్వాత ఆ పొంగలిని అందరూ ప్రసాదముగా స్వీకరిస్తారు.

పదో రోజున మళ్ళీ మావిళక్కు పెట్టడం జరుగుతుంది. చివరగా కంబం బావిలో విడుస్తారు. పండారం తన భుజంలో కట్టిన రక్షరేకును తీసి బావిలో పడేస్తాడు. ఆ రాత్రికి ఊళ్ళో వీధి నాటకము (తెరుకూత్తు) లేదా నృత్యము ఏర్పాటు చేస్తారు. ఇలాంటిదే మధురై వీరన్ ఉత్సవం కూడా ఆ పండుగలోనూ, జంతుబలి ఇవ్వడం జరుగుతుంది.

## మొండియన్ పండుగ

మధురై సమీపములో వున్న తిరువల వయనల్లూరులో ఈ ఉత్సవం ఆడి నెలలో జరుగుతుంది. దాని ప్రత్యేకతలు ఈ క్రింద వివరీకరింప బడ్డాయి.

ఈ పండుగ జరపడానికి దేవుడు బల్లి పలుకుల ద్వారా ఆజ్ఞ ఇవ్వాలట. దేవుడి అనుమతి కోసరం పూజలు జరుపుతారు. బల్లి పలకంగానే ఒక భక్తుడికి పూనకం వచ్చి ఉత్సవం ఎలా జరపాలో ప్రొక్లుచ్చుతాడు. వీధి వీధంతా వేపాకు తోరణాలు కడతారు. ఆ రోజు అయ్యనార్ గుడిలోని పూజారి గుఱ్ఱపు బొమ్మలు చెయ్యడంకోసరం గుడి చెరువులోంచి ఒకబండి బంకమట్టి తీసుకొస్తాడు. ఈ మట్టిబొమ్మలు చేసినందుకు ప్రతిఫలంగా అతనికి కొంత డబ్బు ముట్టజెబుతారు.

ఈ మట్టిగుర్రములను ఊరేగింపుగా దేవుని గుడిలోకి తీసుకెళతారు. అక్కడ ప్రార్థనలు ముగిశాక ఆ మట్టి బొమ్మలను రథముపై ప్రతిష్ఠిస్తారు. రంగు రంగుల దుస్తులు ధరించిన చక్కలియన్ జాతి ప్రజలు సొనచ్చామి గుడినుంచి తాటాకు బుట్టలో నూర్పిడి చెయ్యని వరికంకి, ఒక చురకత్తి, కొయ్య తీసుకుని మొలిదియన్ గుడిలోనికి ఊరేగింపుగా వస్తారు. అక్కడకు వచ్చిన తర్వాత చక్కిలియన్ పూజారి వరికంకిలను గుర్రపు బొమ్మ పాదాల దగ్గర ఉంచి కోడిపుంజును బలియిచ్చి దానినెత్తుకుని గుర్రపు బొమ్మ కనుగుడ్లకు పూస్తాడు. అలా చేస్తున్నప్పుడు పూజారి తన కళ్ళకు తెల్ల గుడ్డతో గంతలు కట్టుకుంటాడు. తరువాత ఈ మట్టి గుర్రాలు ఊరేగింపుగా అయ్యనార్ గుడిలోకి తీసుకొని వెళతారు. కొత్త కుండలు మోస్తూ కణకర్ (కరణము) జాతి స్త్రీలు ఈ ఊరేగింపుకు ముందు నడుస్తారు. అయ్యనార్ గుడిలో పూజలు చేసి అతనికి పొంగలితోబాటు జంతుబలి యిస్తారు.

చివరిరోజున నాలుగో దినమున గ్రామస్తులు ఆంబోతు ఆట జరుపుతారు. ఈ ఆంబోతును కట్టడానికి పల్లన్ జాతివారు ప్రత్యేకమైన నారతో మోకు వడుకుతారు. ఆ మోకు కనియాళన్ అనే పల్లవన్ జాతి దేవుడి ముందర ఉంచి పూజలు జరిపిన తర్వాత దానిని మొండియన్ గుడికి తీసుకెళ్ళి అక్కడ పూజిస్తారు. తర్వాత ఆ మోకులోని ఒక కొనను గూటమునకు కట్టివేస్తారు. ఈ వైపున నలుగురు వ్యక్తులు మోకును జాగ్రత్తగా చూసుకుంటారు. రెండోకొనను కోడె మెడకు బంధిస్తారు. ఆ కోడె మెడలో పూలమాలలతో బాటు రూపాయి నోట్లుకూడా వేలాడదీస్తారు. తరువాత గుంపులోని జనం కోడె దూడను తరుముతారు. అది మోరలెత్తుకుని గూటమును చుట్టి పరుగు తీస్తూ ఉంటుంది. ఈ పోటీలో పాల్గొనడానికి ముస్లిమ్‌జాతివారు తెచ్చే కోడె దూడకు మొదటి అవకాశం ఇస్తారు. ఈ ఆట ముగిశాక గ్రామ దేవుడికి జంతుబలి యిచ్చి ఈ ఉత్సవమును పూర్తి చేస్తారు.

## నడ బావి (దిగుడుబావి) పండుగ

కాంచీ పురములో జరిగే ఈ ఉత్సవములో పాల్గొని తమ మొక్కుబడులు

తీర్చుకోవడానికీ, బీద సాదలకు అన్నదానములు చెయ్యడానికి మద్రాస్‌లోని వ్యాపారస్తులు ఇక్కడికి వస్తారు ఇది చిత్తిరై నెలలో పౌర్ణమి రోజున జరిగే ఒక స్థానిక ఉత్సవము. ఈ ఉత్సవము వరదరాజ పెరుమాళ కోవెల కోసరం నిధులు సేకరించిన కోడి కన్నికాదానం తాతాచారియర్ కాలంనించీ వాడుకలో వున్నదట. తాతాచారి ఒక కొలను త్రవ్వించి తన్ను బందిపోట్లనుంచి రక్షించిన ఆంజనేయుని జ్ఞాపకార్థం ఆంజనేయ ఆలయము స్థాపించాడు. అతను వరదరాజ స్వామి గుడికిగాను సేకరించిన విరాళమును ఆంజనేయుని గుడి కోసరం ఖర్చు పెట్టడంవల్ల వరదరాజస్వామి భక్తులందరూ స్వామి విగ్రహాన్ని అతని జన్మదినమున అయ్యంగార్ కుళము (తాతాచారి తవ్వించిన కొలను) లోకి తీసుకొని పోవడం అలవాటు అయినది. వరదరాజస్వామి ఒక హస్తములోని అగ్ని హోమమునుంచి పుట్టాడని ప్రతీతి. ఈ ఉత్సవాల సందర్భంగా ఆయన విగ్రహము నడబావి మధ్యవున్న మంటపములోనికి కొనిరాబడుతుంది. ఆ బావి రాతి శిల్పములోనూ, వాస్తు శిల్పములోనూ, ప్రసిద్ధికెక్కినది. ఈ బావి సంజీవరాయర్ గుడికి అతి సమీపములో నిర్మింపబడి వున్నది. ఆ గుడి ద్వారము నుంచి వెళ్ళే కాలిబాటలో వెళితే ఈ బావి వస్తుంది. ఉత్సవ సమయంలో ఈ బావిలో నిండుగా నీళ్ళు ఉంటాయి. దేవుడి విగ్రహమును ఈ బావి మెట్లపైకి తీసుకొచ్చి నీటిలో ముంచుతారు.

## కోడ ఉత్సవము

కన్యాకుమారి సముద్ర తీరములోని మండక్కాడ్ అనే గ్రామములో వున్న భగవతి అమ్మన్ గుడిలో జరిగే ఉత్సవము పేరే కోడ ఉత్సవము. భక్తులు తమ కష్టాలు తీరకపోతే ఆఖరికి ఈ దేవతను ఆశ్రయిస్తారు ఏ వైద్యమూ, నయం చెయ్యని వ్యాధులు సైతం ఇక్కడి కొస్తే నయమవుతాయని అంటారు. ఈ కోడ ఉత్సవం మలయాళ మాసమైన కుంభం (ఫిబ్రవరి - మార్చి) మాసములో ప్రారంభమైన ఆ నెలలో వచ్చే చివరి మంగళవారం రోజున సమాప్తమవుతుంది, కేరళ రాష్ట్రము నుంచి ప్రజలు కాలినడకన్న

ప్రయాణము చేసి ఈ దేవతను కొలుస్తారు. ఈ దేవతకు బియ్యము, మిరియాలు, బెల్లము, పసుపు, బొమ్మలు ఇంకా కొయ్యతోనూ, వెండితోనూ చేసిన అవయవముల ప్రతి రూపాలూ కానుకగా సమర్పిస్తారు. చివరిరోజు అర్ధరాత్రివేళ ఆ గుడిలోని పూజారి ఒడుక్కపూజ అనే ప్రత్యేక ప్రార్థనలు జరుపుతారు. అప్పుడే అందరూ భయవినమ్రులై నిశ్శబ్దముగా ఉంటారు. నిమ్మరసము, పసుపు మున్నగు పూజా ద్రవ్యములతో చేసిన పవిత్ర ద్రవము దేవికి నివేదిస్తారు.

## కుంభాభిషేకము

కొత్తగా కట్టిన దేవాలయమున కానీ, పునర్నిర్మింపబడిన దేవాలయమున కాని గర్భగుడి పైని కుంభమును లేక రాజగోపురము పైనున్న కుంభమును గాని పవిత్ర తీర్థములో అభిషేకించడమే కుంభాభిషేకము. ఈ ఉత్సవమును చాలా పవిత్రమైన సుదినముగా జరుపుతారు. దీనికి ఆయత్తము కావడానికి మునుపు యాగశాలలు మండలాభిషేకము మున్నగు తంతులెన్నో జరుపుతారు.

తమిళనాడులోని దేవాలయములు పరిమాణములో చాలా పెద్దవి. ఏక కాలంలో ఒక దేవాలయం పూర్తి స్వరూపమును చూడటం మాట అటుంచి, ఊహించడం కూడా కష్టమే. దూరము నుంచి చూస్తే దేవాలయము గోపురముల సమూహామువలె కన్పిస్తుంది. కాని దగ్గరికెళ్ళే కొద్దీ దాని వాస్తవ పరిమాణం తెలుస్తుంది. ఈ కుంభాభిషేకము సమయములో ప్రజలందరూ మూక ఉమ్మడిగా ఈ గుడి గోపురములను చూడటం జరుగుతుంది. చాలా కోలాహలముగా జరిగే ఈ ఉత్సవాలపట్ల ప్రజలు ఎంతో ఆసక్తి చూపుతారు.

తమిళుల విశ్వాసము మేరకు ఈ విశాల విశ్వము పంచభూతములయిన, భూమి, నీరు, అగ్ని, గాలి మరియు అంతరిక్షములతో నిర్మింపబడియున్నది. వీటిలో ఒక్కొక్కటి ఒక్కొక్క శాశ్వత ప్రమాణమునకు ప్రతీకగా పేర్కొనబడుతుంది. భూమి ఐశ్వర్యమునకూ, నీరు జీవనాధారానికీ, అగ్ని మేధస్సుకూ,

గాలి ఆత్మ విచారమునకూ, అంతరిక్షము ఆధ్యాత్మిక చింతనకూ, ప్రాతినిధ్యం వహిస్తాయి. పూజా తంత్రములలో ఈ పంచభూతములు ఒక్కొ రంగుతో అన్వయింపబడతాయి. భూమికి పసుపు రంగూ, నీటికి తెలుపు, అగ్నికి ఎరుపూ, గాలికి నలుపూ, అంతరిక్షమునకు నీలమూ, ఆపాదింపబడతాయి. గాలీ నీరూ లేకుంటే భూమిపైన జీవించడము అసాధ్యము. కాబట్టి పూజా పునస్కారములలో గాలికీ, నీటికీ అత్యంత ప్రాముఖ్యత ఇవ్వటమయింది.

ఈ కుంభాభిషేకము నీటికి సమున్నత స్థానం ఇస్తుంది. భక్తుల చేత వివిధ పవిత్ర నదులలో నుంచి సేకరింపబడిన జలములు పువ్వులతో అలంక రింపబడిన కుంభములలో ఉంచబడతాయి. ప్రత్యేకముగా నిర్మింపబడిన పందిళ్ళలోని యాగశాలల్లో ఈ కుంభములకు పూజలు జరుగుతాయి. ఈ పవిత్ర జలములను ఉద్దేశించి మంత్రాలు వల్లిస్తారు.

ఈ పవిత్ర జలములను గుడి గోపురముపై గుమ్మరించుటే కుంభాభి షేకము. ఈ క్రతువు దేవాలయ నిర్మాణముతో ప్రజలకున్న పవిత్రభక్తిని వెల్లడిస్తుంది. దీని మూలంగా ప్రజలలో తమ తమ హృదయాలలో పవిత్రత సాధించాలనే ఆధ్యాత్మిక చింత పెరుగుతుంది.

ఈ కుంభాభిషేకము గర్భగుడిని అప్పుడప్పుడు సరి చూసుకోవడానికి కూడా ఉపకరిస్తుంది. విగ్రహములు పటిష్టముగా ఉండటానికి వాటిని పీఠముల పైన అష్ట బంధనం చేస్తారు. ఈ అష్టబంధనంలో లక్క, సున్నము, ఎర్రప్రత్తి, కొవ్వు, గేదెవెన్న మున్నగు ఎనిమిది రకాలయిన వస్తువులను వినియోగిస్తారు. ఈ మిశ్రమమును తయారుచేసే పనివారు పవిత్ర స్నానము ఆచరించి భక్తిగీతములు ఆలపించిన తర్వాత ఈ పనిని మొదలు పెడతారు.

కుంభాభిషేకములకు బహుళ ప్రజాదరణ గలదు. ప్రజలు ఈ ఉత్సవ ములను చూసేందుకు తండోపతండములుగా గుమికూడుతారు. నిరక్షరాస్యులు ఒక గుడిలో జరిగిన కుంభాభిషేకమును ఆధారముగా జనాభా లెక్కలవారికి పుట్టినతేదీలు ఇవ్వడమూ, తమ ఇంట్లో జరిగినపెళ్ళి ఎప్పుడు జరిగిందో

నిర్ణయించి చెబుతుంటారు. కోర్టులలో సాక్ష్యములు చెప్పేటప్పుడు కూడా ఈ కుంభాభిషేకములను ఉటంకిస్తారు.

కుంభాభిషేకములో అందరూ కలుసుకు టారు. పరిసర ప్రాంతములలో ప్రజలు బాజా భజంత్రీలతోనూ, ఆళవట్టము అనే రంగురంగుల పురాణ చిత్రములతోనూ పెద్ద పెద్ద దేవాలయ ఛత్రములతోనూ ఈ ఉత్సవములో పాల్గొంటారు.

ప్రజలు దూరదూరములనుంచి కాలినడకనూ ఎడ్లబండ్లలోనూ, తదితర వాహనములలోనూ తరలి వస్తారు. వారిలో కొందరు చద్దన్నము తెచ్చుకుంటారు. కొందరు వంట సామగ్రి తెచ్చుకుని మార్గమధ్యములో నదీ తీరాలలోగాని సత్రములలోగాని వండుకుతింటారు. కుంభాభిషేకమును దర్శించడం వల్ల దేవుని ఆశీర్వాదము తప్పక లభిస్తుందని నమ్ముతారు.

ఈ కుంభాభిషేకము గురించి ఒక చిన్నకథ వాడుకలో నున్నది.

కుంభాభిషేకమునకు వెళ్ళివచ్చిన వ్యక్తి రానివ్యక్తిని చూసి "నువ్వు చాలా అరుదైన దైవకార్యమును చూడక పోవడం దురదృష్టం'' అన్నాడట.

అందుకు రెండోవ్యక్తి "నా శరీరము మాత్రమే ఇక్కడ ఉంది. నా మనస్సంతా కుంభాభిషేకముపైననే లగ్నమై ఉంది. దేవుడి ఆశీర్వాదములు నాకు తప్పక దొరుకుతాయి. కానీ నీ దేహం మాత్రమే కుంభాభిషేకములో నున్నది. నీ మనస్సంతా ఇంట్లోని పిల్లలపైనా సామగ్రులపైనా లగ్నమై ఉంది. నువ్వు వెళ్ళినా వెళ్ళనట్టే లెక్క" అన్నాడట.

## క్రైస్తవ పండుగలు

తమిళనాడులో అనేక క్రైస్తవ పండుగలు వాడుకలో వున్నాయి. వాటిలో మేరీకన్య పేరిట జరిగే వేళాంగన్ని పండుగ అతిముఖ్యమైనది. ఈ ఉత్సవములు ప్రతి ఏడాది ఆగస్టు 28నుంచి సెప్టెంబర్ 10దాకా జరుగుతాయి. ఇందులో కేథలిక్కులు, ఇతర క్రైస్తవులు పాల్గొనడమే కాక భారత

దేశములో నలుమూలలనుంచీ ఇతర మతస్థులూ, మలేషియానుంచి వచ్చే యాత్రికులూ పాల్గొంటారు.

మేరీకన్యను కొలిస్తే అనుకున్న పనులు నెరవేరుతాయట. ఇలా అనేక కట్టుకథలు ప్రచారములో వున్నాయి. ఈ దేవాలయమునకు వివిధ జాతుల వారు రోజూ వేలసంఖ్యలో వస్తుంటారు. కొన్ని సందర్భాలలో కానుకలు సీలువేసిన సీసాల ద్వారానూ, వెదురు బొంగులలోనూ పంప బడుతాయి. వాటిపైన మేరీకన్య చిరునామా రాసి సముద్రములో పడవేస్తారు. ఆ వస్తువులు ఏ తీరములో దొరికినా సమీపములోని చర్చిలోకి తీసుకొని వెళ్ళి ప్రతిష్ఠింప బడుతాయట.

## ముస్లిమ్ పండగలు

తిరునెల్వేలి జిల్లాలోని పొట్టల్‌పుదూర్‌లోని ప్రాచీన మశీదులో ముస్లిమ్ నెలయైన రబి-ఉస్-సానిలో కందూరి ఉత్సవం జరుగుతుంది. ఈ మశీదు తంజావూర్ జిల్లాలోని నాగూర్ మశీదు సరిసమముగా భావింపబడుతుంది. పొట్టల్ పుదూర్ మసీదు మొహిద్దీన్ ఆండవర్ అనే మహమ్మదు ప్రవక్త యొక్క అనుయాయుని సంస్మరణార్థము నిర్మింపబడింది. దీనిని ఒళివిల్లా కాదరి అనబడే శిష్యుడు నిర్మించినట్టు చెప్పబడుతుంది. పొట్టల్ పుదూర్‌లో పదకొండు రోజులు కొనసాగే ఈ ఉత్సవాలలో మసీదులో దినవారి ప్రార్థనలు జరుగుతాయి. తిరునెల్వేలి జిల్లాలోని పలు ప్రాంతములనుంచి ప్రజలు తండోపతండాలుగా వస్తారు. ఈ ఉత్సవాలలో జరిగే తంతులన్నీ ఇంచుమించు హిందూ ఆచారములను పోలి ఉంటాయి. పసుపూ, నెయ్యి, చందనమూ, కలిపి తయారుచేసిన పవిత్ర భస్మమును భక్తులకి ప్రసాదముగా ఇస్తారు. ప్రజలు తమ మొక్కుబడులను చెల్లించుకుంటూ, డబ్బులూ, వెండి నాణెములూ, కానుకలు చెల్లిస్తారు. ఇక్కడి కొచ్చే భక్తులు తమ శరీర బాధలు నివృత్తి కోసరం ఆండవర్‌ను మొక్కుకుంటారు. ఇక్కడ పొట్టేలూ, కోడి పుంజులూ బలి అవుతాయి. చందన ద్రవ్యమును దేవుడికి నివేదించిన

తర్వాత ఆసక్తితో ఎదురుచూస్తున్న హిందూ ముస్లిమ్ భక్తులకు ప్రసాద రూపంలో పంచి పెడతారు. నాగూర్‌లో "హజరత్ సయ్యద్ షాకు హమీద్ కాదర్‌వలి" అనే మత గురువుకు గర్భగుడి వుంది. అతను మత విచక్షణ పాటించకుండా తన అనుగ్రహమును అందరికీ అందిస్తాడని ప్రతీతి. ఇత నిని గురించి ఏన్నో అద్భుతాలు చెప్పుకుంటారు. ఒకసారి మునిగిపోతున్న ఓడను రక్షించాడట.

ఇక్కడ నివేదింపబడే పూజా ద్రవ్యములలో పువ్వులు, చందనము, గోధుమరంగు చక్కెర సాంబ్రాణి మున్నగునవి చోటు చేసుకుంటాయి. డబ్బులు కూడా కానుకగా ఇస్తారు. ఈ ఉత్సవాలలో ఒకరోజున మతగురువు శిష్యులలో ఒకరిని పీర్‌గా గుర్తించి పీర్లపండుగ జరుపుతారు.

పదో రోజున మత గురువు గోరిని గంధముతో అభిషేకిస్తారు. చంద నమును ఒక వెండి పళ్ళెములో నుంచి చందనక్కూడు (చందనపు గూడు)తో పెడతారు. ఖలీఫా అనే పూజారి ఈ అభిషేకమును జరుపుతాడు. ఆ తర్వాత అతను మూర్ఛ చెందడమూ ఆతనిని పోలీసు బందోబస్తులతో ఇంటికి కొని పోవడమూ జరుగుతుంది. అతనికి తిరిగి స్పృహవచ్చిన తర్వాత అతను నిరీ క్షిస్తున్న జనులకు చందనము ప్రసాదముగా పంచుతారు.

## సంతలు

పూర్వంనించీ జరుగుతున్న ఈ సంతలు ఉత్సవాలను అంటి పెట్టుకుని జరుగుతాయి. ప్రజలు తమ వస్తువులను అమ్మడానికీ, కావలసినవి కొన డానికీ, ఈ సంతలు బాగా ఉపకరిస్తాయి. ప్రస్తుతము ఈ సంతలు టోకు వ్యాపారస్తులకు, బాగా పనికి వస్తున్నాయి. తమిళనాడులో జరిగే సంతలలో ప్రతి బేస్తవారం జరిగే పొళ్ళాచ్చి సంత అతి ప్రాముఖ్యత వహిస్తుంది. ఆ రోజున పొళ్ళాచ్చి ప్రజలతో క్రిక్కిరిసి వుంటుంది. ఆనమలై కొండలు, ఫాల్‌ఘాట్ పొళ్ళాచ్చి లోయలు మున్నగు చోట్ల ఉత్పత్తి అయ్యే వస్తువుల

క్రయ విక్రయాలకు ఇది అతి ముఖ్యమైన వ్యాపారకేంద్రము. ఇక్కడ అమ్మకానికొచ్చే వాటిల్లో వడ్లు, దుస్తులు, పప్పు దినుసులూ, కొబ్బరికాయలు వేరుసెనగలు, నూనె దినుసులు పళ్ళు, కాయగూరలు, మృగ చర్మములు మరియు కోళ్ళు మున్నగునవి ప్రాముఖ్యం వహిస్తాయి. ఇక్కడ పరిసరపు అడవులలో పట్టుబడిన ఏనుగులూ, కలప కూడా అమ్మకానికొస్తాయి. తమిళుల లోకోక్తి ఏమిటంటే వాళ్ళొచ్చి సంతలో తల్లిదండ్రుల్ని మినహాయించి అన్నీ కొనవచ్చునట.

కన్యాకుమారి జిల్లాలోని వడచ్చేరిలో కనకమూలం అనే సంత గలదు, గురు శనివారములలో జరుగుతుంది. ఇక్కడ కొనే కాయకూరలు కరివేపాకులు తమిళనాడు, కేరళలోని వివిధ ప్రాంతములకు రవాణా అవుతాయి. అదే జిల్లాలోని ఇరనియల్ అనే ఊళ్ళో సోమవారం సంత జరుగుతుంది. అక్కడ చేనేతవస్త్రాలూ, పశువులూ, కోళ్ళూ అమ్మకానికొస్తాయి.

తిరువణ్ణామలైలో కార్తీక దీపం ఉత్సవము పురస్కరించుకుని జరిగే పశువుల పరిష నాలుగు రోజులపాటు చాలా కోలాహలంగా జరుగుతుంది. ఇక్కడికి సుమారు 20,000 పశువులు వస్తాయి. ఆవులు, గేదెలు, ఎడ్లు గొర్రెలూ మేకలూ, గుర్రాలూ మొన్నగు అన్నిరకాల జంతువులు వస్తాయి.

చిత్తిరై ఉత్సవమును పురస్కరిచుకుని మధురైలో జరిగే సంత అక్కడి రైతులకు అతి ముఖ్యమైనది. గ్రామీణప్రజలకు సంతలు లేకపోతే జీవితమే సాగదు స్త్రీలు తమ యాత్రల జ్ఞాపకార్థం ఈ సంతలలో తప్పనిసరిగా ఏవో కొన్ని వస్తువులు కొంటారు.

# 6వ అధ్యాయము

## జానపద సాహిత్యము

తమిళంలో గ్రంథస్తమైన సాహిత్యము అతి పురాతనమైనది. కానీ తమిళ జానపద సాహిత్యము ఇంకా ప్రాచీనమైనది. పూర్వకాలపు పురాణములను పరిశీలిస్తే అవి ఒక్కొక్క తరం నుంచి మరో తరంవారికి నోటిపాఠంగా సంక్రమిస్తూ వచ్చేవని తెలుతుంది. తట్టుత్తొగై పదినెణ్ కీళ్ కణక్కు లాటి ప్రాచీన గ్రంథములన్నీ తరువాతి కాలంలో గ్రంథస్థలము చేయబడినవే.

### ఆశుకవులు

ఆ కాలంలో ఆశువుగా కవిత్వం చెప్పేవారిని పాణర్, కూత్తర్ పొరునర్, వారాళియార్, పులవర్, అగవనర్, అని పెక్కు పేర్లలో వ్యవహరించేవారు. వారు తమ కవిత్వాన్ని వెల్లడించడానికి నోరూ, నాలుక మాత్రమే ప్రచార సాధనాలుగా వాడుకున్నారు. కవిత్వ రచన, ప్రసారము. పఠనము అన్నీ వ్యావహారికంగానే సాగేవి. తర్వాత కాలంలో సాహిత్యం గ్రంథస్థం కావడం మొదలయింది. ఈ ఆశుకవులు స్థానిక చరిత్రద్వారానో, జన ప్రచారముగల కథలనుంచో ప్రభావితులై తమ భావాలను పెంపొందించుకునే వారు. చక్కగా గానం చెయ్యడంలో పాణర్ కవులు సుప్రసిద్ధులు. వారు పిల్లనగ్రోవికి అనువుగా కవితలు చెప్పేవారు. మామూలుగా చిన్న పిల్లన గ్రోవి వాయించేవారు. ఒక్కొక్కప్పుడు పెద్దవి కూడా ఉపయోగింపబడేవి. పొరునర్ కవులు డోలు వాయిస్తూ తమ కవితలు పాడేవారు. వాళ్ల కవిత్వము లలో వ్యవసాయము మొదలుకొని రణరంగములదాకా అన్నివిషయాలు చోటు చేసుకునేవి.

## గ్రంథస్థ సాహిత్య ప్రభావము

వ్యవహారిక సాహిత్యము, గ్రంథస్థసాహిత్యము పరస్పరము ఒకదానినొకటి ఆశ్రయించుకుని పురోగమించాయి. గ్రాంధిక సాహిత్యములోని భావములు, కథలు తదుపరికాలంలో వ్యావహారిక సాహిత్యంలోనూ చోటు చేసుకునాయ్ను. అలాగే శిల్పములలోనూ శైలిలోనూ వ్యావహారిక సాహిత్యపు పోకడలు గ్రాంధిక సాహిత్యమును ప్రభావితంచేశాయి.

తొల్కాప్పియర్ సైతం జానపద గీతముల ప్రాముఖ్యమును గుర్తించి వున్నారు. అతను చంధస్సు గూర్చి వ్రాసిన అధ్యాయములో జానపద గీతములను గురించి ప్రస్తావించి వున్నాడు వానిని వాయ్మొళిగళ్ (నోటి పాటలు) అని పేర్కొన్నారు.

ఇళంగో అదిగళ్ విరచితమైన సిలప్పదికారం కావ్యంలో ఆకాలపు సముద్రతీరప్రజలు, వేటగాళ్ళు, పశుకాపర్లు కొండప్రాంతపు పడుచుపిల్లలూ పాడుకునే పాటలు ఉటంకింపబడివున్నాయి. కణ్ణగి కథ తమిళ జానపద సాహిత్యంలో ఇప్పటికిని బహుళప్రచారములో వున్నది. కేరళ జానపద గాధల్లో ఆవిడ భద్రకాళి అని పేర్కొనబడినది. మలయాళ సాహిత్యములో కణ్ణగిని కీర్తించే అనేక తందాన పాటలు వాడుకలోవున్నాయి. కాదుంగ నల్లూరులో జరిగే పరశి పండుగలు సిలప్పదికారమును గుర్తు చేస్తాయిట. తమిళనాడులో కోవలన్. కణ్ణగి పేరుతో ప్రచారములో వున్న కథ సైతము ఈ సిలప్పదికారం కావ్యమునుంచి అనూదితమైనదే. సిలప్పదికారం చదువని సామాన్యజనులకు కోవలన్ కణ్ణగి కథ జానపద సాహిత్యము మూలంగానే తెలుసు.

ఈ జానపద గీతములు జాతీయకవి అయిన సుబ్రమణ్య భారతిని ఎంత గానో ప్రభావితం చేసాయి. కర్షకులు పాడుకునే పళ్ళుప్పాట్టు అనే జానపద గీతం చంధస్సులో ఆయన స్వతంత్ర పళ్ళు అనే కవితలు రచించారు. కుమ్మి

అనే మరో జానపదపు మెట్టు (బాణీ) ఆయన స్త్రీ జనోద్ధరణకోసరం రాసిన కవితలలో చోటు చేసుకుంది. అతని పాట పుదియకోణంగి (కొత్తవిదూషకుడు) నిజానికి జానపదములలో విదూషకులు పాడే చంధస్సులోనే సాగింది. కణ్ణన్ ఎన్ కాదలి (కృష్ణయ్య నా ప్రేయసి) అనే అతని కావ్యము లోని తంగమే తంగమ్ పాట, ఇంకా ఉలగత్తు నాయకియే ఎంగళ్ ముత్తుమారి అనే పాట పల్లెపదాలు ఆధారముగా విరచితమైనవే. ఇలా సామాన్య ప్రజల గీతములను తన రచనలలో అనుకరించడం వల్లనే సుబ్రమణ్య భారతి జన బాహుళ్యంలో ఎంతో సుపరిచితుడయ్యాడు.

## వ్యావహారిక సాహిత్యం తీరుతెన్నులు

గ్రాంధిక భాషలో 'వరుగిరదు' 'పోగిరాదు' అనే వర్తమాన క్రియాపదములు వ్యావహారిక సాహిత్యములో 'వరుదు' 'పోగుదు' అని వాడుకలో వున్నాయి ఇలాగే గ్రాంధిక భాషలో అడిత్తల్, పిడిత్తల్, వైత్తల్ లాంటి క్రియాపదములు వ్యావహారికలో 'అడిచ్చల్, పిడిచ్చల్, వచ్చల్' అని వ్యవహరింపబడతాయి.

వ్యావహారిక భాషలో వ్యక్తులకు పేర్లువుండవు. మారు పేర్లు ఉంటాయి. కొన్ని మారుపేర్లు ఒంటిరంగులో ఇతర అంగలక్షణములలో ఆధారం చేసుకుని ఉంటాయి. మరికొన్ని గ్రామములలో ఇంటి ఉనికినిబట్టి వస్తాయి. కొందరికి స్కూల్లో వ్యవహరింపబడిన పేర్లూ, ఆస్తులను సూచించే పేర్లూ స్థిరపడితే మరికొందరికి తమ భార్య పుట్టిన గ్రామమునూ, ఆమె స్థూలకాయమును గుర్తుచేస్తూనో పేర్లు వస్తాయి. కొందరు వాళ్లు ధరించే దుస్తుల పేర్లతోనూ తలపాగా పేర్లతోనో లేదా వాళ్ళ ఉద్యోగ వ్యాపారం చేసే స్థలముల పేర్లుతోనో పిలవబడతారు.

జానపద వ్యవహారములలో విశేషణములూ, అతిశయోక్తులూ విరివిగా వాడుతారు. వాగ్వాదంలో ఒక వ్యక్తి చాలా ఘాటుగా మాట్లాడితే "కొణ్ణుట్టాన్" (చంపేశాడు) అని అనడం కద్దు. గ్రామీణ వాతావరణంలో పెరగడం

గడం వల్ల వారు "నిరంబ" అనే పదాన్ని "రొంబ" (అమితము) అనీ, "ఇరవు" (రాత్రి) అనే పదాన్ని "రావు" అనీ "ఇరక్కై" (రెక్క) అనడానికి రక్కై అనీ వ్యవహరిస్తుంటారు.

వ్యావహారిక సాహిత్యమునకు సంబంధించిన కొన్ని ఉదాహరణలు క్రింద పొందు పరచబడ్డాయి

## సంభాషణలు, జానపదగాథలు

ఒక శైవుడు వైష్ణవుడూ ఉండేవారు. శైవుడి కొక ఆవు ఉండేది. పాలకుండను బయటకి తీసేటప్పుడు ఆ ఆవు తన్నడంలో పాలంతా చింది పోయేది. ఈ ఆవును అమ్మేయాలని అతను తీర్మానించాడు. వైష్ణవుడిదగ్గర జత ఎడ్లు ఉన్నాయి. అవి బండి లాగటానికి ససేమిరా పనికిరావడంలేదు. అతను తన ఎడ్లని అమ్మేయాలని నిశ్చయించాడు. ఎలాగయితేనేం శైవుడూ వైష్ణవుడూ ఒకర్ని గురించి ఒకరు ఎరుగకపోవడంవల్ల తమ జంతువులను మార్పిడి చేసుకున్నారు. కొన్ని నెలల తర్వాత వాళ్ళిద్దరూ కలుసుకున్నప్పుడు కొత్త యజమాని దగ్గర తమ జంతువులు కాస్త మెరుగ్గా ఉండొచ్చునని అనుకున్నారు. కానీ వాళ్ళ ఊహ నిజంకాదు. మునుపటిలాగే ఆవు పాలకుండను తన్నుతూనేవుంది. ఎడ్లూ మొండికేస్తూనే వున్నాయి. ఎడ్లని మార్చుకున్న శైవుడు "నేను వాటిని బండికి కట్టాలంటే శివాశివా! ఇటు నుంచి అటు అటుమార్చాలంటే శివ శివా! నేనెలా వేగనయ్యా? అని అడిగాడుట.

వైష్ణవుడు అదే హాస్య ధోరణిలో "నేను పాలు పిదకాలని ఆవు దగ్గరి కెళ్ళానా పళ్ళు ఊడేలా తంతుంది గోవిందా! గోవిందా!" అన్నాడట.

## ఆస్తిక నాస్తిక సంవాదము

ఒక ఆస్తికుడూ నాస్తికుడూ తలొక దోవలో వెళుతున్నారు. ఆస్తికుడు గుడిలోకి వెళ్ళి దేవుణ్ని ప్రార్థించిన తర్వాత తన పనిమీద వెళుతుంటే మ్యా

మధ్యంలో ఆతనికాలికి రాయి తగిలి బొప్పికట్టింది. నాస్తికుడికి దోవలో ఒక రూపాయి దొరికింది. నాస్తికుడు ఆస్తికుణ్ని కలుసుకున్నప్పుడు "నేను దేవుణ్ని నమ్మను. అయినా నాకు డబ్బు దొరికింది. కానీ దేవుణ్ని నమ్మే నీ కాలికి దెబ్బ తగిలింది" అంటూ అపహాస్యం చేశాడుట.

అది విన్న ఆస్తికుడు "నేను ఒక పాము కాటుకు గురి అయి చనిపోవలసినది. నా దైవభక్తి వల్లనే దేవుడు నన్ను ప్రాణాపాయమునుంచి రక్షించి కేవలం చిన్నగాయంతో బ్రతికి బయటపడ్డాను. కానీ నీలాంటి అదృష్టవంతుడికి ఇంకా ఎంతోడబ్బు దొరికి ఉండాలి. నీకు విశ్వాసము లేనందువల్లే కేవలం ఒక్క రూపాయితో సంతృప్తి పడుతున్నావు. లేకుంటే నీకు ఏ కోశాగారమో బంగారుగనియో దొరికి ఉండాల్సింది" అన్నాడట.

## జ్యోతిష్కుడి కథ

ఒక జ్యోతిష్కుడి జోస్యములన్నీ ఫలిస్తున్నందున అతనికి పేరుప్రఖ్యాతులు లభించాయి. ఒకసారి తన ఆవు దొంగతనం పోయినదంటూ ఒక వ్యక్తి ఆ జ్యోతిష్కుడి దగ్గరికొచ్చాడు. జ్యోతిష్కుడు ఫలానా రోజున నీ ఆవు నీ ఇంటికి తిరిగొస్తుందని జోస్యము చెప్పాడట. తరువాత అతను ఆ ఆవు గుర్తులుతెలుసుకుని తన పేరును కాపాడుకోవడం కోసరం సరిగా అలాటిదే మరొక ఆవును కొనితెచ్చి నిర్ణీతదినము అర్ధరాత్రివేళ ఆ వ్యక్తి ఇంట్లో దాఖలుచేశాడట.

## మద్రాసుగురించి జానపదగాథలు

గ్రామీణ ప్రాంతములనుంచి మద్రాసు నగరమును సందర్శించే ప్రజలు అచ్చటి పెద్ద పెద్ద భవనములనుచూసి ఆశ్చర్యపోతుంటారు. అవన్నీ కాలేజీలు (మ్యూజియం) అనుకునేవారు. వాళ్ళు జంతుప్రదర్శనశాలను ఉయిర్ కాలేజీ (బ్రతికిన కాలేజీ) అనీ వస్తుప్రదర్శనశాలను (ఇక్కడ జంతు కళేబరములు కూడా ఉంటాయి.) 'సెత్తకాలేజీ' (చచ్చిన కాలేజీ) అనీ వ్యవహరించడం



Plate VII కావడి నృత్యం

కద్దు. 1942లో జపానువారు బాంబు వేస్తారని భయపడి మద్రాసు నగర వాసులు చాలా వరకు ఇళ్ళు ఖాళీచేసి వెళ్ళిపోవడంవలన To Let (బాడుగకు ఇవ్వ బడును) For Sale (అమ్మకానికి సిద్ధము) మున్నగు బోర్డులు అనేక భవనముల ముందర వేలాడుతుండేవి. ఆ సమయాల్లో మద్రాసును సందర్శించిన పల్లెప్రజలు ఆ బోర్డులలోవి ఆంగ్లేయుల పేర్లనుకుని మిస్టర్ "టూ లెట్" గారికి ఉన్నన్ని భవనాలు మిస్టర్ "ఫర్ సేల్" గారికి లేవని తీర్మానించేశారు:

## రైతుల పాటలు

జానపదగీతములలో వ్యవసాయమునకు సంబంధించినవి చాలావున్నాయి. వ్యవసాయ పనులలో గ్రామీణ ప్రజలు పాడే పాటల్లో ఆ రకాలున్నాయి.

## ఎట్ర పాట్టు (ఏతాము పాట)

ఈ పాటను ఏతాము తొక్కుతున్నప్పుడు పాడుతారు. తంజావూరు డెల్టా ప్రాంతములో ఒకసారి మహాకవి కంబర్ ఈ ఏతాము పాట విని మిక్కిలి సంతోషించాడట. ఈ పాట వెదురు ఆకులపైన మెరిసే మంచు బిందువులను ఉద్దేశించి పాడే పాట అది తన కిరణాలతో మంచుబిందువుల్ని ముద్దాడే సూర్యుని శ్లాఘిస్తుంది. ఒక పురాతన లోకోక్తి అనుసారం ఏతాము పాటకు ఈడైన పాట లేనే లేదు (ఏట్ర పాట్టుక్కు ఎదిర్ పాట్టు ఇలై)

పంటల నూర్పిడి సమయంలోనూ పైర్లనాటకాలలోనూ దుక్కిదున్నే టప్పుడూ విత్తనాలు చల్లేటప్పుడూ ఒకరుగాని అందరూకలసిగాని అనేకపాటలు పాడుతారు. వాటిలో దేవుడు అధిక పంటలు ఇవ్వాలనే కోరిక చోటు చేసుకుని ఉంటుంది. శివుని అతని పుత్రులయిన వినాయకుని, షణ్ముఖుని, స్తుతించే పాటఒకటి (తమిళంలో పిళ్లయారేవారుం అనిప్రారంభమవుతుంది.)

రావయ్యా శివనందనా
సేవించాము నిన్నే

వేప్ (ఈటె) నామధేయుడా
వేడుకున్నాము నిన్నే
కురిపించు వానలు
కురిపించు ఓ కలియపెరుమాళ్ల!
అదనులో వాన పడితే
అంది వస్తాయి పాడి పంటలు
దినమూ వాన పడితే
తిండి గింజలు చేతికొస్తాయి.
వేలాయుధ, షణ్ముఖ
కుంద్రక్కుడి దేవుడా,
కుర త్తి (వళ్ళి) మనోహరుడా
అరణ్య నాయకా నువ్వే
శరణ్యమని నమ్మాము
నీ కీర్తిని స్తుతిస్తుంటే
మా కష్టాలు తొలగిపోయేను.

## పైరు నాటకం పాట

అడుక్కి నడుంగోడి అళగుసంబా
నాట్ర ఎడుత్తు............

అంటే సంజా నారను బాగ దగ్గర దగ్గర నాటండి అని అర్థము.

రైతాంగము అనేక సామెతలకు కారణభూతులైనారు. ఎచ్చవన్ ఎళ్లు విదై కాళుత్తవన్ వాళ్లు విదై, వాదినవన్ వరగు విదై, సోట్రుక్కు ఇల్లా దవన్ చోళం విదై" అనే సామెత వాడుకలోవున్నది. అంటే బీదరైతులు జొన్నలు, నువ్వులు లాటి పైర్లు చేయాలనీ, బాగా ఉన్నవాళ్ళు ఉలవలు పంటచేసినా పరవాలేదనిభావం.

"ఆది ప్పట్టం తేడి విదై" అంటే అర్థము రైతులు అదనులో పైరుచెయ్యాలని అర్థము. మిగతా సామెతలు రైతులు ఎలా జాగ్రత్తగా ఉండాలో ఎలా పర్యవేక్షించాలి, ఎలా మార్పిడి చేయడం, ఎలాంటి ఎరువులు వాడాలి- మొదలైన విషయాలను గుర్తు చేసేవిగా ఉన్నాయి. ఇంటికి సమీపంలో చేను ఉంటే మంచిది. అది తక్కువ పంట ఇచ్చినా దూరపు చేను ఎక్కువ పంట ఇచ్చినా రెండూ ఒక్కటే. తన భూమికి ఎక్కువ అనువుగాఉన్న నేలను కొనడానికి ఏనుగు అమ్మవలసి వచ్చినా వెనుదీయరు.

తమిళనాడులోని మిక్కిలి పెద్ద వ్యవసాయ క్షేత్రములలో పాళయంకోట పట్టగారర్స్ క్షేత్రము పేర్కొనదగినది. అతనికి కాంగెయం అనేఊళ్లోనున్న పశుమందలోని కాంగేయంగిత్తలు ప్రసిద్ధికెక్కినాయి. అతను పశువులపోషణ కోసరం ఎక్కువగా ఖర్చుచేస్తారు. అతను కోడెలను మంచి ధరకు అమ్మినా వచ్చేలాభం సిబ్బంది ఖర్చులకే సరిపోదని ఒకజానపద గీతం తెలుపుతోంది. (అనుబంధం చూడుడు). కన్నపురము మరియు తిరుప్పూర్‌లో రథోత్సవ సమయంలో జరిగే సంతలలో ఈ కోడె దూడలు విక్రయింప బడతాయి. ఆ సమయాల్లో అక్కడ తాత్కాలికంగా బస ఏర్పాటు చేసుకుని పదిరోజులు పాటు పట్టగారర్ అక్కడే నివసిస్తాడు. పరిచారకులు, వంట మనుషులు వార్తావహులు, పశుకాపరులూ, ఇంకా ఇతర పరివారము అతనితోబాటు ఉంటారు. అతిథుల కోసరం పుష్కలంగా ఖర్చుచేస్తారు. ఈ విషయాలన్నీ జానపదగీతములలో విశదీకరింప బడ్డాయి. వ్యవసాయంపనులు జరిగేటప్పుడు కొందరు యువతీ యువకులమధ్య ప్రేమ పొడసూపుతుంది. కానీ కొన్ని సమయాల్లో వార్లలో ఒకరు విముఖంగా ఉండటం జరుగుతూంది. "వాడా వెంద్రిలై వదంగా వెట్రిలై" అనే పల్లెపాటను క్రింది విధంగా అనువదింప వచ్చు.

వాడి వట్టిన తమరపాకు
నోటికి రుచించదు.
నిన్న పెట్టిన నాసటి బొట్టూ

నేటిదాకా మెరవదు.
పిచ్చుకలు పొడిచిన పువ్వులను
పెట్టలేము జడలలో
మావ నన్ను కొబ్బరితోటకు
మావ వేల రమ్మన్నాడు
మనసును పోగొట్టుకున్న నేను
మావ నెట్లా కలుసుకోను?

## యాత్రికుల పాటలు

యాత్రికులు సుదూరములనుంచి ప్రయాణం చేస్తున్నప్పుడు పాటలు పాడుతుంటారు. అయ్యప్ప భక్తులు శబరి కొండకు వెళ్ళేటప్పుడు అతని ఘనతను శ్లాఘించే పాటలు పాడుతారు. అలాగే మధురై రామనాథపురం సరిహద్దులోని చతురగిరిలోని మహాలింగస్వామి గుడికి వెళ్ళే భక్తులు "వళి నడైచ్చిందు" అనే పాటను గానం చేస్తారు. ఆ పాటకు 250 చరణాలున్నాయి. ఆ పాటలో మార్గ మధ్యమున వున్న ప్రదేశాలను గురించి స్నాన తీర్థములను గురించి దోవలో వున్న చిల్లర దేవుళ్ళను గురించి మూలికల ఔషధములను గురించి వర్ణింపబడుతుంది. ఈ పాటను భర్త తన భార్యను సంబోధిస్తూ పాడుతాడు. దేవుడి పైన నమ్మకం ఉంచమనీ దైవప్రార్థన జరుపమనీ తన భార్యకు ఉపదేశిస్తాడు.

సిద్ధి ముత్తియై కొడుక్కుం
మహాలింగ నాథరైయుం తంగరత్తినయే
మాట్చిమైయె కుంబిడువోం పొన్నురత్తినమ్
అప్పన్ మహాలింగరుక్కు అన్బుడనే పూజారిగళ్
ముప్పల అభిషేకముందాన్ తంగరత్తివమ్
ముక్కియమా నడత్తుగిరార్ పొన్నురత్తినమ్
అన్బువడివానదొరు ఆనందవళ్ళికోయిల్

మున్నే ఇరుక్కుదు పార్ తంగ రత్తినమే
ముళుదుం నమ్మై కాత్తిడు వాళ్ పొన్ను రత్తినమ్!

ఇలా సాగుతుంది పాట.

"సాలై ఇలే రెండు మరం" అంటూ బాటసారులు పాడే మరో ముఖ్యమైన పాట రహదార్ల లోని చెట్లనుగురించి విపులంగా చెబుతుంది.

సర్కారు వారు నాటిన చెట్లు
చక్కగా పెరిగాయి రోడ్ల పక్కన
ఎత్తుగా దట్టంగా పెరిగిన ఈ చెట్లు
ఎదిరిని ఉరితీయడానికి అనువుగా

## జోల పాటలు

పసి పిల్లల్ని నిద్రపుచ్చటంకోసరం జోలపాటలు పాడతారు. పెరియాళ్వారు శ్రీ కృష్ణుని ఉద్దేశించి పది లాలి పాటలు పాడాడు. ప్రతిపాటా తావేలో అనే మాటతో ముగిస్తుంది. ఆ పాటలు చిన్నా పెద్దా అందరికీ నచ్చుతాయి. జోల పాటలన్నీ చాలావరకు నిరక్షరాస్యులైన స్త్రీలచే కల్పింపబడినవి కావడంవల్ల వాటిలో సహజసిద్ధమైన ఆకర్షణ ఉంటుంది.

ఉదా॥ ఎన్నో నోములు నోచి
కన్నాను నిన్ను ముత్యమా
నిదురపో నిదురపో!
విశ్వానికంతా రాజువు నీవే
మెరిసే ఊయల్లో మెత్తటి పూలపైన
హాయిగా నిద్రపో తల మానికమా!
ఏడవకు ఏడవకు నా తండ్రీ!
ప్రేమతో నిన్నెవరు కొట్టారు బాబూ

విలువైన వజ్రమా, కనుమూసి నిద్రపో!
అన్నము పెట్టే చేతులతో అమ్మకొట్టిందా?
అనునయించే చేతులతో అక్క కొట్టిందా?
పాలుపట్టేచేతులతో బామ్మ కొట్టిందా?
మల్లెపూ చెండుతో మామ కొట్టాడా?
కాటుక దిద్దే చేతితో అత్తకొట్టిందా?
ఎవరు కొట్టారని చెప్పరా తండ్రీ?
చెప్పేసి హాయిగా నిద్రపో బాబూ!

ఈ జోలపాటల భావాలు చిత్ర విచిత్రముగా ఉంటాయి. తల్లులు తమ పిల్లల మనసుల్లో పూర్వీకుల పట్ల గౌరవము పెంపొందించడానికి పూర్వీకుల గుణగణాలను గురించి తమ పాటలలో పొగుడుతూ ఉంటారు. మేనమామ ఐశ్వర్యమునూ, పలుకుబడినీ పొగుడుతూ పాడుతుంటారు. వాళ్లు తాము ఎన్ని నోములు నోచింది లాలి పాటల్లో విశదీకరిస్తారు:-

పారిజాతము నంజలి చేసి
బజారులో పడిగాపులు పడినాను
దేవత నాపైకనికరించగా
నీవు జన్మించినావు
సోమవారము స్నానమొనర్చి
నోము నోచాను రెండు దినములు
శుక్రవారము స్నానమొనర్చి
స్తోత్రములు చేశాను పెక్కు రోజులు
తైపూసము రోజున స్నానం చేస్తే
నాపై కరుణించెను దేవుడు.
శ్రీ రంగ సెందిల్ దేవుల కంఠ
హార పుష్పము నీవే
శివుని వరప్రసాదము నీవే

ఈ క్రింది పాటలో ఒక తల్లి తన కుమారునికి సుభిక్షమైన జీవితం అమరాలని కలలు గంటుంది:-

పట్టు గొడుగు పట్టుకుని నువ్వు చేను
గట్టుమీద అజమాయిషీ చెయ్యాలి.
ముత్యాలు పొదిగిన గొడుగులో నువ్వు
మొలకెత్తే పైరును పర్యవేక్షించాలి?

దిష్టి తగులుతుందని భయపడి ఒక తల్లి తన బిడ్డను తలుపులు వేసుకోమని ప్రాధేయ పడుతుంది:-

కాచుకో నా తండ్రీ - ఎందరెందరో
కన్ను వేస్తారు - తలుపులన్నీ
మూసుకో నా తండ్రీ!

ఈ క్రింది జోలపాట వినసొంపుగా ఉంటుంది.

ఏడు సముద్రాలలో వెతికి
ఈ తామర పువ్వును తెచ్చాము.
పది సముద్రములలో గాలించి
షదిలంగా తెచ్చాము ఈ పద్మము
ముద్దాడి మురియడానికి ఎంతో
మురిపంతో తెచ్చాము ఈ తామర.
లాలించి పాలించడానికి ఎంతో
లలితంగా తెచ్చాము ఈ పువ్వు.
వండలి ఇసుకను తోసుకుంటూ
వైగైనది ప్రవహిస్తోంది
ఓలలాడే అలలపైనా
తేలి వచ్చెనా ఈ ముత్యము?
ఉరకలేసే వరదలోంచి

దరికి చేరెనా ఈ గంధము?
ఇది గంధమో నా భాగ్యమో?
ఈశ్వరుని వరప్రసాదమో?

ఇక్కడ ఇంకో లాలిపాటకుడా ప్రస్తావించవలసి ఉన్నది.

గాజుల సెట్టీ రావయ్యా
కాస్సేపు సేద తీర్చుకో
నీ చెంత నా 'వళ్లికి'
నీలం గాజులున్నాయా?
ముచ్చటగా సరిపోయే
పచ్చ గాజులున్నాయా?
'వళ్ళి'కి చక్కగా కుదిరే
వంకె గాజులున్నాయా?
మనస్సుకు నచ్చే, పచ్చగాజున్నాయా?

## బాలల పాటలు

జోల పాటలు పాడే వయస్సుదాటాక పిల్లలు లెక్కించడం నేర్చుకుంటారు, అలాంటి లెక్కల పాట ఒకటి.

ఒకటీ, రెండూ, గులాబి పువ్వూ
మూడూ, నాలుగూ మూల్లో పడుకో
ఐదూ, ఆరూ, అదుగో అన్నం,
ఏడూ, ఎనిమిదీ, ఇదుగో లడ్డూ
తొమ్మిదీ, పదీ దొరకొద్దు 'మీనా'

పిల్లల్లో చిన్నవయస్సులోనే దైవచింతనము పెంపొందించే పాటలున్నాయి.



Plate IX బొమ్మల గుర్రం నృత్యం

**Plate X ''జల్లికట్టు'' నృత్యం**



ఉదా॥ హరి యిన్ను పాయ్ విరిచ్చు
అచ్యుతన్ను పేర్ సొల్లి
క్రిష్టాన్ను పడుత్త వరుక్కు
కేడిల్లై ఒరు నాళం
గోవిందన్ను పడుత్తు వరుక్కు
కురై విల్లై ఒరునాళం

అంటే.

హరి యని పరుపు పరచి
అచ్యుతా అని స్మరియించి
క్రిష్ణా అని పడుకుంటే
కీడు రాదు ఏ వేళా
గోవిందా అని పడుకుంటే
కొదువరాదు ఏ వేళా

అలాగే ప్రతిరోజూ నిద్ర లేస్తూనే పడకచుట్టేముందు పిల్లల్ని ఈ క్రింది పాట పాడమని సలహా లిస్తారు.

పొళుదు ఎప్ప విడియుం?
పూ ఎప్ప మలరుం?
శివన్ ఎప్ప వరువాన్?
వరం ఎప్ప తరువాన్?

అంటే—

పొద్దెప్పుడు పొడిచేను?
పూలెప్పుడు విరిసేను?
శివుడెప్పుడు వచ్చేను?
వరమెప్పుడు యిచ్చేను?

అని అర్థం.

## అమ్మనై పాటలు

ఈ అమ్మనై పాటలు గ్రామదేవతలపైన అనాదినుంచీ వాడుకలోవున్న జానపదగీతాలు. వీటిల్లో కొన్ని సిలప్పిదికారం కావ్యంలో పద్యరూపంలో చోటు చేసుకున్నాయి. ఇప్పటినాటకాలలోనూ వీటికి ప్రాధాన్యత ఉంటోంది. ఇవి 'అమ్మానే' అనే మాటతో ముగిస్తాయి.

అలాటి అమ్మనే పాటల్లో "గోవా మలై ఓరం కొత్త మలై ఓరం" అంటూ ప్రారంభమయ్యే పాట బహుళ ప్రచారములో వున్నది. దానిని అయ్యర్ జాతి స్త్రీలు పాడుతారు. ఈ అమ్మనే పాటలను గిలకలు ఆడిస్తూ ఉయ్యాలలో ఊగుతూ పాడుతారు. వీటిల్లో వీరుడి చరిత్ర, గుడి దేవత, దగ్గరబంధువు మున్నగు విషయాలు చోటు చేసుకుంటాయి.

శివగంగై అమ్మనే పాట చరిత్రాత్మకమైన తందాన పాట. అది సాహిత్యములోనూ, దేశభక్తిలోనూ, విషయవివరణలోనూ మిన్నగా ఎన్న దగినది. అందులో పాంచాలన్ కురిచ్చిలో శ్వేతజాతీయులచే ఉరితీయబడ్డ శివ సుబ్రమణ్యం అనే స్థానిక దండనాయకుని ధీరోదాత్త చరిత్ర వివరింప బడుతుంది. ఆ కథలో ఇంగ్లీషుపేర్లు జన సామాన్యము వాడే గ్రామ్య భాషలోవుంటాయి. ఉదా॥ మేజర్‌ను మేసన్ అనీ ట్రూప్‌ను తురుప్పు అనీ గవర్నరును గవునర్ అనీ పిస్టల్‌ను పిస్తల్ అనీ ఉచ్చరిస్తారు.

## ఆధునిక తందానపాటలు

ఆధునిక తందాన పాటలు కులాంతర వివాహములు స్త్రీలకు ఆస్తి హక్కు కులవ్యవస్థ అత్యాచారములు-మున్నగు వాటిని చాటి చెప్పేవిగా ఉంటాయి. ప్రఖ్యాతి గాంచిన నేటి తందాన పాటలలో నల్లతంగాళ్ కథ, ముత్తుప్పట్టున్ కథ పేర్కొనదగినవి.

వివిధ కులస్తులకు విచక్షణ లేకుండా నీరు ఎలా ఉపయోగపడుతుందో ఈ పాట విశదీకరిస్తుంది.

ఓల లాడుతూ ఒరుసుకుంటూ
నీలి నీళ్ళు సాగుతున్నవి.
మెలి తిరుగుతూ మెరుస్తూనూ
గల గలా కావేరి సాగెను.
తాగుటకునూ తానమునకూ
తగిన నది కావేరి తల్లి
ప్రియతమా, ఈ నీటిని
బిందెలందున తీసుకొందురు
ఈ జలము పవిత్రమైనది
బ్రాహ్మణులకూ మాలలకునూ
పనికివచ్చే చల్లనీరూ
గ్రామములో వివిధ జాతులు
కాపురమ్ములు చేయుచున్నా
బ్రాహ్మడయినా మాల అయినా
బంటు అయినా ప్రభువుఅయినా
అందరూ కోరుకునేది
అందరూ కొట్లాడుకొనేది
ఈ నీటికోసరమే
వాస్తవానికి ఈ నది—మన దేవత
పారుతోంది అనవరతమూ— ఓ ప్రియా!

## పౌరాణిక తందాన పాటలు

ఇవి హిందూ ఐతిహ్యమును ఆలోచనము చేసుకొని రూపొందినవి.

ఇవి గ్రామీణులను బాగా ఆకట్టుకుంటాయి. వీటిల్లో ఏణి ఏట్రం, పొన్నురవి మనక్కైౖ అల్లి అరసాణి మాలై మున్నగునవి సుప్రసిద్ధములు.

అల్లి అరసాణి మాలైలో శ్రీ కృష్ణుడు ఎరుకలసాని అవతారందాల్చి తన ప్రాంతపు భూవసతిని పొగుడుతూ రాణీ అల్లిని వశపరుచుకోవడానికి అర్జునుడికి ఉపాయం సూచిస్తాడు. ఈ పాట "కొచ్చిమలై కూడుమలై ఎంగళదునాడు" అంటూ ప్రారంభమై ఈ క్రింది విధంగా సాగుతుంది.

కొచ్చికొండ కొదగుకొండ
కూడినది మాదేశం
కుమరుని తిరుత్తణి కూడా
అమరినది మాదేశం
పచ్చకొండా పవళ కొండా
చేరినది మాదేశం

ఇలా సాగే ఈ పాటలో అర్జునుడికి అల్లిని వశపరుచుకునే ఉపాయం క్రింది విధంగా చెప్పబడినది.

"అల్లి పేరును వల్లిస్తూ ఈ మందులను కలుపు వెంటనే ఆవిడ పోకడతో మార్పువస్తుంది. మందులో అన్ని అంశములూ కలిసి పోగానే అల్లి మనస్సులోనూ మార్పు వస్తుంది. ఆమె మనస్సు మారడం తడవుగా నీ అభీష్టము నెరవేరుతుంది...."

ఈ తందాన పాటల్లో ఉపమానములు కోకొల్లలుగా కనిపిస్తాయి. ఈ పాటలలో వృక్ష జాతుల వర్ణన కూడా ఉన్నది.

## చారిత్రాత్మక తందాన పాటలు

చారిత్రాత్మక తందాన పాటలు అలనాటి రాజకీయ పరిస్థితులను క్షుణ్ణంగా విపులీకరించడమే కాకుండా వీరుల యొక్క గుణగణాలను తద్రూపముగా

విశదంగా ఎత్తి చాటుతాయి. వాటిల్లో కచ్చితత్వమూ, అనుసంధానమూ. కొరవడి కొన్నికొన్ని చోట్ల వందయేళ్ళ కాలవ్యవధిలో కూడివున్నా అవి వ్యావహారిక సాహిత్యమునకు ఎంతో దోహదము చేస్తున్నాయి.

ఇప్పటికిని వాడుకలో ఉన్న చారిత్రాత్మక తందాన పాటలలో ఐవర్ రాశాక్కళ్ కథ (పంచ ప్రభువుల కథ) కన్నిడియన్ పడై పోర్ (కన్నడ సైన్యయుద్ధము) రామప్పయ్యన్ అమ్మనై, ఇరవిక్కుట్టి పిళ్ళెపోర్, శివగలగ అమ్మనై, శివ గంగ కుమ్మి, పులిదేవన్ బిందు, కట్టబొమ్మన్ కదై పాడల్, ఖాన్‌సాహెబ్ కథ మున్నగునవి పేర్కొనదగినవి. వీటిలో ఒక్కొక్కదానిలో కథలూ, ఉపకథలూ వున్నాయి. ఈ కథలలో వచ్చే నాయకులు చాలావరకు బ్రిటిష్ ఏకాధిపత్యమును ఎదిరించి తమిళనాడులో సాగిన స్వాతంత్ర్యపోరాటములో సారథ్యము వహించిన వారే ఈ కథాగానములకు గాంధీయుగములో ప్రజల మధ్య మంచి ఆదరణ ఉండేది.

బెంజి నాయకుడయిన దేశింగురాజుకథలో ఆయా ఘట్టములకు తగినట్లు పాటలో మెట్టుమారుతూ ప్రజల్లో ఉత్తేజమునూ ఉద్రేకమునూ, కలిగిస్తాయి. క్రింది పంక్తులలో దేశింగురాజు యుద్ధఘట్టము వర్ణింపబడినది. రాజా దేశింగు గుర్రము పరాశః.

ఇరవై వేలూ తురంగ బలమూ
ఎదురుగ వచ్చిందీ.
ఎదిరి సైన్యమును చూశాడయ్యా
రాజా దేశింగూ
పౌరుషమ్ముతో మీసము తిప్పెను
రాజా దేశింగూ
ప్రభంజనములా విజృంభించెను
ప్రభువుని పరాశరి!
శిరస్సులూడిన నవాబుసైన్యము

ఒరిగెను ధూతలిపై
చెల్లాచెదరై గుర్రములన్ని
నేలను కూలాయి
ఇరవై వేలూ తురంగ బలమూ
ముక్కలు ముక్కలుగా
ఏనుగు మూకల పైకి ఉరికెనూ
రాజా దేశింగూ
గునపముతోనూ తోడు వచ్చెనూ
పట్టపు చేనుగూ
ఎదిరి ఏనుగుల చితక బాదెను
పట్టపు చేనుగూ
పట్టాకత్తివి పైకిలాగెను
రాజా దేశింగూ
శత్రుమూకలను చిత్తుగ నరికెను
రాజాదేశింగూ
పట్టపు చేనుగు విజృంభించి
పురోగమించివది
వవాబు గజములు నేలనుకూలీ
అసువులు బాసినవి
ఫెళఫెళమంటూ కోరలు విరిగీ
నేలను కూలినవీ
శిరములు పగిలిన ఏనుగులన్ని
పిచ్చిగ కూలినవీ
ఇరవై వేలా గజబలమంతా
పటాపంచలాయె
ఏనుగు పైనా మావటి ఒక్కడు
అగుపించాడయ్యా

అట్టహాసముగ నవ్వాడయ్యా
రాజా దేశింగూ
పరాశరినీ ఎడమ పై పునా
ఉసిగొల్పంగానే
ఏనుగుపైకీ గంతులేసినది
తలపై కెగిరినవీ
మావటి వానిని పట్టా కత్తికి
ఎరజేశాడయ్యా
అతని రొమ్ములో దూసుకపోయెను
పట్టాకత్తియునూ
నీ బలమునకు ఈదే లేదూ
రాజా దేశింగూ

## కన్నడిగ యుద్ధము

1265 ప్రాంతములో కులశేఖరన్ (పొన్ను పాండియన్) అను పాండ్య రాజు వళ్ళియూర్‌ను పాలిస్తుండేవాడు. ఒక కన్నడ వడుగ యువరాణి అతని చిత్రపటమును చూసి అతని సాహస గాధలు విని అతనిని ప్రేమించింది. ఆమెతండ్రి పాండ్యరాజు వద్దకు పెళ్ళి విషయము మాట్లాడటానికి రాజ దూతను పంపాడు. కాని పాండ్యరాజు వడుగ జాతి నిమ్నజాతి అని ఆ వివాహమును తిరస్కరించాడు. ఆపైన కన్నడ దళవాయి పాండ్య రాజధానిపై దండెత్తి ఆ పట్టణమును స్వాధీనము చేసుకుని పాండ్యరాజును చెరపట్టి తన కూతురితో వివాహము జరిపించాలని పల్లకిలో తీసుకుని పోతున్నప్పుడు మార్గ మధ్యములో ఆత్మహత్య చేసుకుని చనిపోయాడట పాండ్యరాజు. ఈ విషాద ఘట్టముతో మనస్సు విరిగిన యువరాణి పాండ్యరాజు శవమునకు మాలవేసి అతని చితిలో పడి తనువు చాలించినదట. ఆ చితిలోంచి వెలువడిన ఒకశక్తి కన్నడ నాయకుని కలలో కనిపించి తనకోసరమూ, తన ప్రియుడి కోసరమూ

ఒక దేవాలయము నిర్మించమని ప్రాధేయపడినదట. ఆవిడ కోరిక మేరకు వడుగచ్చిమలై అనే ప్రాంతంలో గుడి నిర్మింపబడినది.

## ఇరవిక్కుట్టి పిళ్ళై కథాగానము

ఇది చాలా ప్రచారము గల కథాగానము. ఇందులో కనియకుళము వద్ద జరిగిన యుద్ధ ఘట్టము వివరింపబడుతుంది. వేనాటి రాజు యొక్క యువసేనా నాయకుడైన ఇరవిక్కుట్టిపిళ్ళై మధురై తిరుమలై నాయకుని మహా సైన్య మును ఎదురించి జరిపిన పోరాటం ఇందులో కథాంశము. అతను పదుహేడు రోజులు వీరోచితంగా పోరాడి చివరిరోజున వీరమరణము చెందాడు. ఈ కథానుసారము తిరుమల నాయకుడు స్వయాన వీరమరణము చెందిన ఇరవి క్కుట్టి పిళ్ళైకోసరం ఒక జ్ఞాపక చిహ్నము నెలకొల్పి వీరవందనము చేశాడట.

## వీణాధి వీణన్ గాథ

ఈ వీణాధి వీణన్ తిరునెల్వేలి జిల్లాలోని దక్షిణప్రాంతంలో చాలా శతా బ్దముల క్రితం బ్రతికాడని ప్రతీతి. అతని బంధుమిత్రులు ఆస్తిపాస్తుల్ని కాజేయడంవల్ల అతను బికారీ అయ్యాడు. ఆతను పొట్టకోసరం ఏదో ఒక పని చెయ్యవలసి వచ్చేది. అతనొక చాకలిని ఆశ్రయించి తను అతనికి చేదోడుగా పని చేస్తానన్నాడు. కాని ఉన్నత కులస్థుడు తనతో పనిచెయ్య డానికి చాకలి అంగీకరించలేదు తరువాత అతను అడుక్కోసాగాడు. కానీ ఆ తిండి అతనికి సరిపడలేదు. చివరికి అతను సన్యాసి వేషం వేసుకుని భిక్షాందేహి అంటూ బయలుదేరాడు, అతని ఎత్తుఫలించలేదు.

వీణాధివీణవ అడవుల్లో కట్టెలుకొట్టి అమ్ముతూ కాయగూరలు దొంగిలించి వ్యాపారం చేస్తూ బ్రతకసాగారు. కానీ అతనికి అక్కడా చుక్కెదురే అయింది. అనేకసార్లు పట్టుపడ్డాడు. తర్వాత అతను శిస్తువసూలు చేసే

అధికారిగా నటిస్తూ ఊరి బావులలోనూ, చెరువులలోనూ నీళ్ళు తీసుకువెళ్ళే స్త్రీల దగ్గర ప్రతి బిందెకూ ఇంత పైకమని వసూలు చెయ్యసాగాడు ప్రజలు అతను ప్రభువు అనుమతితోనే శిస్తువసూలు చేస్తున్నాడని అనుకునేవారు. ఒక స్థానిక మంత్రిగారి పనిపిల్ల కప్పము చెల్లించడానికి తిరస్కరించి కోపంతో ఇలా పాడింది.

వావిక్కరై పెణ్గళై సేవిక్కలో వందాయ్
మాప్పిళ్ళైక్కు ఆగువాయో పేయ్ పరచ్చిమగనె
నాట్టిల్ కుడక్కాసు వాంగుం పిణయే నీ
నాయ్కుం, పేయ్కుం వళ్ళి యూరిల్
మూప్పు వందు పోచ్చా
ఉట్టి తెరిక్క కిణత్తుకుళ్ళే తళ్ళి పోట్ట
ఉండై కల్లై తానెడుత్తు మండయిలే పోడు!

(నీ వెవడవురా దష్టపీనుగా కప్పం అడగటానికి? బావిలోతోసేసి నెత్తిమీదగుది బండ తొయ్యగలము— అని భావం.)

వీణాధి వీణన్ ఆ పని పిల్లను కట్టెతో కొట్టాడు. ఆమె స్పృహ తప్పి పడిపోయింది. ఈ దృశ్యం చూసి భయపడి మిగిలిన వారంతా కప్పం చెల్లించారు.

ఆ పని పిల్ల మంత్రిగారితో ఫిర్యాదు చేసినా రాజు ఆనతి మేరకు అతను కప్పము వసూలు చేస్తున్నా డనుకుని మంత్రి ఊరుకున్నాడు.

కాలక్రమేణ వీణాధివీణన్ పెళ్ళిళ్ళలోనూ దహనక్రియలలోనూ కప్పము వసూలు చేసి బాగా డబ్బు సంపాయించాడు. అతను మిత్రులకు మిత్రుడుగానూ శత్రువులకు శత్రువుగానూ మసలుకునేవాడు. అతను పండితులనూ కళాకారులనూ ఆదరించి పోషించాడు. ఇంత జరిగాక మంత్రి తన భటుల్ని పంపించి వీణాధివీణన్ని బంధించి అతని ధనమును స్వాధీనము చేసుకుని రమ్మన్నాడు.

రాజు వీణాధి వీణన్నిచూసి నువ్వు ఇలా చెయ్యడానికి అధికారం ఎక్కడిదని అడిగాడు.

వీణాధివీణన్ రాజును చూసి నీ మంత్రి వర్గంలోని వారు పన్నులు వసూలు చెయ్యలేని చవటలని తూలనాడాడు.

"ఉంగళుక్కు బుద్ధియుందో?
పాప్పాపై మందిరియామ్ పైత్తిరుంద రాజావే
పణ్ బడయ ఎన్ వీట్టిల్
పణ పెరుక్కై పారుం"

తను రాజుకోశాధిగారమును నింపడం కోసరమే సక్రమమార్గంలో పన్నులు వసూలు చేశాననీ వాదించాడు. అతని మంత్రులకంటే తను ఎంతో నయమని చెప్పాడుట. రాజు అతనిని మెచ్చుకుని తన మంత్రివర్గంలో నియమించాడు.

## రకరకాల పల్లెపాటలు

విజ్ఞానసాధనాలుసైతం పల్లెపాటల్లో చోటుచేసుకున్నాయి. "ఎంజిను వండి గళాం ఇరుపురముం సూశిగళాం" అన్నపాట రైలుబండిని గురించి వాడుకలో వున్న జానపద గీతము. ఆ పాట ఈ క్రింది విధంగా సాగుతుంది.

ఇంజను బండ్లంట
ఇరువై పులా వింతలంటు
ఎడ్లు లేక పరుగెత్తే
ఇంగ్లీషోడి బండ్లంట
తమకు తామే పరుగెత్తే
తెల్లదొర బండ్లంట,
'వాడిపట్టి' సంతదగ్గర
వస్తుంటే పొగబండి

సంగతు తీగపైన
'సమయనల్లూరు' చీరుతాయి.

ఇతరపల్లె పదాలు వైద్యము గురించీ, పిల్లల జననంగురించి విశదీకరిస్తాయి. సుఖప్రసవం జరిగిపోతే ఆ తల్లి ఆనందంగా పాడుకుంటుంది. వరుణ దేవుని ఉద్దేశించి పాడే ప్రార్థనా గీతాలు కూడా వున్నాయి. వార సంతలను గురించీ అక్కడ అమ్మకానికొచ్చే సరుకులను గురించీ ఎన్నో పల్లెపదాలున్నాయి.

## కొండతెగల జానపదగీతాలు

(1) తోడాలు:—— నీలగిరి ప్రాంతములోని తోడా తెగల జానపద సాహిత్యంలో స్వప్నగీతాలు పేర్కొనదగినవి. ఇటీవల మరణించిన వారు ఈ పాటల్ని పాడుతారుట. చచ్చిపోయిన వ్యక్తులు కలల్లోకొచ్చి పాడుతూ తాము నెరవేర్చలేని కార్యకలాపాలను వల్లెవేస్తారట. మరణించిన ఇల్లాలు తన పాటలో తనకు సవతిగా రాబోయే ఆడపిల్లను శపిస్తూ పాడుతుందట. ఆడ కూతుళ్ళను వదిలేసి చనిపోయిన తల్లి తన భర్త రెండో వివాహాన్ని గర్హిస్తూ విలపిస్తుందట.

తోడా జాతి పాటలు కల్పనాశక్తితోనూ, వ్యంగ్య ధోరణితోనూ కూడుకుని ఉంటాయి. ఈ పాటల్లో వ్యక్తుల పేర్లకు మారుగా (చచ్చిన వారయినా బ్రతికి ఉన్నవారయినా) దున్నల పేర్లు వాడతారు. వలపు గీతాలు పొదుపు పాటలనబడే ద్విపదలో సాగుతాయి.

(2) పళయర్ తెగ :— పళయర్ అనబడే కొండజాతికి చెందిన వేలాది ప్రజలు పళని కొండలలోని ఎగువ భాగంలోనూ దిగువభాగంలోనూ జీవిస్తున్నారు.

అడవుల్ని నాశనం చెయ్యడాన్ని నిరసిస్తూ వాళ్ళుపాడే "వండమేట్టు పాదయిలే" అనే పాట అనువాదం క్రింద యివ్వబడింది.

బండిమేటు పథము పైనా
బాటవేసిరి చెట్లు నరికీ
ఏనుగులు స్థావరములు లేక ఏగుచున్నవి రోడ్లపై
ఏమి దారుణ మేమి దారుణము?

(3) మన్నాడీలు :- అనేక కొండ జాతులవారు ప్రతి ఉత్సవంలోనూ, వానకోసరం ప్రార్థనలు చెయ్యడం పరిపాటి. వానా-బ్రతుకూ అవినాభావ సంబంధం కలిగి వున్నాయి. మన్నాడి తెగవారు ప్రతిమాసం సక్రమంగా వానలు పడాలని ప్రార్థనలు చేస్తారు. అలా వాన కురిస్తే వాళ్ళు ఎక్కువగా జంతు బలులు ఇవ్వడానికి తమ సంసిద్ధతను వెల్లడిస్తారు.

మాస మొరు మళై
పేయట్టుం మన్నాడి!
మందై క్కొరు కిడా
వెట్టిక్కో మన్నాడి!
దేశ మొరు మళై
పేయట్టం మన్నాడి?
తెత్తుక్కాడు కిదా
వెట్టిక్కు మన్నాడి! ॥తాలేలో॥

## వలపు పాటలు

పళ్ళు అనబడే ఉత్తమ గీతాలు సృజింపబడి వాడుకలో వున్నాయి. గ్రామీణ సాహిత్యాభిరుచిగల కళాకారులు ఈ పాటల్ని కూర్చి యుంటారు. అలాటి ఒక పల్లె పదము క్రింద అనువదింపబడినది:

### ముక్కూడల్

(మధురై హరిజనులు పాడుకునేది)

(తప్పు దార్లు పట్టే తన భర్త మీద ఊరి పెద్దతో ఒక ఇల్లాలి ఫిర్యాదు).

"అయ్యా. ఇతను నన్ను నిర్లక్ష్యం చేశాడు
ఆడతాడు దొంగ నాటకం!
అయినా నామనోహరుడేను
ఉంపుడుకత్తె పసుపుముద్దకోసరం
ఉన్న ఆస్తినంతా ఊడ్చిపెట్టాడు
ఇప్పుడేమో బికారియై
చిప్ప ఇచ్చాడు నాచేతికి
అవమానాల పాలు. నేను
ఆ పిద ఇంట్లోనేమో ఆనందాలు!
అతని కాళ్లు నాఇంట్లో నిలవవు
అక్కడే ఉంటాడు కలల్లోనూ
మాప్రాణంలో [illegible] ణం అళగర్ దేవుడు
మంటికీ మింటికీ సంరక్షకుడు.
భక్తుడు కావాలంటే సేవకోసరం-నా
భర్తను మంచి మార్గమున నడిపించాలి—అయ్యా!
పరుల దూషణకే పుట్టాడు నాపతి
మానం మర్యాద బొత్తిగాలేవు
అతనికి కావలసిందల్లా
అంద చందాల యువతి
నాయౌవనాన్ని పీల్చి పిప్పిచేసి
వెలయాలు వెంట పడినాడు
గతజల సేతుబంధనం వల్ల
కలుగుతుందా ప్రయోజనం?
మదన పట్టిదున్నలని బుద్ధి పుట్టదు
భార్య ఉన్నదన్న ధ్యాసేలేదు
కాలిన గాయం మానవచ్చు—పళ్ల

గాటు మాసి పోతుందా?
అతనినీ ఎన్నో విధాల తిట్టాను
అసలు నామొహం చూడవద్దన్నాను
అయ్యా ఆతనితో సంప్రదించండి
కొమ్మముడిని ఎదగొట్టాలంటే
గొడ్డలిపెట్టు గురువు!
ఆయన్ని గట్టిగా మందలించండి
ఆ మోసగాణ్ని శిక్షించండి
అతనికి పాపభీతి కలిగించండి
అయ్యా నాప్రార్థన ఆలకించండి.

ఇలాటి గీతాలేకాక పిల్లలకిష్టమైన పాటలూ, గేయకథలూ ఉన్నాయి. వాటిల్లోకొన్ని హాస్యంతో కూడుకుని ఉన్నాయి. కొన్ని చొప్పదండు పాటలు కూడా వున్నాయి. తమిళనాడుకు ప్రత్యేకమైన క్రీడాగానములుకూడా ఉన్నాయి. ఈ పాటలు ఆయా వయస్సు పిల్లలకు అనువైన రీతిలో వున్నాయి. పిల్లల వయస్సును బట్టి కొన్నిసరళంగా ఉంటే మరికొన్ని కఠిన పదములలో నిండి వున్నాయి. పెళ్లీడుకొచ్చిన కన్నెపిల్లలు పాడేపాటలు ఎంతోరమ్యంగా ఉంటాయి. ఈ కన్నెపిల్లలు కొత్తదంపతుల్ని ఉడికిస్తూ పాడేపాటలు కూడా ఉన్నాయి. బావ (అక్కభర్త) ను ఆటపట్టించే తమాషా పాటలూ, కాబోయే భర్త అంతస్తును వెక్కిరించే పాటలూఉన్నాయి. ఈక్రిందపాట చూడండి:

తంజావూరు పెళ్లికొడుకు
తహశిల్దారని చెప్పారు
తంజావూరు కెళితే తెలిసింది
తలారి పని చేస్తాడని
కాలికట్ పెళ్లికొడుకు
కలెక్టరని చెప్పారు

కాలికట్‌కు వెళ్ళిచూస్తే
గాడిదలు మేస్తున్నాదతను.

ఆడపిల్లలు చిట్టెలుకల్ని గురించి పాడేపాటలో ఒక రాజవంశపు చిట్టెలుక యువరాణి చిట్టెలుకను ఎలా వలలో వేసుకుని పెళ్లాడాలని ఉబలాటపడిందో వర్ణింపబడినది.

"ఓ నా చిట్టెలుకా
ఓ నా చిన్నదానా,
వంటచేసే పని ఉండదునీకు
ఇంటిపనులు అసలే లేవు
కాలమంతా నాఒళ్లో కూర్చుని
కబుర్లుచెబితే చాలుప్రియా!
బావిలోంచి నీళ్లుతోడి
బట్టలుతికే పనిఉండదునీకు
పక్కనకూర్చుని అనవంతమూ
పాడుతూ ఉంటేచాలు చెలీ!

ఈ చిట్టెలుక తనప్రేమను కవితాత్మకంగా వెల్లడించే తీరులో మానవుల్ని మించిపోయిందని చెప్పాలి.

తమిళనాడులో లెక్కలేనన్ని ప్రేమగీతాలు వాడుకలో వున్నాయి. వాటిల్లో చోటుచేసుకునే భావమూ ప్రేమా శాశ్వతమైనది. ఒక ప్రియుడు తనప్రేయసి చెవిపోగుగానో, ముక్కుపుల్లగానో, లేదా చేతిగాజులుగానో మారి ఆవిణ్ని అలంకరించాలని కోరుకుంటాడు. ప్రేమోపాసకుడయిన ఒక యువకుడు తాను పువ్వుగాపుట్టి ప్రియురాలి జడలో ఒదిగిపోవాలని ఆశిస్తాడు. ఇలాటి వర్ణనలు ఈ పాటల్లో కోకొల్లలుగా చోటుచేసుకుని వున్నాయి.

తమిళ జానపద సాహిత్యము భావంలోనూ పదముల పొందికలోనూ వైవిధ్యము కలిగివుంది. చేపలుపట్టే బెస్తలుపాడే పడవపాటల్లో అలల

హోరు చోటుచేసుకుంటుంది. బండివానే వాళ్లు ఎడ్లను నడిపించడానికి పాడేపాటలూ ఉన్నాయి. ఎడ్లునిద్రపోతూ నడవటమూ, బండితోలేవాడు బండితోలుతూ నిద్రపోవడమూ ఈపాటలు ప్రభావం వల్లనేమో!

వాళ్ళు మగతగా పాడుకుంటారు. తమ ప్రయాణంలో అలౌకిక శక్తి తోడ్పడుతుందని వాళ్ళ నమ్మకం.

"కాడెద్దులు కొండ చెరియలో
కాళ్ళు ముందుకు పెట్టలేని మిట్టలో
కళ్ళకు కనిపించని ఆ మహాత్ముడే
కదిలిస్తాడు బండిని ముందుకు!
ఫళని దేవుని అదృశ్యహస్తాలే
పక్కల బలంగా నిలుస్తాయి, ఎడ్లకు;

ప్రేమ పాటలు ఇతర పల్లె పదాలే కాకుండా వృత్తి పాటలూ. బాలగీతాలు తిరునాళ్ళ పాటలు ఇంకా పెళ్ళిళ్ళల్లో ఉల్లాసంగా, పాడుకునే శుభ మంగళ గీతాలు వాడుకలోవున్నాయి.

## శోక గీతాలు

చావుల్లో పాడే పాటలను 'ఒప్పారి' లేక 'పిలక్కాణం' అంటారు. స్త్రీలు ఈ పాటలద్వారా తమదగ్గర బంధువులు మరణించినప్పుడు తమ సంతాపమును వెలిబుచ్చుతారు. ఒక యౌవనవతి తన భర్త అకాలమరణం చెందితే ఇలా తన ఆక్రందనను వెలువరిస్తుంది.

"ముళ్ళతో నిండిన ఈ పూదోటలో నన్నొదిలి
వెళ్ళిపోయావా నా 'ప్రాణనాధా?'

ఒక యువ వితంతు స్త్రీ-తన చుట్టూ ఉన్న ప్రపంచం రంగు రంగుల పూలతో నిండి ఉన్నా— వాటిల్లో ముళ్ళను మాత్రమే చూడగలదు. స్త్రీలు



**Plate XI** మయిలాట్టం–నెమలి నృత్యం



Plate XII కోలం

తమ కుటుంబంలోనే కాకుండా తమ బంధువర్గీయుల ఇళ్ళల్లో సంభవించే మృత్యువు లన్నిటిలోనూ కలుసుకుని విషాద గీతములద్వారా తమసంతాపాన్ని తెలియచేస్తారు. ఒక ఇల్లాలు అన్నివిధాలా తన భర్తపైననే ఆధారపడి ఉంటుంది.

భర్త మరణం ఇల్లాలికి అశనిపాత లాంటిది. అతను చిన్నవయస్సులోనే మరణిస్తే ఇల్లాలి దుఃఖమునకు అంతే ఉండదు. ఆ యువ వితంతువు తన పసిబిడ్డలతో ఏకాంతవాసములాటి జీవితము గడపవలసి ఉంటుంది. ఒక్కొక్కప్పుడు ఆమె తన తల్లిపైనా, సహోదరిపైనా ఆధారపడవలసి ఉంటుంది. వృద్ధురాలై ఎదిగిన సంతానం ఉంటే కొడుకునో, కూతురినో ఆశ్రయిస్తుంది.

ఈ క్రింద కొన్ని "ఒప్పారి" పాటల అనువాదం ఇవ్వబడింది (ఈ ఒప్పారి పాటలు తొలుత శివగిరి లోని శ్రీ ఎస్. ఎమ్. గోర్కి అనేవ్యక్తిచే సేకరింపబడి శ్రీఎస్. వానమామలై సంపాదకత్వములో తమిళ నాట్టుపాతల్ గళ్ అనే పుస్తకరూపంలో వెలువడ్డాయి.)

అందమైన కంఠహారములో
ఆవ గింజంత తాళిబొట్టూ,
ఆకంఠహారము-ఎడబాసే దుర్దినం
ఆసన్న మైంది నాకు?
మెరిసే పతకం పొదిగిన హారములో
మిరియంలాంటి తాళిబొట్టూ.
హారమును కోల్పోయే-దుర్దినం
ఆసన్నమైంది నాకు!
పట్టుచీరలూ మానుకున్నాను
పాదాలదాక తెల్లవస్త్రం కట్టుకున్నాను.
ఎర్ర చీరలు విసర్జించాను
ఇకపైనాకు తెల్ల దుస్తులేనూ.

(2)

గోధుమ గింజల్లాంటి పూసలున్న (మెడ)
గొలుసులలోనా
కమ్మరికి తెలియకుండా
కరిగిపోయాయి మరచీలలు

పగడాలు పొదిగినట్టి
బంగారు గొలుసులోనా
కంసాలికి తెలియకుండా
కరిగిపోయే మరచీలలూ

(3)

కొండ దగ్గర బండపైనా
ఎండ బెట్టాను ఉద్దిపప్పు
ఉద్దిపప్పు తెచ్చేలోగా
ఊళ్ళో తప్పెట మోగాలా?

ఏటవాలు కొండ పక్కన
ఎంత బెట్టాను జొన్నగింజలు
జొన్న గింజలు తెచ్చేలోగా
విన్నాను శంఖ నాదం!

తల్లి మరణిస్తే పాడే తమిళ పాట అనువాదం ఈ క్రింద ఇవ్వబడింది:-

"మట్టిని తొక్కితే—నా
మెత్తటి పాదాలు నొచ్చేవి.
నేలపైన నడిస్తే-నా
లేత పాదాలు కందేవి.
తల్లి గుండెల్లో దాక్కునే ప్రాయంలో

ఒళ్ళో నడక నేర్చాను.
భుజములపైన కూర్చునే వయసులో
ముద్దు ముద్దుగా నడక నేర్చాను,

అమ్మ అనురాగంలో
హాయిగా పెరిగాను.
అమ్మ నన్నొదిలి పోయే
ఆదరించే దిక్కెవరూ?

తండ్రిని పోగొట్టుకున్న నిర్భాగ్యురాలు ప్రలాపించే ఈ క్రింది పాట చూడండీ.

"కన్న తండ్రి కరువైతే
దిక్కులేక మిగిలాము
నాన్న మమ్మ వదలిపోతే
పిచ్చిగా తిరిగాము

ప్రేమతో పెంచావు
గోముగా పిలిచేవు
కూరిమితో లాలించి
కోరికలు తీర్చావు

అందంగా మెరిసేటి
చందమామ కావాలన్నా
తెచ్చి ఇచ్చి నా ముచ్చట
తీర్చిన తండ్రివి నీవే"

## భక్తిగీతాలు

ప్రతిగ్రామములోనూ ప్రత్యేకమైన భక్తిగీతాలు వాడుకలో వున్నాయి.

ప్రతిగుడికీ ప్రత్యేకమైన భజన కీర్తనలు ఉన్నాయి. ఒక్క ప్రాంతానికి ప్రత్యేకమైన ఉత్సవాలు జరుగుతాయి. వీటిని గురించి "పండగలు-పబ్బాలు" అధ్యాయములో విపులంగా చర్చించడమైనది. అనేక ఉత్సవాలలో నృత్యాలు, నాటకాలు ప్రాముఖ్యత వహిస్తాయి. వీటిల్లో భక్తిగీతాలకు ఎంతో ముఖ్య పాత్రఉంటుంది. ఆధ్యాత్మిక గానములు కూడా భాషలోను భావంలోనూ ఎంతో విశిష్ట మైనవి. సిద్ధర్ పాటలను పోలిన గీతాలు మత గురువులచే సృజింపబడి ఎంతో ప్రచారములోకి వచ్చాయి. సామాన్య ప్రజలచే కల్పింపబడిన పాటలు కూడా వున్నాయి. ఈపాటల్లో ముఖ్యంగా విశాల విశ్వ పరిశోధన, పరలోక చింతన అంతర్లిప్తమై ఉంటాయి ఈ పాటల ప్రత్యేకత ఏమిటంటే వీటికి ఎవరికి తోచిన రీతిని వారు వ్యాఖ్యానం చెయ్యడం వీలుపడదు. కొన్ని గీతాలు అనువాదం క్రింద ఇవ్వబడినవి.

(1) రాతిని పాతిపెట్టి పుష్పాలు నివేదించి
మంత్రాలు వల్లిస్తూ చుట్టూతిరిగితే
రాయి మాట్లాడుతుందా? దేవుడు నీలో వుంటే
కూరవండటానికి పనికివచ్చే
కుండకూ గరిటెకూ రుచితెలుసా?

(శివ వ్యాఖ్యర్)

(2) ఓ కన్నెపిల్లా!
గంతులేసే కోడెదూడను
కట్టాలి గూటమునకు
కోరికలను అదుపులోపెట్టాలి.
ఉచ్ఛ్వాస నిశ్వాసములను సక్రమపరచాలి
అందరాని కొమ్మను అనువుగా వంచాలి.
ఈ శరీరం ఎన్నాళ్లుంటుందో
ఎవరికీ తెలియదుకదా!

(కొంకణ సిద్ధర్)

(3) ఈ శరీరము కళ్ళలము
ఉప్పుకుండలాంటిది మాతా!
ఇంకో శరీరం కి
ఎలా వెళ్ళడమో నేనెరుగను
అదే తెలిస్తేనే నీ
అశాశ్వత శరీరంవీడి
శాశ్వతంగా నీ పాదాలచెంత
ఉండిపోనా ఓ మాతా?

(అఘుక్కుణి సిద్ధర్)

(4) ఎవరికీ అందని కొమ్మల్లా
ఇంపైన ద్రాక్షగుత్తి!
ఎన్నటికీ పొందలేని తేనెచుక్క
ప్రియతమా! అదే
అంతులేని ఆనంద చింతన!

## నిరక్షరాస్యుల ప్రతిభ

చదువురానివారు మూర్ఖులుకారు; మాటలాడలేని వారుకారు; వాళ్లు మహాత్ముల బోధనలు వినివున్నారు. పురాణములను ఇతిహాసములను విని వున్నారు. వంశానుగతంగా ఎన్నో గాధలను వింటూనే ఉన్నారు. అలా తండ్రినోటి మాటలద్వారా కొడుక్కి, తల్లి నోటిద్వారా కూతురికీ ఈ కథలు పారంపరంగా వస్తున్నాయి. వాళ్లు అలా ఆ కథలను సమీకరిస్తూ వాటి కథా నాయకుల కష్టనష్టాలలో పాలుపంచుకుంటూనే ఉన్నారు. తమ ఊహాల ద్వారా కథలపాత్రలతో కలిసిమెలిసి ఉంటూ వాళ్ల జయాపజయాలలో పాలు పంచుకుంటారు. కాగా ఈ గ్రామీణ ప్రజలు తాము విన్న కథలను తిరిగి

చెప్పేటప్పుడు తమ సృజనాత్మక శక్తిని ఊహల్ని మేళవించి చెబుతూ వుంటారు. ఈ పాటలు ప్రామాణిక గ్రంథములలోని గీతములనుంచి వేరు పడిఉన్నా, ఇవి భావంలోనూ భాషలోనూ సహజత్వమూ, మాధుర్యమూ సంతరించుకుని తరతరాల జాతి జీవితమునకు దర్పణములవలె వర్ధిల్లుతున్నాయి.

## రాగ గతులు

ఈ జానపద గీతముల సంగీతము సరళముగా ఉన్నా అవి శాస్త్రీయ సంగీతములోని రాగములను ఆలంబనము చేసుకుని వున్నాయి. ఈ పాటలను పాడడానికి పెద్దగా సంగీతప్రార్థన చెయ్యనవసరము లేదు. వీటిని ప్రాచీన ఫక్కీతో కూడుకున్న లలితగీతములని చెప్పవచ్చును. అయినా వాటిని పూర్తిగా లలితగీతములని చెప్పడానికి వీలులేదు. వీటి బాణీలూ, రాగగతులూ యథాతథంగా పరిరక్షించబడుతూ ఒక తరంనుంచి మరోతరం వారికి సంక్రమిస్తూ వస్తున్నాయి. ఈ పాటలలో ఇమిడివున్న భాషనుబట్టి వీటికి అనువైన రాగములను సులభముగా గుర్తించడం జరుగుతుంది.

పర్వతములూ, నదులూ పుట్టినప్పుడే తమిళ జానపద గేయములు పుట్టి ఉంటాయి. అవి ఇప్పటికీ నిత్యనూతనంగానే ఉన్నాయి. ఈ జానపద గేయములు మఱ్ఱిచెట్టులాగా కొత్త కొత్త ఊడలు వేస్తూ కొత్తరెమ్మలు చిగురిస్తూ అలా అభివృద్ధి చెందుతూ ఉంటాయి. ఈ జానపద గేయములు తరతరాలకు ముందు ఉద్భవించాయి. ప్రతి తరంలోనూ పుడుతూనే ఉన్నాయి. ఈ జానపదగేయములు తమిళుల సంస్కృతినీ సాంఘిక జీవన విధానమును ప్రతిబింబించుటేకాక మనోవాంఛలతో విషాదగాధలతో, హాస్యవినోదములతో వలపు వయ్యారములతో తులతూగుతున్నాయి.

## స్వాతంత్ర్యానంతర వైఖరి

ఆంగ్లేయుల కృషి వల్ల నయితేనేమి, శ్రీ ఎస్. ఎమ్. నటేశ శాస్త్రి లాంటి

భారతీయ పండితుల కృషివల్లనయితేనేమి, పాశ్చాత్య దేశములలో జరుగుతున్న జానపద సాహిత్య పరిశోధనా ప్రభావములవల్ల నయితేనేమి మనదేశంలోనూ జానపద సాహిత్యమునకు సముచిత స్థానమివ్వబడి కళాశాలల్లో పాఠ్యాంశముగా కూడా నిర్ణయింపబడుతున్నది. ఇప్పుడిప్పుడు జానపద గేయములను పుస్తక రూపంలో వెలువరించడం పునర్ముద్రించడం జరుగుతున్నది. వాటి విలువను విశ్వ విద్యాలయములుకూడా గుర్తించాయి.

# 7వ అధ్యాయము

## గ్రామీణ సంగీత నృత్యములు

తమిళనాడులో సంగీతమూ, నృత్యమూ దేవాలయములోనే ప్రారంభ మయ్యాయి.

అతి ప్రాచీనా కాలమునుంచీ వివిధ వర్గములకు చెందిన పూజార్లు భక్తి గీతములు ఆలాపించడం కోసరం దేవాలయములలో నియమింపబడుతూ వస్తున్నారు. దీనికొక తార్కాణము— తిరువమధూర్‌లో పదహారు మంది అంధులు ఉదయమూ సాయంత్రమూ తిరుప్పదిగం పాటలు పాడేవారని వారికిని, వారిమార్గదర్శకులయిన మరో యిద్దరికీ ఆకాలములో భూములు దానము ఇవ్వబడినట్టు ఋజువులున్నాయి. 'తేవార నాయకులు' అని పిలువబడే సంగీతా ప్రష్టలు ఆ కాలములో రాజులను కొలుచుటకై సంగీత సభలు ఏర్పాటు చేసేవారు.

## సనాతన సంగీతకారులు

ఓదువర్, స్థానికర్, కట్టళైయార్ మున్నగు గాయకులు గుళ్ళలో తేవారము పాటలు పాడుతూ చిన్న చిన్న సంగీత కార్యక్రమములు జరిపే వారు. వాళ్లు సారంగి వాద్యం సహాయముతో బృందగానం చేసేవారు.

తమిళనాడులోని దేవాలయములలో ఈ సారంగి వాద్యము 19వ శతాబ్దం చివరివరకూ వాడుకలో ఉండేది. ఈ సారంగి వాద్యగాళ్లకు మాన్యములు ఇవ్వబడినట్లు శిలా శాశనములలో ఋజువులున్నాయి. ఈ వాద్యములను తమిళంలో విల్-యాళ్ (విల్లు వీణ) అనేవారు. మధురై, తిరునల్వేలి, సుచీంద్రము, ఆళ్వార్ తిరునగరి మున్నగు చోట్లలోని దేవాలయములలో

స్వరాలు పలికే రాతిస్తంభాలున్నాయి. అర్థమండపం అనే వేదికపైన రాతి స్తంభముల సంగీతముతో కలిపి తేవారము పాటలు పాడేవారు.

## దైవ కటాక్షము

గ్రామీణుల కథానుసారం ఆ కాలపు సంగీతకారులు పూర్తిగా దైవకటాక్షముపై ఆధారపడి వుండేవారు. వరగుణ పాండ్యరాజు వద్ద బాణ భద్రుడనే ఆస్థాన సంగీత విద్వాంసుడుండేవాడు. అతనొకసారి యమనాథన్ అనే పొరుగుదేశపు విద్వాంసునితో పోటీ చేయవలసి వచ్చింది. బాణ భద్రుడు రాజు ఆనతితో మీనాక్షిపతియైన చొక్కలింగనాధుని ఆశ్రయించి భక్తి గీతములు గానం చేశాడు. ఒక అశరీరవాణి అతనికి భయపడవలదని అభయమిచ్చింది. దేవుడే ఒక కట్టెలమ్మే వాడిరూపంలోవచ్చి తన సంగీతమును ప్రదర్శించి యమనాధుని ఆశ్చర్యంలో ముంచాడు. తాను బాణ భద్రుని శిష్యుడని చెప్పుకున్నాడు. శిష్యుడే ఇంత గొప్ప సంగీతకారుడైతే గురువు ఇంకెంత గొప్పవాడో అని భయపడి పొరుగుదేశపు విద్వాంసుడు పాండ్యదేశమునుంచి వెళ్ళిపోయాడట.

## తమిళ గ్రామీణ సంగీతంలోని ఒడుపులు

తమిళ గ్రామీణ సంగీతము రాగములకు ప్రసిద్ధి గాంచినది. జానపద గేయములలో మంజీ, సామ, నవరోజ్. కల్యాణి, కరహరప్రియ తోడి మొదలైన రాగములు ఇమిడి వున్నాయి.

జానపద గీతములలో ఉపయోగించే వాద్యములలో కొన్నింటిని ఇక్కడ ప్రస్తావించాము.

నగారా:—అర్ధగోళాకారముగా ఉండే ఈవాద్యము దేవాలయములలో వాడుకలో ఉండేది. దీనిని ఏనుగుపై అలంకరించి తీసుకుని వెళ్లేవారు.

ముఖ్యమైన ప్రకటనలు వెలువరించే ముందూ వెలువరించిన తరువాత ఈ నగారా వాయించటం జరుగుతుంది.

**డమారము**—ఇది స్తూపాకారములో వుండేది. కొయ్యతోచేసిన బోర్లించిన స్తూపాకారపు చట్రమునకు చర్మము బిగించి ఈ వాద్యము తయారు చేసేవారు. దీనిని ఎద్దుపైన ఉంచి రెండు కొయ్యలతో మోగించేవారు.

**ఉదుక:**—దీనిని ఎడమ చేతిలో పట్టుకుని కుడిచేతి వ్రేళ్ళతో వాయిస్తారు. ఇది గ్రామీణ దేవాలయములలో ఇప్పటికిని వాయిస్తారు. దీనిని శివుని వాద్యమని పేర్కొంటారు.

డవిణ:— (డవండై) ఇది భారీ ఆకారములో వున్న ఉదుక. దీనిని కొయ్యతో మోగిస్తారు.

ఎక్కాళము:—ఇది కొమ్ము వలె వున్న బాకాలాంటి వాయిద్యము.

పంబ:—ఇది రెండు వైపులా వర్తులాకారంలో ఉంటుంది. దీనిని గుడి తిరునాళ్ళలో ఉపయోగిస్తారు.

## సినిమాలలో జానపదగీతాలు

సినిమాకవులు జానపదగేయములకు కొన్ని మార్పులూ, చేర్పులూ చేసి సినిమాలలో అలాగే ప్రవేశపెడుతున్నారు. గ్రామీణ కళలకు కూడా సినిమాలలో సముచితస్థానము ఇవ్వబడుతున్నది.

విషాద ఘట్టములలో గ్రామీణ పాటలలోని శోకగీతములు ఉన్న దున్నట్టుగా చోటు చేసుకుంటున్నాయి. ప్రేమికుల మధ్య సాగే సంభాషణల్లోనూ గ్రామీణ సాహిత్యములోంచి ఉపమానములూ లోకోక్తులూ ఉటంకించడం జరుగుతున్నాయి!

తాళయాం పూముడిచ్చి (మొగిలి పూముడిచి) అనే సినిమాపాట నిజానికి పల్లెపదము ఆధారముగా రచించబడినదే. పల్లెపాటలు బృందగానములకు ఎంతో చక్కగా పనికివస్తాయి. అదేకాకుండా వాటిలో భావావేశమునకు ప్రాముఖ్యము ఉంటుంది గాని మేధస్సుతో అంతగా పని వుండదు. అందు వల్ల అవి సహజత్వంతో కూడుకుని జనసామాన్యమును ఇట్టే ఆకట్టు కుంటాయి.

## కొండజాతుల రాగగతులు

కొండ తెగలవారికి సంగీతంపట్ల సహజ సిద్ధంగా ఆసక్తి ఉంటుంది. వాళ్ల పురాతన సంస్కృతిని నేటికి కాపాడుకుంటూ వస్తున్నారు. ఇక్కడ పులయర్ తెగవారి పాటలను గురించి పరిశీలిద్దాం.

ఈ పులయర్ తెగవారు పాడుకునే శ్రావ్యగీతాలను తాళములు అంటారు. వీళ్ల గీతాలు గానకోకిల, గానపక్షి మున్నగువాటి స్వరములనుంచి పుట్టాయని అంటారు. వీళ్ల గీతములకు కరగనిచ్చి తాళం, మంగళనాద తాళం, కుంద్ర తాళం అని పేర్లు ఉన్నాయి. శాస్త్రీయ రాగములయిన శుద్ధసావేరి, సరస్వతి శంకరాభరణము, ఆందోళిక బృందావన సారంగ మున్నగువాని లక్షణములు వీళ్ల శ్రావ్యగీతములలో కానవస్తున్నాయి. వీళ్ల గీతాలను వింటే ఒళ్లు గగుర్పొడుస్తుంది. వీళ్ళవాజ్య సమూహమునకు సింగారం (శృంగారం) అనిపేరు. వీళ్ళ వాద్యములలో రెండు చిన్న నాదస్వరములుగా రెండు మేళములూ, మరియు జత చేతిగజ్జెలూ చోటుచేసు కుంటాయి. వీలిక్కు-జల్ (పిల్లనగ్రోవి) మరియు మద్దలి (మద్దెల) మున్నగు వాటిని వీళ్ళు ప్రార్థనాగీతములు పాడుతున్నప్పుడు ఉపయోగిస్తారు. వీళ్ళు నృత్యము చేస్తూ పాడుతారు. కొన్నిపాటలు నృత్యమునకు చక్కగా అతుకుతాయి.

## కులావై గీతాలు

ఈ కులావై గీతాల రాగములు మంద్రముగానూ శంఖనాదము లాగను ఉంటాయి. ఈ గీతాలను పొలంపనులు చేసుకునే స్త్రీలు తిప్పుతూ పాడు

తారు. వ్యవసాయంలోనూ, సంగీతంలోనూ ముందంజవేసిన తంజావూరు జిల్లాలోని వ్యవసాయ స్త్రీలుపాడే కులాపై పాటలు ఎంతో శ్రావ్యంగా ఉంటాయి.

ఈ స్త్రీలు మోకాలులోతు బురదలో వంగి పైర్లు నాటుతున్నప్పుడు సత్వరంగా పని జరగటానికీ పర్యవేక్షకులను గౌరవించడానికీ ఈ కులాపై పాటలు పాడుతారు. వరిపొలాలగుండా ఎవరైనా వెళితే ఈ స్త్రీలు తమ పాటలతో వాళ్ళని శ్లాఘించి వారినుంచి కానుకలుగా డబ్బులు తీసుకుంటారు.

## నయ్యాండి మేళం (వెక్కిరింత మేళము)

ఇందులో నాదస్వర మేళమును అనుకరించడం జరుగుతుంది. ఈ మేళము గ్రామీణ నృత్యనాటకాల్లో ఉపయోగిస్తారు. ఈ వాద్య గోష్ఠిలో రెండునాదస్వరములు రెండుతబలాలు, ఒక పంబ. ఒకటముకు మరియు ఒక జతతాళములు ఉంటాయి. ఈ వాద్య గోష్ఠిలో విశేషమేమిటంటే వాద్యగాళ్ళు సైతం నాట్యంలో పాలుపంచుకుని ఆడుకుంటూ వాద్యంవాయిస్తారు. కరగం, కావడి పాయ్‌కుదిరై, కురవంజి నృత్యము మున్నగువానిలో ఈ నయ్యాండి మేళం వాడుతారు.

## విల్లుపాట్టు (విల్లుపాట)

సనాతన సంగీతమునకు ప్రతీకగా నిలిచే గ్రామీణ గీతములలో విల్లుపాట పేర్కొనదగినది.

పదుహేనవ శతాబ్దములో ఒక ఆస్థానగాయకుడు ఈ విల్లుపాటను సృష్టించాడని ప్రతీతి. ఈ విల్లుపాటకు కావలసిన వాద్యములలో ధనుర్వాద్యము ముఖ్యమైనది. వింటి ఆకారములోవున్న ఈ పెద్దవీణలాంటి వాద్యమునకు కంచుగంటలు పొదిగి ఉంటారు. ఈ విల్లు వాయించే గాయకుడు రెండు సన్నని బెత్తములను చెరొకచేతిలోను పట్టుకుని భావమునకూ తాళమునకూ

అనువుగా ఈ విల్లు వాద్యము తంత్రులను మీటుతాడు. ఈ బెత్తమును వీసుకోల్ అంటారు.

ఒకడు ఉడకధరించి యుంటాడు. ఇంకొకడు కచ్చులనబడే కొయ్యచెక్కలతో తాళము నిర్ణయిస్తాడు.

ఈ వాద్యమును పాటకు అనువుగా వాయిస్తూ తందాన పాటలాంటి భావస్ఫోరకంగా పాడుతూ శ్రోతలను ఉర్రూతలూగిస్తారు. ఈ కార్యక్రమము దేవాలయముల ఎదుట ఆరుబయట ఏర్పాటు చేయడం జరుగుతుంది. ఇవి మామూలుగా దేవాలయములలో జరిగే ఉత్సవములలో అంతర్భాముగా వారం రోజులు జరుగుతాయి. శ్రోతలందరూ దేవాలయమువైపుతిరిగి కూర్చుని ఈ కార్యక్రమమును వింటారు.

ముఖ్యకథకుడు పాటలోని ప్రతిపాదమునూ పూర్తిచేయంగానే ఉడుక్కువాద్యగాడూ తదితరులూ పాదములలోని చివరిపదమును పునరుచ్చరించడమో లేదా 'ఆమా' (ఔను) అనే ఊతపదమును చెప్పడమో జరుగుతుంది.

ఈ విల్లు పాట గోష్ఠిలో మామూలుగా ఎనమండుగురు ఉంటారు. చెప్పే కథల నిడివిని బట్టి ఈ కార్యక్రమము కొన్నిరోజుల తరబడి జరుగుతుంది, రామాయణము, భారతములాంటి పురాణ గాథలు చెప్పవలసివస్తే ఈ కార్యక్రమాలు మూడు నాలుగు రోజులదాకా కొనసాగుతాయి. కథకుడు శ్రోతల వైఖరిని గుర్తించి కావలసినప్పుడు విరామం ఇస్తాడు.

ఈ పాటలు చాలా సరళంగా ఉండి తందాన పాటమోస్తరులో సాగుతాయి, వీటిలో సామెతలు, జాతీయములు తగుపాళ్ళలో ఉంటాయి, మాత్రా చంధస్సు రాగానికి అనువుగా అమరుటేగాక ప్రతి రెండు చరణాలు అంత్య పదములతో కూడుకుని ఉంటాయి. ముఖ్యగాయకుడు ఆపగానే ఆగోష్ఠిలోని ఇతర గాయకులు అంత్యపదాన్ని పాడుతూ శ్రోతలకు బాగా కథలో కుతూహలం ఏర్పడేలా చేస్తారు.

ఈ పాటలోని కథావస్తువులు కొన్ని సమయాల్లో మాయా మంత్రజాలము లను గురించి కూడా వుంటాయి, కొన్ని సమయాల్లో పౌరాణిక, దైవిక, చారిత్రాత్మక, సాంఘిక కథలుకూడా చోటుచేసుకుంటాయి.

మాయా మంత్రజాల కథలు చెప్పడానికి ఈ విల్లుపాట ఎంతో అనువైనది. ఈ కథలన్నీ మామూలుగా వాడుకలో వున్నవే. దయ్యాలు, భూతాలు-వాటి అద్భుతాలు గురించి ఈ పాటల్లో చెప్పడం జరుగుతుంది. ఎలాగయితేనేం-న్యాయం ఎప్పుడూ అన్యాయాన్ని జయిస్తుంది. అని చాటటమే ఈ పాటల్లోని ముఖ్యోద్దేశము.

## పళయనూర్ నీలి కథ

ఈ విల్లు పాటలలో చెప్పబడే అతిప్రబలమైన కథలలో పళయనూర్ నీలి కథ ఒకటి. ఇది తిరునల్వేలి జిల్లాలో బాగా వాడుకలో వుంది. ఈ కథ ఒక భగ్నప్రేమను గురించి వివరిస్తుంది. ఒక జన్మనుంచి మరోజన్మదాకా కథ సాగుతుంది.

ఈ కథలో వర్తకజాతికి చెందిన ఒక యువకుడు నీలితో వివాహమై కొన్ని నెలలలోనే ఇంకో యువతిని వలచి భార్యను నిర్లక్ష్యం చేస్తాడు. ఒక రోజు ఆ ఉంపుడుకత్తె తన ప్రియుని చూడటంకోసరం నీలి ఇంటికి వెళుతుంది. నీలి కోపంతో తలుపు మూసి ఆమెను తిప్పిపంపించేస్తుంది. దానితో క్రోధముచెందిన ఉంపుడుకత్తె నీలి మీద ప్రతీకారం తీర్చుకోవడానికి పూను కుంటుంది. తన ఇంటికొచ్చిన ప్రియుని తిరస్కరిస్తుంది. అతను కారణం అడగగానే తనకు నీలి ద్వారా జరిగిన అవమానాన్ని పూస గుచ్చినట్లు వివ రిస్తుంది. ఆతను తగిన చర్యతీసుకుంటానని తన్ను లోపలికి రానివ్వమని ప్రాధేయ పడతాడు. అయినా ఆ ఉంపుడుకత్తె నీలి మెడలోని మంగళ సూత్రాన్ని తీసుకొస్తేనేగాని తను అంగీకరించనని మొండిపట్టు పడుతుంది. తరువాత ఆ యువకుడు నీలి దగ్గిరకు తిరిగివెళ్ళి ఆమెతో కొన్నినెలలు కాపురం

చేస్తాడు. ఒక రోజు అతను తన భార్యతో దూరంగా వెళ్లిపోదామనీ అప్పుడే తను ఉంపుడుకత్తె బారినుంచి తప్పించుకోవచ్చని చెపుతాడు. ఆమె నమ్మ తిస్తుంది. ఇద్దరూ ఒకరాత్రి ఆ ఊరొదలి అడవి మధ్యవున్న ఒక బావి వద్దకు చేరుతారు. ఆ రాత్రి వెన్నెల కాస్తుండటంవల్ల, గర్భిణియైన నీలి తన భర్తతో ఆ బావిచెంత ఉల్లాసంగా గడపాలని కోరుతుంది. ఇద్దరూ అక్కడ పరుపు పరుచుకుని పడుకుంటారు. నీలి తన్మయత్వంలో భర్తను కౌగలించు కుంటున్నప్పుడు సరిగ్గా ఆలాటి సమయంకోసరమే ఎదురు చూస్తున్న ఆ యువకుడు ఆవిడ మెడలోని మంగళసూత్రమును తెంపుకుని ఆమెను ఆ పాడు బావిలో తోసేస్తాడు. ఆ తాళిబొట్టుని తీసుకుని తన ఉంపుడుకత్తెను చేరు కుంటాడు. మొదటి జన్మకథ ఇక్కడితో ముగిస్తుంది.

మరుజన్మలో భార్యను హత్యచేసిన ఆ యువకుడు వ్యాపారస్తుడుగా జన్మి స్తాడు. అతను పూర్వజన్మలో నివసించిన పట్టణమునకు పనిమీద వెళుతూ అదే పాడు బావిదగ్గర ఒక పౌర్ణమి రాత్రి బసచేస్తాడు. నీలి ప్రేతాత్మ అత్యంత అందమైన యువతిగా ప్రత్యక్షమై నువ్వే నాభర్త అని చెబుతుంది. అతను ఆమె వేపు కొన్ని క్షణాలు చూసి మోహినీ పిశాచమని సందేహించి తిరస్కరిస్తాడు తరువాత పక్క ఊళ్లోని పెద్దమనుషులు వీళ్ళతగాదాను సాంతం విని అతను ఆమె భర్తేనని తీర్పుచెప్పడం జరుగుతుంది. ఆ ఊరి పెద్దమనుషులు ఈ దంపతుల కోసరం ఒక యిల్లుకేటాయిస్తారు. నీలి మొహంలో ఆనందానికి అంతేలేదు. పూర్వజన్మలో తను ఎలాంటి కోరి కలతో ఉన్నప్పుడు అతనిచే హత్య చేయబడినదో అలాంటి కోరికలతో అతన్ని గట్టిగా పెనవేసుకుని అతని ప్రాణాల్ని బలికొంటుంది. మరునాడు ఆ ఊరి పెద్దమనుషులు వచ్చి చూస్తే అక్కడ యువకుడి శవం మాత్రమే మిగిలిఉంది. ఈ కథ ఎంతటి ఉత్కంఠతో చెబుతారో విల్లుపాట రూపంలో వినవలసిందే.

## ఇతర కథలు

ఈ విల్లుపాటలలో శుడవై మదన్ అనబడే శ్మశాన దయ్యము కథగూడా

చోటు చేసుకుంటుంది. అనేక చారిత్రాత్మక కథలుకూడా విల్లుపాటలద్వారా ప్రచారమయాయి. ఇటీవలి కాలంలో కొత్తమంగళం సుబ్బు అనే తమిళ కవి గాంధీజీ జీవిత చరిత్రను విల్లుపాటలుగా రచించి నిరక్షరాస్యుల హృదయములను చూరగొన్నాడు.

దేవాలయములో ఉత్సవములు జరిగేటప్పుడు మత సంబంధమైన విల్లుపాటలు పాడుతారు. ప్రజలు ఈ విల్లుపాటలంటే ఎంతో ఆసక్తి చూపుతారు "విల్ల దిచ్చాన్ కోయిలిపే విళక్కేట్ర నేరమిలే" అనేసామెతకూడా వాడుకలో వున్నది. అంటే గుడిలో విల్లు పాట వినిపించగానే స్త్రీలంతా దీపాలు పెట్టడం కూడా మరచిపోయి దేవాలయము దగ్గర కథ వినడానికి వెళ్లిపోతారని అర్థం.

ఇంకో ముఖ్యమైన విల్లుపాట పేరు మరుద నాయగం పిళ్లైలో ఆ కథ. ఒకదుష్టుడు తన అన్న భార్యను చెరచడానికి వేసిన ఎత్తులు వివరించబడతాయి.

తిరునల్వేలి ప్రాంతములలో చిన్నతంబి అనే మరోపాట అత్యంత ప్రచారములోవున్నది. ఆ పాటలో ఒక ధనికుడయిన భూకామందు భూతము దగ్గర్నించి ధనకోశమును సంపాయించడం కోసరము తన దగ్గిర పనిచేసిన ఒక బీదకూలీని వంచించి అతని ఒకే కొడుకును నరబలి ఇవ్వడం కథాంశముగా చెప్పబడినది.

ఈ విల్లుపాటలలో కేవలం కథలు మాత్రమే కాకుండా అప్పుడప్పుడు ఆశుగానముతో వాద ప్రతివాదములు ఏర్పాటుచేస్తారు. ఈ గోష్టి రెండు పక్షములుగా విభజింప బడుతుంది. ఒక పక్షములో విల్లు గాయకుడూ ఇద్దరు కొయ్య చెక్కల తాళగాళ్లు-ఉంటారు. మరో పక్షములో ఘటమువాయించేవాడు, ఉడుక్క వాద్యగాడు మఱియు వారికి వెనక పాట పాడేవారూ ఉంటారు. మొదటి పక్షమువారు కుడివైపున పాడటంవల్ల కుడివైపు గాయకులనీ (వలదే పాడు బవర్) రెండో పక్షమువారు ఎడమవైపున పాడటంవల్ల ఎడమవైపు

గాయకులనీ (ఇడదే పాడు బవర్) అంటారు. కుడివైపువారు అప్పటి కప్పుడే ఒక ప్రత్యేక మెట్టులో పాటకడతారు. వారి పాటలు ప్రశ్నల రూపంలో ఉంటాయి. ఎడమ వైపువారు అదేరాగంలో అదే తాళంలో పాటలు కట్టి ఆ పాటలకు సమాధానం చెబుతారు.

కన్యాకుమారి జిల్లాలోని షెణ్ బగ్ రామన్ పుత్తూర్ గ్రామంలో జరిగే విల్లుపాటల వాదోపవాదాలలో కుడివైపు గాయకులచే ప్రశ్నరూపకములో పాడే విల్లు పాటల అనువాదం క్రింద ఇవ్వబడింది.

పంచాక్షరముల వరస ఏదీ
సూటిగా చెప్పగలవా?
హరి అంటే అర్థమేమిటో
సరిగా చెప్పగలవా?
విల్లు పుట్టిన గాథ ఏమిటి?
వివరించగలవా?
విల్లుపైన ఈ బెత్తము ఎలావచ్చెను
విడమరచి చెప్పగలవా?
విల్లులోని చిరుగంటల నాదము
వివరించగలవా?
విల్లు పొందని వారికి
వివరించగలవా?
పోటీలో గెలవడం సాధ్యపడదు
పొండి, పారి పొండి ఇప్పుడే....

తమిళంలో పంచాక్షర అంటే శివాయనమః అని ప్రతి శైవుడికీ తెలిసిన విషయమే.

ఇరవి కుట్టి పిళ్లై గురించిన విల్లుపాట కన్యాకుమారి జిల్లాలోని అరళ్ వాయ్ మొళి అనే గ్రామంలో పాడతారు. ఇరవి కుట్టి పిళ్లై అనే సేనానాయకుడు

నాంజిల్ నాడు ప్రజల రక్షణ కోసరం యుద్ధభూమిలోకి ఎలా ప్రవేశించినదీ వర్ణింపబడుతుంది. ఈ వాదోప వాదములలో ఒక పక్షం వారు కంచుగొప్ప దంటే మరో పక్షం వారు వెండిగొప్పదని పాడుతారు. వాళ్ళ వాదోపవాదములు ఈ క్రింది పాటల రూపంలో సాగుతాయి.

ఏనుగు పైని అంబారీ
కంచుతో చేయబడింది
అన్నిరకాల భేరీలు
కంచుతో చేయబడ్డాయి
బాకాలు నాగారాలు
కంచుతో చేయబడ్డాయి

ఇలా కుడివైపు గాయకులు పాడితే ఎడమవైపు గాయకులు అదేతీరులో వెండిని శ్లాఘిస్తూ క్రిందివిధంగా పాడుతారు.

రవిపిల్ల ముత్యాల గొడుగు
వెండితో చెయ్యబడింది.
రాజ సేవకుల వింజామరలు
వెండితో చెయ్యబడ్డాయి
పట్టాకత్తులు నశ్యపుడబ్బీ
వెండితో చెయ్యబడ్డాయి.
రాజ సభలోని చైనా గాయకుని
పిల్లనగ్రోవి వెండితో చెయ్యబడినదే।

## లావణి

**దండయాత్ర:—** ఇది కూడా విల్లు పాటకచేరీలా వాదోపవాదములకు పనికివచ్చే పాటల పోటీయే. ఈ కార్యక్రమములు ఏప్రిల్ మే నెలలమధ్య

వసంత ఋతువును పురస్కరించుకుని తంజావూరు జిల్లాలోను తిరుచ్చిరాపల్లి లోని ముఖ్య ప్రాంతములలోను మధురై నగరములోను జరుగతవి.

ఇందులో ఒక పక్షము వారు కామాధినేత అయిన మన్మధుని (కామన్) శివుడు కాల్చిబూడిద చేశాడని వాదిస్తే రెండో పక్షమువారు ఆ కథ కేవలం అతిశయోక్తితో కూడుకున్నదనీ, శివుడు భస్మముచేసినది కేవలము కామ వాంఛను మాత్రమేనని మన్మధుడు చనిపోలేదనీ అసంఖ్యాకములైన హృదయ ములలో అతను చోటు చేసుకుని ఉన్నాడనీ వాదిస్తారు. వీళ్ళ వాదోపవాద ములు పాటల రూపంలో పాడడంవల్ల వానిలో మత పౌరాణిక విషయాలు చోటు చేసుకుంటాయి. ఒక్కొక్క పక్షమువారు ప్రత్యేకముగా వాద్యగోష్ఠి కలిగి వుంటారు. పురాణములనుంచీ శాస్త్రములనుంచీ దృష్టాంతములు పేర్కొనడం జరుగుతుంది. గాయకులు తమ వాగ్ధాటితోనూ, సూక్ష్మబుద్ధి తోనూ శ్రోతలను ఇట్టే ఆకట్టుకుంటారు ఈ లావణి కార్యక్రమము చివ రగా మన్మధుని దిష్టిబొమ్మ చేసి తగులబెడతారు. ఈ లావణి గానము మహారాష్ట్రనుంచి తమిళనాడులోకి ప్రవేశించినదనీ, రాజా సెర్ఫోజీ ప్రోద్బ లంతో ఇదిబాగా ప్రచారములోకి వచ్చిందని అంటారు పురాతన కాలమునించీ తమిళనాడులో జరుగుతున్న కామన్ ఉత్సవములో శోకనాదములు చోటు చేసు కుంటున్నాయి. కామదేవుని బొమ్మచేసి దాని ఎదుట పాటలు పాడతారు.

## గొబ్బిళ్ళు (కుమ్మి)

ఆడపిల్లలు ఆడుతూ పాడుకునే పాటల్లో ఈ కుమ్మి ముఖ్యమైనది ఇందులో కుమ్మి మరియు ఒయిల్ కుమ్మి అని రెండు రకాలు. మామూలు కుమ్మి ఆటలో ఆడపిల్లలు పాటల కనువుగా వివిధ భంగిమలలో ఆడుతారు. ప్రేక్షకులకు ఇది ఎంతో ఉల్లాసంగా ఉంటుంది.

ఈ గొబ్బెళ్ళలో చప్పట్లు కొడుతూ ఆటకనుసరిపడే మెట్టులో పాడతారు.

## ఒయిల్ కుమ్మి

దీనిని ఒయిల్ ఆట్టం అని కూడా అంటారు. అనేక మంది మగవాళ్లు కలసి కాళ్ళకు గజ్జెలు కట్టుకుని పురాణ గాథలు పాడుతూ ఈ ఆట ఆడతారు. ఈ పాటలలో దైవప్రార్థనలే కాకుండా పక్కవారు ఇరుగుపొరుగు వాళ్ళకు తగలకుండా సావధానముగా ఆడాలనే హెచ్చరికకూడా కలసి వుంటుంది.

## కప్పల్ పాట్టు (ఓడ పాట)

ఈ ఓడ పాటను పడవ పాట అనికూడా అంటారు. నావికులు తటాకములలోనూ నదులలోనూ అలలకూ, గాలికీ ఎదురొడ్డుతూ నావను నడిపిస్తున్నప్పుడు తమ కష్టమును మరిచేందుకుగాను ఈ పాటలు పాడతారు.

## కోలాట్టం (కోలాట)

కోలలు తట్టుతూ ఆడుకోవడంవల్ల దీనికి కోలాట్టం అనే పేరువచ్చింది. ఇటీవలి కాలంలో బాలికలు ఈ ఆటను పాఠశాలల్లో జరిగే వార్షికోత్సవము లాటి సందర్భములలో ప్రదర్శిస్తున్నారు.

ఈ ఆట పుట్టుకకు సంబంధించిన పురాణగాథ ప్రచారములో వున్నది. పూర్వం బసవాసురుడు అనే రాక్షసుడుండేవాడు. అతనిని ఎవరూ జయించలేక పోయారు కొందరు బాలికలు కలసి బసవడి దగ్గరికెళ్ళి మృదు మధురంగా గానంచేస్తూ కోలాట్టము ఆడారట. ఆ రాక్షసుడు బాలికల నృత్యమును చూసి ఎంతయినా సంతోషించాడట. అప్పట్నించీ తన క్రూరత్వమును విడిచిపెట్టాడట. దీని జ్ఞాపకార్థముగా తమిళనాడులోని పలు ప్రాంతములలో కోలాట జాతర అనే పండుగ జరుపుకుంటారు. శివుని జంటగా కొలువబడే బసవడు (కోడె) ఈ కోలాటము పండగలలో ప్రాముఖ్యము

వహిస్తాడు. ఈ ఉత్సవములు మామూలుగా దీపావళి రోజున ప్రారంభమవుతాయి. మరుసటి పౌర్ణమి రోజున ముగుస్తాయి. రోజూ ఆడపిల్లలు సూర్యోదయమునకు మునుపే నదిలోకెళ్ళి స్నానముచేసి పచ్చిగడ్డి మరియు పవిత్రజలమూ కొని వచ్చి బసవని విగ్రహము (బంక మట్టితోచేసినది) ప్రతిష్ఠించిన చోటికి చేరుతారు. ఆ పచ్చిగడ్డినీ నీటినీ బసవనిముందుంచి కోలాట్టం వేస్తారు. తర్వాత వాళ్ళు పీలు చూసుకుని గ్రామములోని ఇళ్ళముందుకివెళ్లి కోలాటము ఆడుతారు. ఇంటి యజమానులు వీరికి కానుకలు ఇస్తారు. పౌర్ణమి రోజున ఈ ఆడపిల్లలంతా కొత్తదుస్తులు ధరించి బసవవిగ్రహమును ఒక పల్లకిలో ఉంచి నదీతీరమునకు తీసికెళ్లి గంగలో కలుపుతారు ఈ కోలాటములో పాల్గొనే ఆడపిల్లలు చెరో చేతిలోనూ ఒక కోలధరిస్తారు. వాళ్ళు వలయాకారంలో తిరిగివస్తూ ఒకరి కోలలో ఒకరు లయబద్ధంగా కొడుతున్నప్పుడు చెవులకింపైన సంగీతధ్వని పుడుతుంది.

## హరికథా కాలక్షేపము

ఈ హరి కథా కాలక్షేపములు మూడు నాలుగు గంటలమేరకు ఆశువుగా జరుగుతవి. తమిళనాడులో వీటిని ప్రవేశపెట్టినది మహారాష్ట్రి పాలకులే. హరికథా దాసు గంభీరముగా ఉండుటయే కాక బహుభాషలలో పండితుడై తన నేర్పరి తనమును చూపుతాడు. అతను తన చేతిలోని చెక్కతాళములను వాయిస్తూ కథాగానము చేస్తాడు.

హరికథలలో మామూలుగా పురాణ కథలు చోటుచేసుకుంటాయి. మీనాక్షి కల్యాణము, సీతా కల్యాణము, రుక్మిణీ కల్యాణము మున్నగు కథలు ముఖ్యమైనవి. హరికథాదాసు పాత్రలకు తగినట్లు గొంతు మార్చి భావానుగుణముగా సంభాషించుటేగాక శ్రావ్యముగా పాడుతాడు. శ్రీ కృష్ణుడు రుక్మిణిని రథముపై ఎక్కించుకుని పోవు ఘట్టము వచ్చినప్పుడు రథ చక్రముల సవ్వడి లాగా వాద్యము సమకూర్చబడుతుంది.

ఇటీవలికాలంలో ఈ హరికథా కాలక్షేపముల స్థానములో మత బోధనలూ, ఇతర ఉపన్యాసములూ చోటుచేసుకుంటున్నాయి. ఈ ఉపన్యాసములలో ప్రస్తుత పరిస్థితులపై విసుర్లు హాస్యాలు చోటుచేసుకుంటాయి. ఈ హరి కథాకాలక్షేపములో సంగీతం అతి కీలక పాత్రవహిస్తుంది. కథానుగుణముగా సంగీతము అమరితేనే అతను శ్రోతలను ఆకట్టుకోగలడు. హరికథాదాసు వివిధ విషయములలో సంపూర్ణజ్ఞానము కలిగి వుండి సంగీతముతోనూ మృదు వైనకంఠముతోనూ, గ్రామీణ సాహిత్యములోనూ ప్రేక్షకులను ఆకర్షించ గలిగితే తన కాథాగానములో సఫలీకృతుడు కాగలడు.

ప్రతిరోజూ దేవాలయములలో ఏ ఏ కార్యక్రమములు జరుగుతాయో తెలుసుకోవాలంటే తమిళులు తమ తమిళ దినపత్రికలలోనూ ఆంగ్లదినపత్రిక లలోనూ ఈ నాటి విశేషములు శీర్షికను చూపిస్తారు.

రోజుల తరబడి రామాయణము, భారతము పెరియ పురాణము, కంద పురాణము మున్నగు ఇతిహాసములపైన ఉపన్యాసములు జరుగుతాయి, శ్రోతలు అధిక సంఖ్యలో హాజరవుతారు.

ఇలాటి ఉపన్యాసములు నిరక్షరాస్యుల పాలిట విశ్వవిద్యాలయములవలె సహకరిస్తున్నాయి. ఈ ఉపన్యాసములలో పాల్గొను విద్వాంసులు మహా పురుషుల జీవిత రహస్యములను విపులముగా వివరించిచెప్పి జీవితములో ముక్తిని సాధించడమన్నది బీద ధనిక భేదము లేకుండా అందరికిని సాధ్యమే అన్న విశ్వాసమును శ్రోతలలో కలుగజేస్తారు.

## కావడి నృత్యము

శివనందనుడైన సుబ్రమణ్యస్వామి మామూలుగా ఒక చేతిలో తన ఆయు ధమునైన వేల్ (ఈటె) ను ధరించిన అతి సుందరుడైన బాలకుడుగా వర్ణింప బడుతాడే. అతని వాహనము పురివిప్పిన నెమలి, కొన్నికొన్ని సమ

యాల్లో అతను తనపత్నులైన వళ్ళి మరియు దైవానై సమేతముగా ప్రత్యక్ష మవుతాడు. రాక్షసులతో దేవతలకు జరిగిన పెక్కు పోరాటములలో ఇతను దేవసైన్యమునకు నాయకత్వము వహించునట్లు చెప్పబడుతుంది. రాక్షసుల దుష్టశక్తులనన్నిటినీ అతను పటాపంచలు చేశాడట. అందువల్ల అతను ఆరు "పడై వీడు" లలో (సైన్య స్థావరములు) నివసిస్తున్నట్టు పేర్కొన బడినది. వాటిల్లో మధురై జిల్లాలోనే పళని మరియు తిరుప్పరంకుంద్రం అనే రెండుస్థావరములున్నాయి. పూర్వకాలములో ఇడుంబన్ అనే రాక్షసుడు ఈ రెండు చిన్నకొండలను ఒక కొయ్యకు చెరో వైపున కట్టి తన భుజాన మోసేవాడట. తదుపరికాలంలో అతను సుబ్రమణ్యస్వామి ముఖ్య భక్తులలో ఒక్కడుగా మారిపోయాడు. పళని కొండపైకి ఎక్కుతున్నప్పుడు మార్గ మధ్యములో మనకు ఇడుంబన్ మండపము ఎదురవుతుంది. భక్తులు సుబ్రమణ్య స్వామిని పూజించే ముందు ఇడుంబన్‌ని సేవించి వెళతాడు. అలా చెయ్యకపోతే తమ పూజలు వ్యర్థమైనట్టే భావిస్తారు. ఇడుంబిన్ జ్ఞాపకార్థము ఈ రోజుల్లో సుబ్రమణ్య స్వామి భక్తులు కావడి కుండలు మోస్తారని ఇతిహాసములో పేర్కొనబడినది.

ఈ కావళ్ళలో పెక్కు రకాలున్నాయి. వాటిలో పాలుకావడి, పన్నీరు కావడి అతి ముఖ్యమైనవి. పసుపురంగు దుస్తులు తొడిగి మెడలో పూల మాలలు ధరించిన భక్తులు ఈకావళ్ళను భుజాలపై మోస్తూ, డోలు, సన్నాయి, టముకూ మున్నగు వాద్యములు పుట్టించే సంగీతములో తన్మయులై దారి పొడవునా నృత్యము చేస్తూ కొండపైకివెళ్ళి తమ మొక్కుబడులను చెల్లిస్తారు.

ఈకావడి ఆట తాండవ నృత్యశైలిలో సాగుతుంది. భక్తులు ఉత్సాహంతో వడివడిగా అడుగువేస్తూ ఆడుతుంటే చూపరులలో ఆనందమూ, ప్రేరేపణా ఉప్పొంగి తన్మయత్వంలో కావడివాళ్ళలో కలసి ఆడుతూపాడుతారు.

కొందరు భక్తులు మౌనవ్రతం పాటించడం కోసరం తమకింది పెదవులను రాగి లేదా ఇత్తడి తీగతో పొడిచి బంధించి ఉంచుతారు. ఈ నృత్యకారులు

అనేక కఠిన నియమముతో పాటించి కామ, క్రోధ లోభమదమాశ్చర్యాది గుణములను విసర్జిస్తారు. ఈ బృందములోని కొందరు భక్తులు "కావడి చ్చిందు" పాటలు పాడుతుంటే కావడి మోసేవాళ్ళు పాటలకు అనువుగా అడుగులు వేస్తారు. ఈ భక్తి పాటలను నేర్పరి అయిన ఒక భక్తుడు పాడితే మిగతావాళ్ళు వెనక పాటపాడుతారు. ఆపాటలు వింటూ ఆడుతున్న కావడి ఆటగాళ్ళు తన్మయత్వము చెందుతారు. కొన్ని సమయాల్లో ఈ కావడి ఆట గాళ్ళు ఆవేశ పూరితులైన కావడులను భుజముపైనా నెత్తిపైన ఉంచుకుని చేతితో పట్టుకోకుండా నేర్పుగా అడుగులు వేస్తారు.

తమిళుల కుశాగ్రబుద్ధిన చాటే ఈ కావడి చ్చిందు పాటలు సాహిత్యపరం గానూ శిల్పములుగానూ బాగా అభివృద్ధిచెంది ఇప్పుడు వివిధ రాగములలోనూ మెట్లలోనూ ప్రచారములో వున్నాయి. సరళమైన పదజాలములతో కూర్చబడిన ఈపాటలు శ్రోతలను గానలోలురుగా చేసి వాళ్ళలో ఈశ్వర జ్ఞానమును ప్రేరే పిస్తాయి. కావడి ఆటగాళ్ళు తమ అలసటను మరచిపోతారు. దూరదూర ములనుంచి పయనించే యాత్రికులు పాడుకోవడం వల్ల ఈ పాటలను "వళి నడైచ్చిందు" (పయాణ పాట) అని కూడా వ్యవహరిస్తారు.

ఈ కావడి పాటలను యాత్రకులేకాక దేవాలయములోని భక్తులూ పాడ తారు. కొన్ని దేవాలయములలో ఈ పాటలు నవరాత్రి ఉత్సవము చివరి రోజున అనేక మెట్లతో పాడుతారు. తిరుచ్చెందూరలోనూ పళనిలోనూ ఈ పాటలు నాదస్వర సమేతముగా దేవుడి ఊరేగింపు ముందర పాడతారు. ఈ పాటలు మురుగదేవునికీ వళ్ళికీగల ప్రేమానుబంధములను విడమరచి చెప్పుట వలన వీనిని సామాన్య జనం ఎంతో ఆనందంతో వింటారు.

సుమారు 25 విధముల కావడిచ్చిందు పాటలు గలవు. వాటిలో అణ్ణామలై రెడ్డియార్ కూర్చిన పాటలు అత్యంత ప్రాముఖ్యత వహిస్తున్నాయి.

## కరగ నృత్యములు

ఈ గ్రామీణ కళ మారియమ్మల్ అనబడే గ్రామదేవతలను పూజించడం

కోసం రూపొందినది. వీటిలో భక్తిపరమైనదీ-కేవలం వృత్తికోసరం సాగేవి—రెండు రకముల కరగ నృత్యములున్నాయి.

భక్తితో కూడిన కరగము శక్తికరము అని పిలువబడుతుంది. ఒక చిన్న కడవను నీటితోనింపి పైనకొబ్బరికాయ ఉంచుతారు. తరువాత ఆ కడవను పూలతోనూ, ఆకులతోనూ అలంకరించి ఇలా తయారైన కరగము శిఖరాగ్రమునందు ఒక నిమ్మపండును ఉంచుతారు. ఈ కరగమును గుడి పుజారి కానీ అతని అనుయాయుడు గానీ కడుభక్తితోనూ, జాగరూకతతోనూ నెత్తిన మోస్తూ వెళతారు. ఇది వారికి వంశపారంపర్యముగా వచ్చే హక్కు.

వృత్తిగా సాగే కరగమును ఆట్ట కరగం అని అంటారు. జనాన్ని రంజింపజెయ్యడము కోసరం నేర్పరులైన ఆటగాళ్లు అక్కడక్కడా ఈ కరగనృత్యాలు ఏర్పాటుచేస్తారు. న్యూఢిల్లీలో ప్రతిఏడాదీ జరిగే రిపబ్లిక్‌దినోత్సవాలలో ఈ కరగనృత్యము తమిళనాడు తరపున తప్పక జరుగుతుంది.

ఈ ఆటుకరగ నృత్యములలో పంబ, ఉరుమ, తబలా, నాదస్వరము మరియు టముకు మున్నగు వాద్యములు ఉపకరిస్తాయి. ఈ కరగ ఆటగాళ్లు ఒంటికి బిగుతుగా దుస్తులు ధరించి సైనికులవలె దర్శనమిస్తారు. వీళ్ళు శిలప్పదికారం కావ్యములో పేర్కొనబడిన 'కుడుక్కూత్తు' నాట్యకారులను జ్ఞప్తికితెసారు.

కరగము అంటే అభిషేకమునకు పనికివచ్చే పవిత్ర జలముతో నిండిన కడవ అని అర్థము. వరుణదేవుని సముద్రము లన్నియును, పవిత్రమైన సప్తనదులూ పూజాసమయములలో ఈ కరగములో సంగమము చెందుతాయని నమ్మిక. ఈ కరగములోని నీటితో దేవుని విగ్రహమును కడిగినతర్వాత సముద్రములూ, నదులూ తమ తమ యథా స్థానములకు చేరుకుంటాయట.

పూర్వకాలములో పచ్చిక మైదానములో నివసించిన ఒక తమిళ తెగవారు తమ జీవనాధారమైన నీటికోసరం మారియమ్మాళ్‌ను (వానదేవతను),

గంగమ్మ కావేరియమ్మ మున్నగు నదీమ తల్లులను కొలవడం మొదలెట్టారు. ఆ కాలంలో ఈ కరగ నృత్యము వాడుకలోకి వచ్చింది. ఆ కాలంలో స్త్రీ పురుషులు కలసి ఈ నృత్యములలో పాల్గొనేవారు.

తిరునల్వేలి జిల్లాలో ఈ కరగనృత్యమును అమ్మన్ కొండాడి అంటారు. అంటే అమ్మ ఆరాధనా నృత్యము అని అర్థము.

కరగం ఆటగాడు తన ఒళ్ళంతా గంధమూ విబూదీ పూసుకుని చిన్న గౌను లాంటి చొక్కా వేసుకుంటాడు. అతను తలపైన కరగమును జాగ్రత్తగా మోస్తూ ఒక పవిత్రస్థలమునుంచి బయలుదేరి ఊరేగింపుగా గుడికి వెళ్తాడు. వడి వడిగా కదం తొక్కుతూ తన చేతిలోని కోలను గాని, కత్తినిగాని, ఝళిపిస్తూ ఉంటాడు. ఇద్దరు వాద్యగాళ్ళు తప్పెట వాయిస్తుంటే ఒకతను పొడుగాటి సన్నాయి వాయిస్తాడు. మెల్లి మెల్లిగా ప్రారంభమైన ఈ కరగ నృత్యము అతి ఉధృతముగా సాగుతుంది. కరగం ఆటగాడు పూనకం వచ్చి ఎంతవేగంగా కదం తొక్కుతున్నా తలపైవున్న కరగంమాత్రం జారి పడ కుండా జాగ్రత్త పడతాడు. అతను కరగమును చేతులతో పట్టుకోడు. ఈ వింతను చూస్తున్న జనం ఇదంతా దేవుడి మహిమ అని చెబుతారు. ఈ కరగ నృత్యగాడికి నేపథ్య సంగీతము సమకూర్చేది నయ్యాండి మేళగాళ్ళు. ఈ కరగ నృత్యము అతి ప్రాచీన కాలమునుంచి వాడుకలో ఉంది. దీనిని గురించి ఉపనిషత్తులో "కరగ నృత్యగాడు సంగీతమునకు అనువుగా నాట్యము చేస్తున్నా తలపైవున్న కరగముపట్ల జాగురూకతతో ఉంటాడు. అలాగే జీవితంలో ఎన్ని వ్యాపకాలున్నా మనస్సు ఎప్పుడూ నిశ్చలంగా ఉండాలి" అని ఉటంకించబడి వున్నది.

## పురాపపాట్టు (పావురాయి పాట)

ఈ పావురాయి పాటలు తమిళ దేశంలో క్రీ. శ. పదకొండవ శతాబ్దంలో

నుంచి వాడుకలో వున్నాయి. వీటిలో ముఖ్యంగా ప్రేమ-అనురాగము కథాంశములుగా ఉంటాయి.

ప్రేమించి విరహము అనుభవించే ప్రియురాలు తన విరహ వేదనను జంతువులకు, పక్షులకు, నాగలికీ, గాలికీ విన్నవించుకుని తన ప్రియుడిదగ్గరికి వెళ్ళిచెప్పమని వేడుకుంటుంది.

## పురది ఆట్టం

దీనిని పొయ్‌కాల్ కుదిరై అని కూడా అంటారు. తొలి చోళ చక్రవర్తుల కాలంలో రూపొందింపబడిన ఒక వింత నృత్యము. సిలప్పదికారములో పేర్కొనబడిన మరక్కాల్ ఆట్టం (కొయ్య కాళ్ళ ఆట) అనే నృత్యము ఆధారముగా ఈ కొత్తనృత్యము పుట్టి వుండవచ్చును. ఇది మహారాష్ట్రి పాలకుల కాలంలో చక్కగా అభివృద్ధి చెందినది. ఈ ఆటగాళ్ళకు ఇప్పటికిని తంజావూరు ముఖ్య కేంద్రముగా వున్నది ఈ ఆటలు ఇప్పుడిప్పుడు మళ్లీ పునర్జీవము పొంది బహుళ ప్రచారములో వున్నాయి. ఈ ఆటగాళ్లు తమ గ్రామీణశైలితోబాటు అప్పుడప్పుడు భరతనాట్యమును కథకలి నృత్యమునుకూడా అనుకరిస్తారు.

ఈ పొయ్ కుదిరై (నకిలీ గుఱ్ఱం) జనపనార, అట్టముక్కలు మరియు కాగితాలు గాజుముక్కలూ కలిపి తయారు చేస్తారు. ఒక గుఱ్ఱము తయారు చేయుటకు సుమారు 6000 రూపాయలు ఖర్చవుతుంది. ఈ ఆటలో స్త్రీ పురుష లిద్దరూ పాల్గొంటారు.

అట్టతో తయారు చేసిన గుఱ్ఱమే ఈ ఆటలో ముఖ్య ఆకర్షణ. నాట్యగాడు ఈ గుఱ్ఱములో దూరబడి చూపరులకు అశ్వారూఢుడివలె కనిపిస్తాడు. అతని కాళ్ళకు కొయ్య కాళ్ళు కట్టబడి ఉంటాయి. వాటిపైన నిలదొక్కు

కుని ఆడటానికి నెలల తరబడి అభ్యాసము చేయవలసి ఉంటుంది. ఇలా అతని కాళ్ళకు కొయ్యకాళ్ళు కట్టడంవల్ల అతని పాదాలకు రాళ్ళు రప్పలు పాము తేలూ తగిలే ప్రమాదము ఉండదు.

ఈ నృత్యమును స్త్రీ పురుషు లిద్దరూ కలిసి జంటగా రాజురాణీ వేషములతో ఆడుతారు. వీళ్ళు కొన్ని సమయాలలో గారడీచేసి ప్రేక్షకులను గంటలకొద్దీ ఆకట్టుకుంటారు.

కొత్త ఢిల్లీలో ఏటేటా జరిగే రిపబ్లిక్ దినోత్సవములలో ఈ నకిలీ గుర్రపు ఆట ఒక ప్రత్యేక ఆకర్షణ. దీనిలో పాల్గొనేందుకై తమిళనాడునుంచి ప్రతీసారీ గ్రామీణ కళాకారులు వెళుతుంటారు.

## పావైకుత్తు (బొమ్మలాట)

ఈ బొమ్మలాట మత సంబంధమైన గాథలను ప్రచారము చేసేందుకు ఉపకరిస్తుంది. ఇది తిరుక్కురళ్ గ్రంథములో "మరప్పావై" (కొయ్య బొమ్మ) అని పేర్కొనబడినది. తరువాత కాలంలో ఈ బొమ్మలాట తెలుగు వీధి నాటకములలోని లక్షణములను చేకూర్చుకుంది. ఈ ఆటలు తమ గ్రామములో జరిపిస్తే తమకు దుష్టశక్తుల బెడద తప్పుటేగాక ఐశ్వర్యములు చేకూరుతాయని గ్రామీణులు విశ్వసిస్తారు. ఈ ఆటలలో రామాయణ భారత భాగవతములలోని కథలు చోటుచేసుకుంటాయి.

ఈ కొయ్య బొమ్మలను సన్నని దారములతోనూ ఇనుప కడ్డీలతోను పైనించి వేలాడదీస్తారు. స్టేజి నాలుగు మీటర్ల పొడవుంటుంది. ఈ స్టేజి మీదుగా బొమ్మలుమాత్రమే కనిపిస్తాయి. బొమ్మలు ఆడించుటలో నైపుణ్యము గల కళాకారులు తెరమరుగున ఉంటూ ఈ బొమ్మలను తమ చేతులతో అతి చాకచక్యంతో ఆడిస్తారు. బొమ్మలనుంచి నల్లనిదారములు ఆడించే వాళ్ళ చేతులకు కట్టివుంటాయి. ఈ దారములు ప్రేక్షకులకు కనిపించవు.

ఈ ఆట సాధారణముగా రాత్రి పదిగంటలకు మొదలై వేకువజామున 4 గంటలకు ముగుస్తుంది. ఇలా ఈ ఆటలు వారంనుంచి పదిరోజులదాకా కొనసాగుతాయి. స్టేజికి ఇరువైపులా పెద్ద పెద్ద దివిటీలు వెలిగిస్తారు. తెల్ల నల్లని వస్త్రముతో సుమారు మూడుమీటర్లు ఎత్తుగా చెయ్యబడి ఉంటుంది. ఈ నల్లని తెర ముందర బొమ్మలు ఆడించబడతాయి.

చంద్రమతి బొమ్మ, నాట్యకత్తెబొమ్మ ఆడుతున్నప్పుడు ఆటగాళ్లు చాలా ప్రయాస పడవలసి ఉంటుంది. నిజానికి వాళ్ళ దేహములోని ప్రతి అంగమూ చురుకుగా కదిలితేగానీ స్టేజిపైన బొమ్మ నాట్యము సరిగా కుదరదు. చంద్రమతి తన మెదడులోని దండను త్రుంచి పారవేసి స్మశానములో పొర్లి పొర్లి శోకించే ఘట్టము ప్రేక్షకులను కదలించి వేస్తుంది.

కొండొక కాలంలో ఐశ్వర్య దేవత అయిన లక్ష్మి దుష్టశక్తుల నన్నిటిని ఒకచోట చేర్పించి సర్వనాశనం చెయ్యడం కోసరం పదకొండు విధములుగా నాట్యము వేసిందట. వాటిలో ఒక నాట్యమునకు అనుకరణే ఈ బొమ్మలాట అని అంటారు. ఇది ప్రజా జీవితములో సమున్నతమైన ఆదర్శములను నెలకొల్పడానికి సహకరిస్తున్నది. ఉదాహరణకు సత్య హరిశ్చంద్రుని నాటకమును చెప్పవచ్చును. అందులోని నీతి ఏమిటంటే-ఎన్ని కష్టాలు ఇక్కట్లు ఎదురయినా ఆడి తప్పకూడదు.

## తోలు బొమ్మలాట

ఈ తోలు బొమ్మలాట మహారాష్ట్ర పాలకులచే తంజావూరులో ప్రవేశ పెట్టబడి తదుపరి కాలంలో తమిళనాడులోని ఇతర ప్రాంతములకు వ్యాప్తి చెందినది. ఈ బొమ్మలు ఇంచు మించు మనుషులంత పరిమాణములో చేయబడి ఉంటాయి ఈ బొమ్మలు మందముగల మేకతోలుతో కత్తిరింప బడి ఉంటాయి. అక్క డక్కడ కీలు ఉండటంవలన వాటికి కావలసిన భంగిమలలో కదిలింపవచ్చును. వాటిలో ఆడ మగ దేవీ దేవతలు,

రాక్షసులు మరియు జంతువుల బొమ్మలుంటాయి. వాటి వాటికి తగినవిధంగా రంగులు పూయబడతవి. వాటిని తెర వెనుక ఆడించడం జరుగుతుంది. కడు జనరంజకంగా ఉంటుంది.

## కురవంజి (ఎరుకలసాని ఆట)

ఇది తమిళులకు ప్రత్యేకమైన ఒక నృత్యనాటకము. ఇది సనాతన కళలా కును గ్రామీణ కళలకును ప్రతీకగా నిలచి అందరికీ వినోదం చేకూర్చుతుంది.

తమిళనాడులో వందల కొలది కురవంజి నాటకములు ప్రచారములో వున్నాయి. వాటిలో కొన్ని ఇటీవలి కాలంలో ముద్రితమైనవి. చాలావరకు అన్ని అముద్రితములుగానే వున్నాయి. ఒక నాటకము మాత్రము రాగముల సూచికలతో సహా ముద్రితమైనట్లు తెలుస్తున్నది. పరిశోధనా వేత్తలచే సంస్కరింపబడిన కొన్ని కురవంజి నాటకములు మద్రాసులో ప్రదర్శింప బడినవి. కురవంజి నాటకముల పునరుద్ధరణ కోసరం మద్రాసులోని కళా క్షేత్రము మరియు ఇసై సంఘంలాంటి సంస్థలు మెచ్చుకోదగిన సేవచేశాయి. ఈ కళను తొలుదొల్త ఆదరించి పోషించిన వాడు రాజ రాజచోళుడు. అతను వార్షికోత్సవములలో కురవంజినాటకముల ప్రదర్శనకు అనువుగా తంజావూరు లోని బృహదీశ్వరాలయంలో ప్రత్యేకంగా ఒక రంగస్థలము నిర్మించాడు. అది కురవంజిమేడై (కురవంజి వేదిక) అనే పేరుతో ప్రఖ్యాతి గాంచినది.

ప్రతి కురవంజి నాటకములోను నాట్యకత్తె అయిన, కథానాయిక స్థానిక దేవునిగాని రాజకుమారుని గాని ప్రేమిస్తుంది. ఆమె సుబ్రమణ్యస్వామి ఎదుట తనకోరిక ఈడేరవలెనని ప్రార్థిస్తుంది. దేవుని గొప్పతనమును, ప్రకృతి సంపదను, పైరుపంటలనూ ప్రశంసిస్తుంది. కురవంజి నాటకములోని నాట్య కత్తె హస్తసాముద్రికము చెప్పుటగూడా ఒక ప్రధానాంశము. ఈ ఎరుకల సాని నాట్యగత్తెకాకుండా ఇంకా ఇతర గాయకులు, వాద్యకారులు, ఇతర

చెలికత్తెలూ కలపి ఈ నాటకమును రక్తి కట్టిస్తారు. కథానాయిక తన విరహ వేదనను చెలికత్తెలకు విన్నవించుకుని తన ప్రియుణ్ణి తన దగ్గరకు చేర్చమని ప్రతిమాలుకుంటుంది.

కొన్ని దశాబ్దముల క్రితము వరకూ దేవాలయములలో ఈ కురవంజి నాటకములు నక్రమముగా జరుగుతుండేవి. కురవంజి కళాకారులు ఎల్లప్పుడూ సర్వసన్నద్ధులై ఉండేవారు. దేవాలయములలో దేవదాసీల నృత్యములను నిషేధిస్తూ చట్టము రావడముతో ఈ కురవంజి నాటకములు నిర్లక్ష్యము చేయబడ్డాయి. అయినా మన ప్రాచీన సంస్కృతిపై జరుగుతున్న పరిశోధనల ఫలితంగా ఈ కురవంజి నాటకములు మళ్ళీ వెలుగులోకి వచ్చాయి. కురవంజి సాహిత్యము పరిశోధనలకు ఎంతో ఉపకరించింది. ఈ నాటకములలో కురత్తి (ఎరుకలసాని) పాడే పల్లెగీతాలలో తమ నివాసములైన కొండప్రాంతములను గురించిన వర్ణన ఎంతో సులభ భాషలో సాగుతుంది. తిరుకుట్రాల కురవంజిలాంటి నాటకములు కవితాత్మకంగా ఎంతో విలువ కలిగి వున్నాయి. విరాళిమలై కురవంజి చక్కని సంగీతమునకు ప్రసిద్ధి గాంచినది. అళగర్ కురవంజిలోనూ, తిరుమలై ఆండవర్ కురవంజిలోనూ సాహిత్యమూ, సంగీతమూ - రెండూ ప్రాముఖ్యము వహిస్తాయి. కురవంజి నాటకముల మూలరూపములు అలాగే నిలిచివున్నా వాటిసంగీత నృత్యగతులు కాలానుగుణంగా మార్పు చెందాయి.

తిరుక్కుట్రాల కురవాళి నాటకంలో ఒక కొండజాతిపిల్ల ఒక ధనవంతుల కన్నెపిల్ల చెయ్యిచూసి జోస్యము చెప్పడానికి రప్పించ బడుతుంది. ఆ ధనవంతుల కన్నెపిల్ల స్థానిక దేవుడిపై మరులుగొని వుంటుంది. కొండజాతి పిల్ల జోస్యముచెప్పి ప్రతిఫలంగా అనేక కానుకలు పొంది ఇంటికి తిరిగి వెళితే భర్త ఆమెను సందేహించి కొట్లాడుతాడు. చివరికి ఇద్దరి మధ్య సయోధ్య కుదురుతుంది. ఈ కథ నృత్య నాటకంగా రూపొందింపబడి తరతరాలుగా దేవాలయ ప్రాంగణములలో ప్రదర్శింపబడుతూ వుంది.

తిరుచ్చెందూర్ దేవుడయిన చెంగిల్ మురగన్ చుట్టూ అల్లబడిన చెందిల్ కురవంజి నాటకంలో కథానాయిక మదన మోహిని తన చెలికత్తెలతో వినోదిస్తూ, రంగస్థలముపై దర్శనమిస్తుంది. ఆమె ఎదురుగుండా ఊరేగింపుగా వస్తున్న ఆరుముగని చూసి అతని అందమునకు ముగ్ధురాలై అతన్ని ప్రేమిస్తుంది. వెంటనే ఆమె తన చెలికత్తెలను చూసి అతని గురించి ఆరా తీస్తుంది. అతను చెందిల్ మురుగన్ అని తెలుపుతారు. తరువాత మదన మోహిని విరహవేదన అంతా ఆమె తన చెలికత్తెలను ఉద్దేశించి పాడే ద్విపద గీతములలో వర్ణింప బడుతుంది. ఆమెచెలికత్తెలలో ఒకరై మురుగ దేవుని వద్దకు రాయబారం వెళుతుంది. ఇప్పుడు కందమలై ప్రాంతమునకు చెందిన ఎరుకలసాని ప్రత్యక్షమై తన దేశపు సౌభాగ్యమును విపులంగా వర్ణించి చెబుతుంది. తరువాత ఆమె మదన మోహిని హస్తములోని రేఖలు చదివి ఆమె కోరిక తప్పక ఫలిస్తుందని జోస్యము చెబుతుంది. మదన మోహిని తను మురుగ దేవుని పెళ్ళాడినట్టు కలగని ఎరుకలసానికి విలువైన బహుమతులను ప్రసాదిస్తుంది.

ఎరుకలసాని మొగుడైన సింగన్ ఇప్పుడు ఆమెని వెతుక్కుంటూ వస్తాడు. హాస్యము, ఆహ్లాదమూ కలుగచేసే ఉపకథ ఇది. ఆ భార్యపైన సింగన్ ప్రదర్శించే కోపమంతా ఆమె తెచ్చిన కానుకలను చూడటంతో మాయమవుతుంది. ఇద్దరూ ఒకటవుతారు. తరువాత మంగళ గీతము పాడుతూ నాటకమును ముగిస్తారు.

## అరయర్ నటనం

తిరువాయ్మొళి అనే ధ్యానశ్లోకములను పాడుతూ వైష్ణవభక్తులు డిశంబర్ జనవరి నెలల్లో శ్రీ రంగం ఇంకా ఇతర వైష్ణవ దేవాలయములలో ఈ నృత్యము ప్రదర్శిస్తారు.

ఈ గాయకులు అరయర్ అని పిలువబడతారు. ఆలయ సిబ్బందిగా గుర్తింపబడి జీత భత్యములు పొందుతారు. వీళ్ళు యూనిఫారం దుస్తులు ధరించి ఉంటారు. పూజా సమయములలో కిరీటము ధరించి గానంచేసే టప్పుడు చేతులలో తాళములు ధరిస్తారు. వీరిలో ఒకడు అభినయం చేస్తాడు. మధ్య మధ్యలో కొండాట్టం అనే గీతములు పాడి దేవుడి గొప్పతనమును శ్లాఘిస్తారు.

ఈ అరయర్ తెగవారు ప్రత్యేకమైన కొన్నినాట్యపద్ధతులను అభ్యసిస్తారు. వీళ్ళ అభినయ రీతులు సనాతనమైనవే కాకుండా ముఖ్యంగా బాలకృష్ణుని చిలిపి చేష్టలను అభివర్ణించేవిగా ఉంటాయి

## పొదికళి ఆట్టం

పాండిచ్చేరి తీరప్రాంతములలోని బెస్త తెగలవారు తమ కులదేవుడు అయిన మురుగన్ ఉత్సవములలో ఈ నాట్యం ప్రదర్శిస్తారు. ఎనిమిది నుంచి పదహారు మందిదాకా కూడుకున్న బృందము తమ సంప్రదాయమునకు తగిన దుస్తులు ధరించి ఈ నాట్యములో పాల్గొంటారు. తప్పెటలు వాయించ బడతాయి. ఈ నాట్యమునకు ఎక్కువగా స్త్రీలే సంగీతము సమకూరుస్తారు.

## భాగవత మేళ

భారతదేశపు సనాతన నృత్యవిధానమునకు ప్రతీకగా నిలిచే భరతనాట్యము నేటిదాకా చెక్కు చెదరక నిలచి వుంది. భరతనాట్యములోని భంగిమలను ఆకళించుకుని తమిళనాడులో ఎన్నో గ్రామీణ నృత్యరీతులు పెంపొందాయి. వాటిల్లో నాట్టువ మేళము వారి సదిర్ నాట్యముకూడా ఒకటి. ఇది పూర్వకాల ములో దేవదాసి స్త్రీలచే ప్రదర్శింప బడుతూ వచ్చిన రూపకము. అంటే ఇందులో భరతనాట్య ఆచార్యులకు ప్రమేయము లేదన్నమాట. ఒకప్పుడు

తమిళనాడులో బహుళ ప్రచారములో ఉండే ఈ భాగవతమేళం ఇప్పుడు తంజావూరు జిల్లాలోని మేలమూరు గ్రామమునకు మాత్రమే పరిమితమైనది. మే-జూన్ నెలల్లో జరిగే నరసింహ జయంతి ఉత్సవాలలో ఈ మేళం జరుపబడుతుంది. దేవాలయమునకు ఎదురుగా వీధులలో పెద్ద పెద్ద పందిళ్లు వేసి వాటిలో చిన్న వేదికలు నిర్మించి అక్కడ నాటకములు ప్రదర్శింపబడతాయి.

భాగవతమేళ అనబడే ఈ నృత్య నాటకము తేనెలాంటి తియ్యటి గాత్ర సంగీతముతోనూ, వాద్యసంగీతముతోనూ కూడుకుని ఎంతో వినసొంపుగా ఉంటుంది. ఈ నాటకములో సంభాషణలోని చక్కనిశైలి, అభినయములో ఉపయోగించే సంకేతములు ప్రేక్షకులను మురిపిస్తాయి. ఇందులో యుద్ధము, హత్యలు మున్నగు భీభత్సదృశ్యములను ప్రదర్శించక కేవలం కథనం ద్వారా నడిపిస్తారు. ఈ నృత్య నాటకములు ప్రాచీన సంగీతరీతులతోను, నాట్య రీతులతోను కూడి వుండుటచే నాటకరంగంలోని వారిని విశేషంగా ఆకర్షిస్తుంది. ఇందులో పాల్గొనే ప్రతి నటీనటులూ భరతనాట్యంలో చక్కగా శిక్షణపొంది వుంటారు

ఈ నృత్యనాటిక కోణంగి (విదూషకుడు) ప్రవేశించడంతో ప్రారంభమవుతుంది. అతను కొద్దినిముషములు నాట్యముచేసి ప్రేక్షకులను ఓపికగా నాటకమును వీక్షించమని ప్రార్థిస్తాడు. వాద్యగోష్టివారు తోడయమంగళం (ప్రార్థనా గానము) పాడుతారు. తర్వాత నాటకమును గురించిన ఉపోద్ఘాతము ఉంటుంది అప్పుడు గణేశదేవుడు ప్రత్యక్షమై నాటకమును ఆశీర్వదిస్తాడు. మామూలుగా ఒక చిన్నబాలుడు గణేశుని వేషముధరించి స్టేజీపైకివచ్చి వాద్య సంగీతమునకు అనువుగా నృత్యము చేస్తాడు. ఒక్కొక్క పాత్రనూ పరిచయం చెయ్యడం జరుగుతుంది. ఈ తతంగములన్నీ ముగిశాక నాటకం మొదలవుతుంది.

## శంఖ వాద్యము

గ్రామీణ ప్రజలు శంఖముపట్ల ఎంతో భక్తి ప్రదర్శిస్తారు. శంఖము నకు అతికించబడిన వెండి సన్నాయిద్వారా ఈ శంఖవాద్యమూ వాయింప బడుతుంది వెండి సన్నాయి కొసను నోటితో పలికిస్తారు. ఈ గొట్టంలో పిల్లనగ్రోవిలో వలె ఎలాటి రంధ్రములూ ఉండవు. కావలసినంత ధ్వనిని లేపుటకు ఈ శంఖువాద్యమును ఊదేవాడు కడు నైపుణ్యమును ప్రదర్శింప వలసి ఉంటుంది. ఈ శంఖవాద్యపు ధ్వని సన్నాయి మరియు ముఖవీణలు కలగలిపిన నాదస్వరమును పోలి వుంటుంది.

పళనిలో పండారములనబడే పూజారులు ఈ శంఖ వాద్యమును మేళ వాద్యములకు అనువుగా ఊదుతారు.

ఈ శంఖ వాద్యములతో గాన కచేరీలుకూడా ఏర్పాటు చేయబడతాయి. ఈ కచేరీలో ఉపయోగింపబడే శంఖమును ధవళశంఖము అని అంటారు. దీనిలో నోటితో ఊదే గొట్టమునకు అర అడుగు పొడవున మరొక గొట్టము అమర్చబడి ఉంటుంది. దీనిని వాయించేవాడు ఎంతో నేర్పరి తనమును ప్రదర్శింపవలసి ఉంటుంది.

ఈ శంఖమును వ్యవసాయ క్షేత్రములోకూడా వాయిస్తారు. శంఖారావము వలన పైరు పంటలు బాగా పండుతాయని గ్రామీణులు నమ్ముతారు. దీనిని శాస్త్రవేత్తలు సైతము ప్రస్తుతము అంగీకరిస్తున్నారు. ఐన్ కురునూరు మున్నగు తమిళ గ్రంథములు పూర్వకాలమునందు వ్యవసాయదారులు మడక దున్నటానికి ముందు వలంపురి శంఖములను వాయించేవారని పేర్కొంటు న్నాయి. ఇప్పటికిని దేవాలయపు భూములు దున్నేటప్పుడు ఈ ఆచారము పాటిస్తున్నారు.

## నవ సంధి

తిపచ్చెందూర్ దేవాలయములో వార్షికోత్సవములప్పుడు ధ్వజ ఆవిష్కరణను పురస్కరించుకుని సంగీత సమేతముగా ఈ నవసంధి నృత్యములు జరుపుతారు.

## గ్రామీణ నృత్యములు

మనం ఇచ్చట కొన్ని గ్రామీణ నృత్యములు నృత్యనాటకములను గురించి ప్రస్తావిస్తాము. గ్రామీణులను ఆకట్టుకోవడం కోసరం ఇవి అనేక రూపములలో సినిమాలలో ప్రవేశ పెట్టబడుతూనే ఉన్నాయి. అంటే తమిళనాడులో సినిమా పరిశ్రమ అభివృద్ధి ఈ పల్లెప్రాంతపు ప్రజలపైననే ఆధారపడి ఉన్నది.

## కురవై కూత్తు

ఇందులో ఏడుగురు ఆడ పిల్లలు వలయాకారంగా తిరుగుతూ చప్పట్లు కొడుతూ నాట్యము చేస్తారు. ఇది తమిళ గ్రంథమయిన సిలప్పదికారంలో ఆచ్చియర్ కురవై (యాదవుల నృత్యముగా) పేర్కొనబడినది.

దీని సంగీతములో ఒక ప్రత్యేకతవుంది. ఇందులో సప్తస్వరములూ ఒక్కొక్క అమ్మాయికి వర్తింప బడుతుంది. ఈ నృత్యలక్షణములు కొన్ని అమ్మపొంగ అనే గ్రామీణ నృతములో కనిపిస్తాయి. ఆ నృత్యము చేసేటప్పుడు బాలికలు వలయాకారముగా తిరుగుతూ చప్పట్లుకొడుతూ పాడుకుంటూ లయబద్ధంగా ఆడతారు. మహాకవి సుబ్రమన్య భారతి ఈ నృత్యము గొప్పతనాన్ని వేనోళ్లకొనియాడారు. "ఇందులో పాటల మాధుర్యం చప్పట్లధ్వనితోబాటు ఆడపిల్లల గాజుల గలగలలు కూడా అతి ప్రాముఖ్యత వహిస్తాయి" అని చెప్పారాయన.

## కళై కూత్తు

ఇది గారడీ లాటిది. ఇందులో పాల్గొనే ఆటగాడు రెండు వెదురుబొంగు లపై నిలబడి తన భార్య వేసే డమరువు దరువులకు అనువుగా కదంతొక్క వలసివుంటుంది. శ్రీ విల్లిపుత్తూర్‌లోని ఆండాళ్ దేవాలయపు శిల్పములలో ఈ నృత్యమునకు మాదిరి భంగిమ ఒకటి కానవచ్చుచున్నది.

## కణియన్ ఆట్టం

ఇందులో వర్ణనాత్మకంగా కొనసాగే పాటలుంటాయి. ఇద్దరు విదూషకులు (ఆడ-మగ) కలసి ఈ పాటలు పాడతారు ఈ పాటలను నడుస్తూ కూడా పాడవచ్చును. అందువల్ల ఈ ప్రదర్శనకు ప్రత్యేకించి రంగస్థలము అవ సరములేదు. ఈ ఏకాంకి నృత్యము ఒకప్పుడు గ్రామదేవతల గుళ్ళలో అత్యంత ప్రాముఖ్యత వహించేది. కాని రాను రాను ఈ నృత్యము మరు గున పడిపోతున్నది.

## నాట్యము—పుట్టు పూర్వోత్తరాలు

తమిళనాడులో నాట్యము మరియు నృత్య నాటకమూ మతపరమైనవి. శివుడు ఉత్తమ నృత్యకారుడుగా పేర్కొనబడి నటరాజుగా ప్రసిద్ధి కెక్కాడు. యోగీశ్వరులకు ఈశ్వరుడైన శివుడు ఆనంద తాండవము అనే నృత్యముచేసి మన్నూ మిన్నూ ఏకం చేసి ముక్తిమార్గము చూపించాడని ఇతిహాసములు చెబుతాయి. నటరాజ విగ్రహమును చూస్తే అందులో ఆ నాట్యములోని లక్షణములు ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. చిదంబరములోని నటరాజ దేవా లయము నాట్య మందిరముగా పేర్కొనబడినది.

బ్రహ్మాండమైన ఈ దేవాలయములోని ఒక గోపురముయొక్క లోపలి కుడ్యములకు నృత్య భంగిమలు చెక్కబడి వున్నాయి. నృత్యములలోని ప్రతి కరణమునూ ప్రతిబింబిస్తూ ప్రత్యేకముగా శిల్పములు చెక్కబడి ఒక దానిపై నొకటి పేర్చబడి రాతి స్తంభములుగా తీర్చబడి వున్నాయి.

పూర్వకాలంలో తమిళనాడులోని పెద్ద పెద్ద దేవాలయములలో సంగీత నృత్య కార్యక్రమములు ఉదయం నుంచి సాయంత్రందాకా జరుగుతూ ఉండేవి. దేవుడికి మేల్కొలుపుగా ఉదయం గానం సాగేది. మళ్ళీ రాత్రి పూట అతనిని నిద్రపుచ్చడానికి లాలి పాటలు పాడేవారు వీటి మధ్యలో నాట్యవినోదములు జరిగేవి.

రాజ రాజ చోళుడు దేవాలయములలో సుశిక్షితులైన, నేర్పరులైన నాట్యకారులనూ. నాట్యకత్తెలను నియమించేవాడు. వారు తమ సంతానములకు తమ కళాకౌశలమును నూరిపోసేవారు. ఆడపిల్లలు చిన్న వయస్సులోనే దేవాలయములకు తమ్ము తాము సమర్పించుకోవడంవల్ల వాళ్ళను దేవదాసీలని పిలవడం జరిగింది. వారికి సంగీత నృత్యములలో శిక్షణ ఇవ్వటానికి నాట్టువనార్ అని పిలువబడే నాట్యాచార్యులు ఉండేవారు. దేవదాసీలకు దేవాలయ పురోహితుడు దేవుడితో పెళ్ళి జరిపించి వాళ్ళ మెడలో మంగళ సూత్రములు బంధించేవాడు. ఏడు సంవత్సరములు సంగీత, నృత్యములలో శిక్షణ పొందిన తర్వాత ఈ దేవదాసీలకు 'అరంగేట్రము' (ఆవిష్కరణ) అనబడే తొలి ప్రదర్శనలు ఏర్పాటు చేసేవారు. ఆ ప్రదర్శనములలో రాజు పాల్గొని వారికి బిరుదులు ప్రదానము చేసేవాడు.

తంజావూరులోని బృహదీశ్వరాలయములో పూజానృత్యములు, బృంద గానములు మున్నగు కార్యక్రమములలో పాల్గొనుటకు గాను దాదాపు నాలుగు వందలమంది దేవదాసీలు ఉండేవారు. దేవాలయ వంటలకోసరం బియ్యము శుభ్రము చేయుట, పేడతో నేలను, గోడలను అలుకుట, పుష్పములమ చేర వేయుట మరియు విబూది పళ్లెములను మోయుట మున్నగు పనులు కూడా ఈ దేవదాసీలకు అప్పగించేవారు. కొందరు రాజభవనమును అలంకరించుటలో

నిమగ్నులై ఉండేవారు. వాళ్ళు తమ సేవకు జీతభత్యములు పొందుతూ రాజకుటుంబము వారిని పరామర్శించుటేగాక రాణికి చెలికత్తెలుగను మసలు కునేవారు. గొప్ప సంస్కారవంతులైన స్త్రీలు, విదుషీమణులు, గౌరవ నీయమైన కుటుంబములకు చెందిన స్త్రీలు - జీవితాంతము దైవకార్యములలో పాల్గొనుటకుగాను తమకు తామై గుడికి అంకితమై దేవదాసీలుగా మారిపోయే వారు.

తంజావూరులో రాజరాజచోళుడు బృహదీశ్వరాలయమును నిర్మించుటకు ఒక నర్తకియే కారణమని పల్లెప్రజలు చెబుతారు. నర్తకి అపురూప సౌందర్య వతి. ఆమె దేవుడి సాన్నిధ్యములోతప్ప మరెక్కడా నాట్యము చేయనని పట్టుబట్టింది. ఆమె తండ్రి ఒకశిల్పి. అతను రాజుదగ్గర తన కూతురి గురించి విన్నవించుకుని ఆమెకు చేయూతఇమ్మని వేడుకున్నాడట. వెంటనే రాజు బృహదీశ్వరాలయమును నిర్మించి ఆ నాట్యకత్తెచే తొలినృత్య ప్రదర్శన ఏర్పాటు చేయించెనట.

దేవాలయములో చెరపట్టబడిన దేవదాసీలకు మాత్రమే పరిమితమైనందున తమిళదేశపు నాట్యకళ - కాలము చెల్లినదీ, మొరటుదనముతో కూడుకున్నదనీ, అనాచారమైనదనీ, అసభ్యమైనదనీ - అపవాదములకు గురికావలసి వచ్చింది. ఏమైతేనేం - ఈ దేవదాసీపద్ధతి మూలముగానే ప్రాచీనకాలంనించి నాట్యకళ పరిరక్షింప బడుతూ వచ్చింది. దేవదాసి విధానమునకు నిరసనగా సాగిన ఉద్యమము వల్లనయితేనేమి పెక్కు సాంఘిక సంస్కరణల వల్లనయితేనేమి ఈ దేవదాసి పద్ధతి నిర్మూలింపబడినది. స్వాతంత్ర్య పోరాటములో నిమ గ్నులై, ఈ ప్రాచీన కళలపట్ల ప్రజలు కాస్త నిర్లక్ష్యవైఖరిని అవలంబించడం ప్రారంభించారు. భరతనాట్యము కూడా నిరాదరింపబడింది.

స్వాతంత్ర్యానంతరం గౌరవ ప్రదమైన మధ్యతరగతి కుటుంబములు ప్రముఖనాట్య శిక్షణాలయములైన కళాక్షేత్రము, రాష్ట్రీ సంగీత నాటక అకాడమీ మున్నగు సంస్థలు చొరవతీసుకుని కొత్త కళాకారులకు తగిన

ప్రోత్సాహమునిచ్చి ఈ నాట్య కళను పునరుద్ధరించి ప్రజలకు వాటి ప్రాముఖ్య తను, విలువను విశదీకరిస్తున్నాయి.

సంఘములో వ్యాపించిన దురభిప్రాయమువల్ల వంశపారపర్యంగా నాట్య వృత్తి చేస్తున్న అనేక నాట్యకార్యులు తమవృత్తిని వదిలిపెట్టి వేరే జీవనాధారములు వెదుక్కోవడం జరిగింది. ఈ పరిస్థితులు ఇప్పుడిప్పుడు మారుతున్నాయి. పండనై నల్లూరు మీనాక్షి సుందరం పిళ్లెలాటి కొందరి ప్రముఖుల కుటుంబములు మాత్రమే ఈ నాట్యవృత్తిని అంటి పెట్టుకుని ఉన్నవి. అతను నాట్యశాస్త్ర పారంగతుడు గొప్ప నాట్యాచార్యుడు తన ఓరిమి వల్లనూ కళానై పుణ్యముతోనూ అతను అనేకమంది నాట్యకారులకూ నాట్యాచార్యులకూ శిక్షణయిచ్చాడు. అతని శిష్య వర్గంలో కొందరు ప్రభుత్వము నుండి బిరుదులూ, బహుమతులూ పొందారు. కొందరికి ఆర్థిక సహాయము చేకూర్చబడినది.

ఇటీవలి కాలంలో నాట్యకళపట్ల ఆసక్తి ఎక్కువ కావడమూ, ఆకళ పునరుద్ధరింప బడడమూ జరుగుతున్నది పేరుప్రఖ్యాతులు గాంచిన నాట్యకారుల విషయములను చూసి యువతీయువకులు వారి తల్లిదండ్రులు ఇప్పుడు నాట్యకళను అభ్యసించుటకు కాలమునూ, ధనమునూ ఎంతగానో వ్యయం చేస్తున్నారు. ఇప్పుడిప్పుడు నృత్య ప్రదర్శనములకు పెద్దసంఖ్యలో ప్రేక్షకులు హాజరవుతున్నారు. కొత్తకొత్త వారు (అరంగేట్రము) నృత్యము చేస్తున్నారు. ఈ రంగంలో కృషి చేస్తున్న గురువులూ, నాట్యాచార్యులూ ఎంతయినా అభివందనీయులు.

# 8వ అధ్యాయము

## గ్రామీణ నాటకములు, విందువినోదములు

తమిళనాడులో గ్రామీణ ప్రాంతములలో సర్వతోముఖముగా అభివృద్ధి గాంచిన వీధినాటకములు ఇతర వినోద కార్యక్రమములు వాడుకలో వున్నాయి. ఈ గ్రామీణకళలు తరతరాలుగా వాడుకలో వున్నందున నిర్దిష్టములై సంపూర్ణత కలిగి వున్నాయి.

### నాటకము

నాటకములను కళా రంగములలో ప్రదర్శించడమన్నది ఒకటవ రాజరాజ చోళుని కాలంలోనే వాడుకలో వుండేది. అంతకు పూర్వము నాటకములలో శ్రీకృష్ణలీలలు ఇతర పురాణములలోని కొన్ని ఘట్టములు మాత్రమే చోటు చేసుకునేవి. దేవాలయములలోని నాట్యమందిరములలో అనేక రకములైన నృత్యనాటకములు ప్రదర్శింపబడేవి. ప్రతి దేవాలయ ప్రాంగణములోనూ ఒక నాటకశాల లేక వేదిక తప్పక నిర్మించబడి ఉండేది. దేవాలయ ఉత్సవములను పురస్కరించుకుని ఈ నృత్యనాటకములు జరిగేవి. ఈ కార్యక్రమములు సామాన్య జనులను ఆకట్టుకునేలాగా రూపొందింపబడేవి. వాటిల్లో కథాంశములు ప్రజలలో ప్రభుభక్తిని, నాటకకళపట్ల ఆసక్తిని, దైవభక్తిని పెంపొందించేవి.

ఒకటవ రాజరాజచోళుని జీవితకథను రాజరాజ నాటకము అనే పేరుతో అతని పరిపాలనాకాలములోనే నాటకముగా రూపొందించడం జరిగింది. అందులో

అతని సేనల దిగ్విజయములు, బృహదీశ్వరాలయ నిర్మాణం-ఇత్యాదివిషయాలు విపులంగా వర్ణింపబడ్డాయి. రాజు సంతోషించి ఆనాటక కారులలో ఉత్తమ నటన చూపిన వారికి, మళ్లు మాన్యాలూ ఇచ్చి బిరుదులతో సత్కరించాడట.

ఈనాడు గ్రామీణనాటకం వీధినాటకం అని పిలువబడుతోంది. ఇందులో సంగీతము, నాట్యము మరియు దీర్ఘ సంభాషణలు చోటు చేసుకుంటాయి. వీరు హార్మోనియం, మృదంగం, వేణువు మున్నగు వాద్యమును ఉపయోగిస్తారు. వీళ్ళు ఉచ్ఛస్థాయిలో పాడుతారు. అప్పుడప్పుడు సినిమా పాటలు కూడా చోటు చేసుకుంటాయి. ప్రేక్షకులు మళ్ళీ పాడమంటే పాడినపాటనే మళ్ళీ పాడుతుంటారు.

ఈ తెరుక్కూత్తు (వీధి నాటకం) రాత్రి పదిగంటలకు ప్రారంభమై తెల్లారేదాకా సాగుతుంది. అందుకనే "కూత్తాడి కిళక్కే పార్పాన్. కూలి క్కారన్ మేర్కే పార్పాన్" అనే సామెత వాడుకలోకి వచ్చింది. అంటే నటుడు తెల్లారేదాకా నటించవలసి ఉంటుంది. కూలోడు పొద్దుగుంకేదాకా పనిచెయ్యాల్సి ఉంటుంది అని భావము.

దేవాలయములలో ఉత్సవములు జరిగినప్పుడు లేదా వాన కోసరం ఎదురు చూస్తున్నప్పుడు ఈ వీధినాటకాలు ఏర్పాటుచేస్తారు. కొన్ని కొన్ని సమయములలో గ్రామస్తులమధ్య తగాదాలు పరిష్కారమైనప్పుడు కూడా వీధినాటకాలు వెయ్యడం కద్దు. గ్రామ చౌకులోగాని, దేవాలయము ఎదుటగాని తాత్కాలికంగా ఒక వేదిక నిర్మించి వీధినాటకం ప్రదర్శిస్తారు. ఈ నాటకములకు ప్రవేశ రుసుము ఉండదు. ఖర్చులకోసరం గ్రామస్తుల దగ్గర చందాలు వసూలుచేస్తారు. ఈ వీధి నాటకములలో కొన్ని సందర్భములలో పరదాలు, రెక్కలు, రంగు రంగుల దుస్తులు మున్నగు వానిని ఎక్కువ మోతాదులో ఉపయోగించడం వల్ల వాని సహజత్వమూ, నిరాడంబరతా దెబ్బతింటుంది.

ఈ వీధి నాటకములలో ముఖ్యముగా వళ్ళిత్తురు మణం, పవళక్కొడి, అర్జునుడి తపస్సు, నల్ల తంగాళ్ మధురై వీరన్, పద్మాసురన్, కార్తవ

రాయన్, రామాయణం, హరిశ్చంద్ర శ్మశాన కాండం మున్నగు కథలు చోటు చేసుకుంటాయి. పండుగ చివరి రోజున నాటకము వేయవలసివస్తే హరిశ్చంద్ర నాటకం వేయరు. ఎందుకంటే పండుగ చివరి రోజున దుఃఖాంతములైన నాటకములు వేయకూడదనే నియమము పాటిస్తారు.

## మావిళి నాటకం

ఈ నృత్య నాటకము తంజావూరు జిల్లాలోని వేదారణ్యము దేవాలయమునకు సంబంధించినది. ఈ నృత్య నాటిక ప్రదర్శనము 1938లో అంతరించినది. ఒక పెద్ద ఎలుక దేవుని మూలస్థానములో అణగారిపోతున్న దీపమును ముట్టించి దేవుడి ఆశీర్వాదమును పొందుట ఇందలి కథాంశము.

## నొండి నాటకం

ఇదొక అవిటివాని కథ. ఒక యువకుడు వ్యభిచారిణి వలలోపడి డబ్బులు పోగొట్టుకోవడమే గాక ఆరోగ్యంకూడా పాడుచేసుకుంటాడు. అతను దొంగతనం చేస్తూ పట్టుబడటంవల్ల కాళ్ళు చేతులూ నరికి వేస్తారు. తరువాత ఆ కుంటివాడు సుబ్రమణ్యస్వామి భక్తుడుగామారి దూర దూరములలో వున్న స్వామి దేవాలయములకు నేలపై ప్రాకుతూ వెళ్ళి పూజలు చేస్తాడు. అతని దైవభక్తి బలంవల్లనూ, దేవుని దయ వల్లనూ అతనికి కాళ్ళు చేతులూ తిరిగొస్తాయి. ఈ నాటకం 'బిందు' మెట్టలో కొనసాగుతుంది. కుంటివాడు మామూలు మనిషి కావడంతో నాటకం ముగుస్తుంది.

## పగల్ వేషం

పగటి వేషము వేసేవాడు నటనలో ఆరితేరిన వాడుగను వేషధారణలో నేర్పరిగను ఉంటాడు. అతనిని గుర్తు పట్టడం కష్టం.

పగటి పూటలోనే అతను ఎక్కడో ఒకచోట బిక్షగాని వేషంలోనో, ఉపాధ్యాయుడు గానో, సోదెచెప్పే వాడుగానో దర్శన మిస్తాడు. అతని భార్య అతడితో వెళుతూ ఉంటుంది. ఉన్నట్టుండి వాళ్ళిద్దరూ కొట్లాడు కున్నట్టు నటిస్తారు. ఆమె అతణ్ని హేళన చేస్తుంది. అతను ఆవిణ్ని బెదిరిస్తాడు ఆమె ఏడుపు లంకించుకుంటుంది. వీధంట వెళుతున్న వాళ్ళు వీరి తగాదాని పరిష్కరించడానికి ప్రయత్నిస్తారు. కాని వాళ్ళ తగాదా అలాగే కొనసాగుతుంది. భర్త ఆవిణ్ని అలా నిర్లక్ష్యంచేసి దిక్కులేని దానిగా వదిలిపెట్టి పోతాడు. చూపరులకు ఆవిడపైన జాలికలుగుతుంది. వెంటనే ఒక కుల్లాయిలో ఆవిడకోసరం చందాలు వసూలు చెయ్యడం జరుగుతుంది.

## ఇరుళర్ నాటకములు

నీలగిరి ప్రాంతములోని నిరక్షరాస్యులైన ఒక వ్యవసాయ తెగకు చెందిన వారిని ఇరుళర్ అంటారు. వీరు గుళ్ళలో జరిగే ఉత్సవములలో పురాణ గాధలను నాటకములుగా ప్రదర్శిస్తారు. అందులో పరదా లుండవు. ఇంటి వసారాలో జరిగే ఈ నాటకములో వేదికకు వెలుగు చేకూర్చేది, హరికెన్ లాంతరు. ఈ నాటకములో పాల్గొనే పాత్రధారులు ఒక గురువు వద్ద తర్ఫీదు పొందుతారు. రోజుల తరబడి బద్దికలు వేస్తారు. మహా భారతములో వీరికి అత్యంత ప్రియమైనది అర్జునుడి ఘట్టము. అతని తపస్సును ఒక స్త్రీ విఘ్నము చెయ్యడానికి యత్నిస్తుంది. ఈ నాటకంలో వచ్చే సంభాషణలలో ఆ స్త్రీ సౌందర్యము ఒక్కొక్క అంగము గురించి పచ్చిగా వర్ణింపబడుతుంది. ఈ ఇరుళ జాతి ప్రజలు, ప్రత్యేకించి స్త్రీలు, ఆవర్ణనలపట్ల ఎంతో మోజు చూపుతారు.

## మోడి

ఈ మోడి తంత్రములో ఒకడు కోడిగ్రుడ్డును ఇసుకతో పూడ్చిపెట్టి దానిపై ఏడుగీతలు గీసాడు. ఆ కోడిగ్రుడ్డును పైకి తియ్యడానికి ప్రయత్నించే

వాడిని మోడి ఎత్తేవాడని అంటారు. అతని ప్రయత్నానికి విఘ్నం కలిగిస్తూ అవతలవ్యక్తి మంత్రజాలములు చేస్తాడు. మధ్యమధ్యలో ఒక విదూషకుడు ప్రవేశించి పాటలు పాడి ప్రేక్షకులను నవ్విస్తూ ఉంటాడు.

## ఇతర గ్రామీణ వినోదములు

పచ్చై కుత్తుదల్;- ఇదే పచ్చబొట్లు పొడుచు కోవడం. కొందరు ఎరుకల సానులు ఈ వృత్తిలో జీవిస్తారు. గ్రామీణులు చేతులపైన, భుజాలపైన నొసట్లో దేవుడి బొమ్మలు తేలుబొమ్మ, పాముబొమ్మ ఇంకా తమ పేర్లూ పొడిపించుకుంటారు. పసుపూ, అవిశాకూ బాగానూరి పల్చటి గుడ్డపైన పూస్తారు ఆనక ఆగుడ్డను ఎత్తివేసి దీపంలో వేసి ముట్టిస్తారు. అందులోని పొగచూరుతో పొగాకు బూడిదను, నల్ల తుమ్మపాలునూ కలిపిరంగు పదార్థములు తయారు చేస్తారు. నీలంరంగు పొడవాలంటే నీలిమందును ఉపయోగిస్తారు. ఎర్రటి చుక్కలు పొడవాలంటే ఇంగిలీకమును వాడుతారు.

మూడు సూదులను ఒక్కటిగా బంధించి పచ్చబొట్టు పొడిచే పరికరముగా ఉపయోగిస్తారు.

ఈ పచ్చబొట్లు పొడవడానికి ముందు కావలసిన మోస్తరులో చర్మముపైన దళసరి పుల్లతోరంగు అద్దుకుని గీస్తారు. తర్వాత సూదులతో పొడుస్తారు. ఆభాగమును బాగుగా కడిగి వేస్తారు. బొమ్మలోని గీతలను ఇంకోసారి ఇంకుతో దిద్దుతారు. నొప్పిష్టట్టకుండా కొద్దిగా కొబ్బరినూనె రాస్తారు. ఆపైన పసుపుపొడి పూస్తారు. అలాచెయ్యడం వల్ల రంగు చక్కగా కుదురుటయేగాక వాపు రాకుండా ఉంటుంది.

## కోలం

మన ముగ్గులను తమిళంలో కోలం అంటారు. ప్రతి ఆడపిల్ల తను వివిధ రకములైన ముగ్గులు నేర్చుకోవాలనీ ఇంటిని చక్కగా ఉంచుకోవాలనీ కోరు

కుంటుంది. తెల్లటి ముగ్గుపొడిని బొటన వ్రేలుకూ చూపుడువ్రేలుకు మధ్య పట్టుకుని నానారకములైన ముగ్గులు వేస్తారు.

ప్రతిరోజూ ఉదయం ఇంటిముంగిట్లో ఈ ముగ్గులు వేస్తారు. ఉత్సవ సమయాలో వీధివీధంతా ముగ్గులతో నిండిపోతుంది. కుండలపైనమూ పెళ్లి పందిళ్ళలోనూ ఈ ముగ్గులు వెయ్యడంఆనవాయితీ.

## వీధి కళాకారులు

అవిటివాళ్ళు బిచ్చగాళ్ళు రోడ్లలోని పేవ్‌మెంట్ల మీద బొగ్గుతోగాని, సుద్ద ముక్కతోగాని దేవుళ్ళ బొమ్మకిలను అత్యంత కళాత్మకంగా గీయడం చూస్తుంటాము. ఆ బొమ్మలలో అంగముల పొందిక రంగుల కలయిక - బాట సారులను ఇట్టే ఆకర్షిస్తాయి. వాళ్లు కాస్సేపు విలబడి ఆ బొమ్మలను తిలకించి యథాతథంగా ధర్మము చేసి వెళతారు.

## సిలంబమ్

తమిళనాడులో ఈ సిలంబమ్ గతకాలపు శౌర్య పరాక్రమములకు నిదర్శన ముగా నిలచివుంది. సిలంబాట్టం అన్నది తమిళనాడుకే ప్రత్యేకమైన ఒక యుద్ధక్రీడావినోదము. ఈ ఆటవలన పురుషులు వ్యాయామము చేయుటేగాక విరోధులు ముట్టడించినపుడు ఎలా ఆత్మరక్షణ చేసుకోవాలో నేర్చుకుంటారు. ప్రతి క్రీడాకారుడూ ఒక గట్టియైన మూడు మీటర్ల పొడవుగల వెదురు కొయ్య తీసుకుంటాడు. దానిని మధ్యలో పట్టుకుని తిప్పుతాడు. ఎదుటివ్యక్తి తన సామర్థ్యముతో దెబ్బలను తప్పించుకోవాలి. ఈ సిలంబమ్ ఆటలో కేవలం కొయ్యతిప్పుటే ముఖ్యముకాదు. చాకచక్యముతో అడుగులు వెయ్యాలి. కొయ్యను జాగ్రత్తగా తిప్పాలి. ఈ ఆట చూపరులను ఆనంద పరచుటేగాక పోటీలో ఆసక్తి కలిగిస్తుంది. ఇది ఆత్మరక్షణకు చాలా బాగా ఉపకరిస్తుంది.

## కబాడీ (చెడుగుడు)

ఈ చెడుగుడు ఆటలో రెండు జట్లు పాల్గొంటాయి. ఇందులో ఎక్కువ సేపు గుక్క పట్టడం ప్రాధాన్యత వహిస్తుంది.

## పచ్చై కుదిరై

ఈ ఆటలో ఒక అబ్బాయి గుర్రంలా వంగొని ఉంటాడు. అతని చేతులు పాదములను తాకుతుంటాయి. అతను గుర్రం ఆటగాళ్ళు ఒక్కొక్కడే పరుగెత్తుకొచ్చి గుర్రం మెడపైన చేతులుంచి అతని పైనించి గెంతాలి. గుర్రం పాత్ర వహించే అబ్బాయి కొద్దికొద్దిగా పైకిలేస్తూ గెంతేవాళ్ళకి శ్రమ కలిగిస్తాడు. అతను నిటారుగా నిలుచున్నప్పుడు గెంతే వాళ్ళకు చాలా కష్ట మవుతుంది. ఏ అబ్బాయి అయినా గుర్రం బండికి తగిలితే ఆ అబ్బాయి గుర్రం పాత్ర వహించవలసి వస్తుంది.

ఈ ఆటలోనే ఇంకొక పద్ధతి ఉంది. ఒకడు గుర్రంలా వంగుతాడు. వాడిపైన కూర్చున్న రౌతుతన చేతిలోని బంతిని దూరముగావున్న ఒక గుంట లోకి విసిరి వెయ్యాలి. అలా వెయ్యలేకపోతే అతను గుర్రముగా నటించ వలసి వస్తుంది.

## గిలితట్టు

ఇది క్రికెట్టులాంటి ఆట. దీనిని తెలుగులో బిల్లగోడాట అని అంటారు. ఇందులో ఒక పొడుగాటి కొయ్య ఒక బిల్ల ఉంటాయి. బిల్ల రెండువైపులా వాడిగా చెక్కబడి ఉంటుంది. ఆ బిల్లను క్రిందఉంచి పెద్దకొయ్యతో దానిని ఒక వైపునుంచి ఎగురవేసి కొట్టడం జరుగుతుంది, అవతలివ్యక్తి ఆ బిల్లను పట్టుకుంటే కొట్టినవాడు "ఔట్" అవుతాడు,

## నిలా పూచ్చి

ఇది మన వెన్నెల కుప్పలాట లాంటిది. రెండు జట్లు ఒకరినొకరు పట్టు కోవడానికి ప్రయత్నిస్తారు. చీకటిలోంచి వెన్నెలలోకి వచ్చినప్పుడు పొంచి వుండి పట్టుకోవాలి.

## నొండి

ఇది పిల్లలు ఒంటికాలుతో కుంటుకుంటూ ఆడుకునే ఆట. ఇందులో రెండు జట్లు ఉంటాయి. ఒక చదరము గీసి అందులో ఒక జట్టులోని ఒంటి కాలిపైన నిలబడతాడు. ఎదుటి జట్టులోని అబ్బాయిలు అందులోకి వచ్చినప్పుడు ఒంటికాలిపై గెంతుతూ వాళ్ళని పట్టుకోవడానికి ప్రయత్నిస్తాడు అతను రెండు కాళ్ళూ మోపితే "ఔట్" అయిపోతాడు. ఎక్కువసేపు ఒంటికాలిపైన నిలబడితే అవతలి జట్టు అబ్బాయిలు అతనిమీద ఇసుక చల్లుతూ విసిగిస్తారు.

## ఇతర క్రీడలు

గ్రామీణ ప్రజలు పని పాటలులేని సమయాల్లోనూ సాయంత్రంపూటలలోనూ ఏదో ఒక క్రీడలలో పాల్గొంటూ ఉంటారు. వాటిల్లో దాయం (పాచికలు), పల్లాంగుళి (అచ్చన గాయలు), కణ్ణా మూచ్చి (దాగుడుమూతలు) కిట్టి కొత్తాడి (గాలిపటం) కాగిత కప్పల్ (కాగిత పడవ) ఇంకా సినాడి (మల్ల యుద్ధము), వర్మానియం (నరములను పటిష్టము చేయుట) మొదలైనవి పేర్కొనదగినవి.

## గ్రామీణ క్రీడలలో పాటలు

కొన్ని ఆటలలో పల్లెపాటలు పాడుకోవడం అలవాటు. ఉదాహరణకు

ఒకతను కొంబార్రై కొంబార్రై (కొమ్ములున్న మృగాలు) అంటుంటే చిన్నపిల్లలు ఆ మాటల్ని మళ్ళీ పలుకుతారు. మళ్ళీ ఆ పెద్దాయన మాడుం కొంబార్రై, ఆడుం కొంబార్రై (పశువుకు కొమ్ములున్నాయి. మేకకూ కొమ్ములున్నాయి.) అంటూ కొమ్ములున్న మృగముల పేర్లను ఏకరువు పెడతాడు. పిల్లలు ఆ మాటలన్నిటినీ తిరగచెబుతూ ఉంటారు. మాటల సందర్భంలో ఆ వ్యక్తి ఏనుగునుకూడా కొమ్ములున్న మృగమనీ అంటాడు లేదా మనిషికూడా కొమ్ములున్న మృగమని అంటాడు. ఆలోచించకుండా ఈ మాటలను వల్లె వేసే పిల్లలు ఆటలోంచి "ఔట్" అయినట్టులెక్క.

## గ్రామీణ కళలు

గ్రామీణుల కళా నైపుణ్యమూ, నేర్పరితనమూ కాంచీపురంలో నేయబడే పట్టుచీరలలో బహిర్గతమవుతున్నవి. ఈ వృత్తి చేసేవారిలో ముఖ్యముగా సౌరాష్ట్రులు, మొదలియార్ జాతివాళ్ళు పేర్కొనదగును.

ఈ చేనేత వృత్తిలో ముతక ప్రత్తినుంచి నూలు వడకడం ఉండలు చుట్టడం, పడుగు వెయ్యడం లాంటి పనులన్నీ మనుషులే చేస్తారు. ఈ పనుల్లో ఇంట్లో వ్యక్తులందరూ-ఆడ మగా, పిల్లా జెల్లా ప్రతి ఒక్కరూ పాల్గొంటారు. ఈ వృత్తిలో మెల్బరీ పట్టు పోగులూ, బంగారు వన్నెకల జరీపోగులూ వాడతారు. ఈ వృత్తి ప్రాచీన పద్ధతిలోనే సాగుతున్నా నమూనాలలో మాత్రం నిరంతరం మార్పులు చేస్తూనే ఉన్నారు.

తమిళనాడులో అనేక గ్రామీణ కళలు అభివృద్ధి చెందినాయి. వారి నేర్పరితనమూ, సామర్థ్యమూ మెచ్చుకోదగినవి.

వాటిలో మట్టిబొమ్మలు, ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన కాంస్యవిగ్రహములు, తంజావూరు ములాము పూతపనులు, రకరకాల లోహదీపములు, దేవాలయ

పతాకములు, చాపల తయారీ, తివాచీ నేత-మున్నగునవి కొన్ని ముఖ్యమైన గ్రామీణవృత్తులు, చెట్టినాడులోని గచ్చువేయు పద్ధతి తాపీపనిలోని నేర్పరితన మునకు తార్కాణము. అందులో పగుళ్ళురావు; గోడలు అద్దాలవలె మెరు స్తాయి. వాటికి సున్నము కొట్టే అవసరములేదు.

## మట్టి పాత్రలు

మట్టి పాత్రల వృత్తి తమిళనాడులోని గ్రామీణ ప్రాంతములలో నేటికిని వాడుకలో వున్నది. మానా మధురైలోని నల్లపాత్రలు, ఎఱ్ఱపాత్రలు, తరిగి రిలో తయారయ్యే మెరుగు పెట్టబడిన పాత్రలు, అందములోనూ, ఆకారము లోనూ, రంగులలోనూ వాసికెక్కాయి. అంతర్జాతీయ వస్తు ప్రదర్శనశాలల్లో సైతము అవి మన్ననలు పొందాయి.

కుమ్మరి చేతివేళ్ళు మట్టిచక్రముపైన అన్నిరకాలపాత్రలను సృష్టించగలదు. కాని మట్టి విగ్రహాములు చేయవలసి వచ్చినప్పుడు పోతవిధానము అవలంభి స్తారు. కొన్ని బొమ్మలను కాలుస్తారు. కొన్నిటిని ఎండబెట్టి అలాగే రంగులు పూస్తారు. గ్రామ దేవతగా ప్రసిద్ధి వహించే అయ్యనార్ విగ్రహ ములంటే విదేశములలో ఎంతో మోజువుంది. విదేశీయుల గిరాకీలను దృష్టిలో ఉంచుకుని ప్రత్యేకమైన మట్టితో అనువైన సైజులో బొమ్మలు తయారు చేస్తారు. ఈ బొమ్మల తయారీకి పనికివచ్చే బంకమట్టిలో కొన్ని లోపములున్నవి. ఈ బొమ్మలు పెళుసుగ వుండటంవల్ల సులభంగా విరిగి పోతాయి. వీటిని ప్యాక్‌చేసి దూర ప్రాంతములకు పంపడం కష్టం. ఎంతో జాగ్రత్తగా ప్యాకింగ్ చేయవలసి రావడం అటుంచి దానికిచాలా ఖర్చవుతుంది.

## కాగితపు బొమ్మలు

పై కారణములవల్ల ఇప్పుడు ఈ చేతి పనివాళ్ళు పెద్ద బొమ్మలు చేయ

వలసి వస్తే కాగితం గుజ్జు ఉపయోగిస్తున్నారు. ఇదికూడా పాత పద్ధతి ద్వారానే సాగుతుంది. ఈ గుజ్జు బొమ్మలు కావలసిన ఆకృతిలో తయారు కావడమేకాక అనువైన రంగులు పూసేందుకు వీలుగా ఉంటుంది. ఈ బొమ్మలలో కొన్నిరకములు చూపరులకు నల్లరాతి శిల్పములవలెనూ లోహపు పోతల వలెనూ కనిపిస్తాయి. పైగా ఈ బొమ్మలు తేలికగా ఉండటంవల్ల ప్యాకింగ్ మరియు రవాణా చెయ్యడంసులభం నిజానికి ఈ కాగితపు బొమ్మలు అనేక రకములుగా తయారు చేయబడుతున్నాయి. షోకేసులో వున్న కాగితంతో చెయ్యబడిన అల్సేషియన్ కుక్క ఎంతసహజంగా ఉంటుందంటే బయటనుంచి ఈబొమ్మను చూసే కుక్కలు ఇది అసలు కుక్క అనుకుని మొరగటం కూడా కద్దు. ఈ కుక్కబొమ్మ రంగూ, బయటకి వేలాడు తున్నట్టు కనిపించే ఎఱ్ఱటి నాలుకా, గుండ్రటి కళ్ళూ సహజంగా కనిపించే కనురెప్పలూ-అందర్నీ ఆకట్టుకుంటాయి. ఈ కాగితపు బొమ్మలలో నాట్య కత్తె, గీతోపదేశం చేస్తున్న శ్రీకృష్ణుడు మీనాక్షి కల్యాణ ఉత్సవమూ మొదలైన ఘట్టములను అందంగా మలుస్తారు.

సూక్ష్మమైన ఆకారనిర్మాణమునకు ప్యారిస్ ప్లాష్టర్ పని అనువైనది. దీనితో చెయ్యబడిన అతి తెల్లటి "మీరా" బొమ్మ ఎంతో అద్భుతంగా ఉంటుంది. పార్వతీ పరమేశ్వరుల బొమ్మకూడా బాగా వాసికెక్కినది. బంక మట్టితోనూ, కాగితపు గుజ్జుతోనూ సాధ్యపడని మృదుత్వమూ విస్పష్టతా దీనితో సాధ్యమవుతుంది.

## కొయ్య బొమ్మలు

దుకాణములలో అసంఖ్యాకములయిన కొయ్య బొమ్మలు పేర్చబడి ఉంటాయి. వాటిలో చాలావరకు లేత్ మిషన్లపైన తయారవుతాయి. ఈ బొమ్మల తయారీలో వినియోగింపబడే కలప మెత్తగాను, మన్నిక కలదిగాను ఉంటుంది. ఈ బొమ్మలతో స్ప్రింగ్ మున్నగువాటిని అమర్చి వీనిని

సజీవముగాను చైతన్యవంతముగానూ అగుపించేటట్లు తయారుచేస్తారు. ఈ కొయ్య బొమ్మలలో చిన్నపిల్లలకు అంకెలు ఆకారములు రంగులు, చిత్రపటములు మరియు రేఖా గణితము నేర్పుటకు పనికి వచ్చే నమూనాలు కూడా ఉంటాయి.

మనోహరమైన రూపములలో స్త్రీ పురుషుల భంగిమలను వెలువరించడంలో గుడ్డపీలికలతో తయారైనబొమ్మలు అత్యున్నతమైనవి. ఈ గుడ్డపీలిక బొమ్మల లోపల భాగములు కాగితపు గుజ్జుతో తయారవుతాయి. ఈ బొమ్మలకు ముఖములు చేయుటలో ఎంతో ఓర్పు, నేర్పు, చూపిస్తారు. ఇవికూడా తొలుత పోతపోయబడి తర్వాత చేతితో మెరుగులు దిద్దబడతాయి. రకరకాల ఫ్యాషన్‌లలో ఈ బొమ్మలకు దుస్తులు అలంకరిస్తారు. ఒకబల్లపైన వరసగా పేర్చబడిన ఈ బొమ్మల్ని పరిశీలిస్తే నేడు శిరోజాలంకరణలో వున్న వివిధ రీతులు మనకు తెలుస్తాయి. ఈగుడ్డ బొమ్మలలోని అందమంతా వాటిముఖముల అమరికలోనూ శిరోజాలంకరణలోనూ, దుస్తులలోను, భంగిమలలోనూ-ఇమిడి ఉంటుంది. ఏదైనా ఒక ప్రాంతములోని ప్రజలకు నమూనా బొమ్మలు చేయాలనుకుంటే ఈ గుడ్డపీలికల పద్ధతినే వాడుతారు. ఈ బొమ్మలను గాజు పెట్టెలలోఉంచడం వల్ల వాటిఅందం ఇనుమడించడమేకాకుండా అవి దుమ్ము ధూళినుంచి రక్షింపబడి శుభ్రంగా ఉంటాయి.

## కొయ్య చెక్కడము

తమిళనాడులో బాగా అభివృద్ధి అయిన మరోచేతి వృత్తి కొయ్యల నగిషీ- దేవాలయపు తలుపులపైన కనిపించే చెక్కడములుచూస్తే ఆనాటి వడ్రంగుల పనితనము మనకు తెలిసివస్తుంది. వారు ఎంతో సంక్లిష్టమైన నమూనాలను సైతం చెక్కగలిగారు. తర్వాత కాలంలో ఈ కళకు చెట్టినాడులో మంచి ప్రోత్సాహం లభించినది. చెట్టినాడు జాతి ఇళ్ళలో తలుపులు చెక్కడం పనితనముతో కూడి ఉంటాయి.

చేవలపై నగిషీ చెక్కడము, శంఖపు నగిషీ జంతువులకొమ్ములపై నగిషీ మున్నగు గ్రామకళలు కూడా పేర్కొనదగినవే. ఈ వృత్తులతో జీవిస్తున్న కళాకారులు చాలామంది ఉన్నారు. వారు కాలానుగుణంగా తమ వస్తువులను ఆధునిక పోకడలకు తగినట్లు తయారుచేస్తూ తమ వస్తువులలో కళానైపుణ్యముతో బాటు బహుళ ప్రయోజనము ఉండేటట్లు చూస్తున్నారు. సామాన్య ప్రజలు జరుపుకునే పండుగలూ పబ్బాలూ, ఈ చేతి వృత్తులకు జీవనాధారములు. ఈ చేతివృత్తులను పరిరక్షించుటలో ప్రభుత్వముకూడా తగినంత శ్రద్ధ చూపుతున్నది.

తమిళనాడులోని దేవాలములలోనూ కొన్ని కొన్ని భవంతులలోనూ కళాత్మకంగా చెక్కబడిన తలుపులూ, దూలములూ అమర్చివున్నాయి. అలాగే ఏనుగు ఆకృతితో చెక్కబడిన కాళ్ళున్న నల్లకొయ్య బల్లలు కూడా తమిళదేశంలో ఎక్కువగా వాడుకలో వున్నాయి. దేవాలయములలోని రథములు అందములోనూ కళా నైపుణ్యములోనూ అత్యంత ప్రసిద్ధిగాంచాయి.

తమిళనాడులో తయారయ్యే పట్టమదై చాపలు ప్రపంచ ప్రఖ్యాతిగాంచాయి. ఇవి ఒక ప్రత్యేక జాతికి చెందిన సన్నని గడ్డితోనూ పట్టు మరియు నూలు దారముతోనూ నేయబడతాయి. దాని ఉపరితలము ఎంతో అందంగా ఉంటుంది. ఈ చాపను మడచి చేతిలో రుమాలులా తీసికొని వెళ్ళవచ్చును.

## లోహ సామాగ్రి

తమిళనాడులోని చేతిపనులవారు లోహముల సామగ్రి తయారుచేయుటలోనూ దిట్టలే. కుత్తు విళక్కు (దీపపు సెమ్మె) మొదలుకొని నటరాజ మరియు గణేశ విగ్రహముల దాకా అన్నిట్లోను అనన్య సామాన్యమైన కళానైపుణ్యము నిండి వుంటుంది. దేవాలయ సంప్రదాయములకు అనుగుణంగా వివిధ రీతులలో వందలాది దీపములు చేయబడి వున్నాయి. తమిళనాడులోని కాంస్య విగ్రహములు విశ్వ విఖ్యాతములు.

నల్లరాతి విగ్రహములలో శిల్పులు చూపిన పనితనము అసాధారణమైనది. ప్రతిభావంతులైన శిల్పులు తమిళనాడులో విస్తారముగా ఉండుటవల్లనేమో ఎక్కడ చూసినా గుళ్ళూ గోపురాలు కనిపిస్తాయి. వేలకొలది శిల్పుల కృషి ఫలితంగా ఏర్పడిన దేవాలయ శిల్పములు నేటికిని వారి గొప్పతనమును పట్టి చాటుతున్నాయి. దేవాలయ శిల్పులు వివిధ శాస్త్రములను ఆకళించుకుని శిలల గుణములనెరిగి ఎంతో ఓపికతో ఈ శిల్ప సంపదను నెలకొల్పారు.

## ఇతర గ్రామీణ వృత్తులు

గడ్డిపోచలతోను, గంధపు పుల్లలతోను మాలలు కట్టుట, చేవకాయ్యపైన నగిషీ చెక్కుట, మున్నగు చేతి వృత్తులెన్నో వున్నాయి. తిరనాళ్ళకు పందిరి వేసి అలంకరణలు చెయ్యడంలో తంజావూరు కళాకారులు పేరు ప్రఖ్యాతులు గడించారు.

క్లుప్తముగా చెప్పవలెనంటే తమిళనాడు గ్రామీణ కళలకు పూర్వమునుంచి నేటి వరకు ఆలవాలమైనిలచినది. ఈ ప్రాచీన కళలను కాపాడవలసిన భాధ్యత ప్రతి ఒక్కరిపైననూ ఉన్నది.

## అను బంధము

వ్యావహారిక సాహిత్యము నుంచి కొన్ని ఉదాహరణలు.

### పాటలు

సంతపాట:— ఇదొక వింతపాట ఒకస్త్రీ ఒక పైసాతీసుకుని సంత కెళ్ళిందట. అక్కడ ఆమె అనేక వంటపాత్రలు కొన్నా, చివరికి అర్థపైసా మిగిలిందట.

ఒరుకాసు కొండు కిట్టు
కణ్ణన్ కడైక్కు పోనాళాం
అంద పానై ఎడుత్తాళాం
అడుక్కు పాత్తిరం ఎడుత్తాళం
గుండా చట్టి ఎదుత్తాళాం
చిన్న పట్టిల్ ఎదుత్తాళాం
చిప్పిలి తట్టుం ఎదుత్తాళాం
ఎల్లాం కూట్టి కణక్కు పాక్క
అరక్కాసు మిచ్చమిరుక్కాదు.

2) మాప్పిళ్లై కులావై:—ఇది బావా బావా పన్నీరు పాటలాంటిది. కన్నెపిల్లలు పెళ్లిళ్లలో పెళ్లికొడుక్కి స్వాగతమిస్తూ ఈపాటను పాడుతారు. మదపుటేనుగు సైతం కన్నెపిల్లలు స్వాగతమిస్తే మచ్చిక అవుతుందని భావం:-

ఆనై ఎంద్రాల్ ఆనై ఆరుబడి ఆనై
ఆలమరత్తిల్ కట్టినాల్ నిర్కాదాం అంద ఆనై
అరస మరత్తిల్ కట్టినాల్ నిర్కాదాం అంద ఆనై
పుంగ మరత్తిల్ కట్టినాల్ నిర్కాదాం అంద ఆనై

పుళియ మరత్తిల్ కట్టినాల్ నిర్కాదాం అంద ఆనై
పళ్ళి విరలై కాట్టినాల్ నిర్కుమాం అంద ఆనై
ఎన్తోళి పెముగళా ఎడుంగడి కులావై కాలై.

3) విజ్ఞాన పురోభివృద్ధి:— ఈ పాట విద్యుచ్ఛక్తి మరియు ఇతర ఆధునిక సాధనములను గురించి తెల్లవాళ్ళను మెచ్చుకుంటూ పాడేది.

సీలగిరి ఓరత్తిలే
సీట్టి విట్టాన్ కాంత కంబి
తోట్టా పుదిక్కాదడి తుడికారన్ పోట్టుకంబి
కోనూసిపోల కోయంబత్తూర్ జిల్లాకంబి
కొళ్లైవణం సిలవళిచ్చి కొందువందాన్ సెంబటిక్కే
కోనూసిపోల కోయంబత్తూర్ జిల్లా కంబి
పచ్చైతణ్ణీ కరందుకలాం పరదిల్లో సూట్రియంగ్
మళయాళం పోరతణ్ణి మధురై వందు సేర వేణుం
సిందయిలే తానినైందు తిరుప్పి విట్టూన్ కుంపిణీ యాన్
ఆదుదడి వర్కుషాప్పు అరైక్కుదడి సుంణ్ణాంచై
ఎదుక్కుదాడి మేనితాంగ ఎణ్ణత్తొలయామె
సీమై ఇరుంబెడుత్తు సిమిక్పోల రోత్తైసెయ్దు,
అదాత్తా సూచ్చియత్తై ఆట్టివచ్చాన్ లోగన్దురై
అక్కరైక్కుం ఇక్కరైక్కుం అళగానతంది పోట్టు
తందిమేలే పోరారాం ధరుమదురై లోగనుమ్,
కాంకిరేట్టు కల్లుదైక్క కరుమనిసన్ ఆగాదుణ్ను
ఆకాస వేట్టైలుప్ప అనుప్పివచ్చాన్ లోగదురై

(4) అభిమన్నన్ సుందరిమాలై (అభిమన్యుడి వరుడుగా వర్ణింపబడుట.)

పందలిలే వందునిణ్ణు పరముడి మన్నవరుం
అరసాణి మున్బాగ అభిమానం సుంధరియుం

మణ్డై మేలే ఉట్కారుందు వనభీమన్ దేవియుడన్
ఆనొదురు వేడియర్గళ అళ్లియ్ శేప్పై యిట్టార్
అభిమానుం సుందరియుం అరసాణి సుత్తివందార్
అరసాణి సుత్తివందు అరణ్ మన్నై యినుళ్ పుగుందు
వళిగ్గై పాయ్మీదు పరిందే ఉట్కారందాల్గళ్

## అరువడై పాట (పైరు నాటడం)

సంబా విడై పొట్టు, సరియాన నాత్తు విట్టు
బంబాయి సీలై కారి పక్కవమా నట్టు వాడి
మణ్వెట్టి తోళిలిట్టు మడై తిరక్క పోరవరె
మడమై తిరందు విడు మంగయర్గళ్ నాత్తునడ.
నాత్తరిచ్చు నానరియేన్ నడమ్నట్టు నానరియేన్
సేత్తుకుళ్లే ఇరంగి కిట్టు సెల్లముగం వాడురేనే
నట్టనడవు ఇరుక్క నాలుపక్కం తొళి కిడక్క
నాత్తరిక్క తెరియామె నడక్కలామో రోట్టుపళి
ఉళదు తొళికలక్కి ఒణ్ణరెండా నాత్తరిచ్చు
పళదు పదామ లింగు పక్కవమా నట్టునాంగ
ఉళ్లాన్ ఉళదు వర ఊర్కులని నాత్తరిక్క
నారై పరంబఆక్క నట్టు వాడి కుట్టు పుళ్ళే.

## (6) తాలాట్టు (జోల పాట)

ఆరడిత్తార్ ఏన్ అళదాయ్
అడిత్తారై సొల్లి అళ
కాంబుక్కనియే

కొత్తు పదా మాంగనియే
వంబుక్కు అళు దాయో
వాయెల్లాం పాల్ వళియ
మామన్ అడిత్తానో
మల్లిగై పూ చెందాలే?
అత్తయ్ అడిత్తాళో అల్లిమలర్ చెందాలే
పాట్టి ఆడిత్తాలో పాల్ ఊట్రుంకైయాలే
అణ్ణన్ అడిత్తానో అళుగిరదై పార్పదర్కు.
అడిత్తారై సొల్లి అళు ఆగ్గినైగళ్ పణ్ణిపైపోవ్వం
తొట్టారై సొల్లి అళు తోళవిలంగు పోట్టు పైపోవ్వత
ఆరుం అడిక్కవిల్లై ఐవిరలాం తీండవిల్లై
తానాయ్ అళుగిరాన్ తాయార్ మడి వేది.

## (7) ఏరో ప్లేను పాట

వైక్కా పడుప్పు పోల
పరుగు ద దిఏరో ప్లేన్
పరక్కుం నద్దం కేట్టఉదన్
పదరు దది ఎన్ మనసు.
పత్తు మయిల్ దూరత్తిలే
పరక్కు దడి ఏరో ప్లేన్
సెత్తా పిళ్లై ప్పానో - ఇంద
సీమయ్ వెళ్ళయ్ కారన్ మగన్

## (8) పాప్పా పాట్టు (పిల్లల పాట్టు)

(i) ఆన్నై వందదాం తోప్పిలే

అలయ పళుత్తదాం మాంబళం
కుదిరై వందదాం తోప్పిలే
కులుంగ పళుత్తదాం మాంబళం.

(iii) కుట్టి యానైక్కు కొంబు ముళైబ్బదాం
పట్టణం ఎల్లాం పార్క్క వాంగో

(iii) సుందన్ సుందన్ విరల్
చిన్న విరల్ సింగార విరల్
ఓమ విరల్ ఒన్ బదు విరల్
పత్తు విరల్ పరుప్పుకడై, పరుప్పుకడై
అణ్ణనుక్కు కొంజం!
అక్కాళుక్కు కొంజం!

## 9) విల్లు పాట్టు

(i) విల్లై వళైచ్చు
అంబై మాట్టునా
సొల్లుం సెయలాగుం-తాబి
సొల్లుం సెయలాగుం-అణ్ణీ.

(ii) ఇండియా తుణై ఖందత్తిలే
తెన్ కోడియుళ్ళ-అమాం
తెన్ కోడియుళ్ళ
చందన పొదిగై మలయిలే
వళర్న్దద తమిళ్-ఆమా
వళర్న్దద తమిళ్.
తంధనత్తోం ఎణ్ణుం ఓసైయిల్

విల్లినిల్ పాడ-అమా
విల్లినిల్ పాడ
వందిడుగ వందిడుగ లే
వణక్కు ముంగ-అమా
వణక్కు ముంగ.

## 10) వాన పాట

వాన పసందుగా కురిసేను అమ్మా
ఈ నేల పచ్చగ చిగురించేను-వాన కురిసేను
సూదిమొనలా మెరుస్తూ.
గ్రామం పచ్చగా చిగురించేను-వానకురిసేను
గవ్వలా మెరుస్తూ.
అడవులన్ని పచ్చగా చిగురించేను వానకురిసేను
గ్రామం నీట మునిగేదాకా వానకురిసేను
అమ్మా తిరిగీ తిరిగీ వాన కురిసేను
జగమంత వాన కురిసేను-అమ్మా
సంపదల వాన కురిసేను
పసందుగా కురిసేను.

## గువ్వ పాట

అక్కుత్తి అనబడే ఒక గువ్వను గురించిన పాట ఈ క్రింది విధంగా సాగుతుంది.

ఓ అక్కుత్తి పక్షీ!
ఓ అక్కుత్తి పక్షీ!
నువ్వు ఎక్కడ
పెడతావు గుడ్లు?

దట్టమైన అడవిలో
శిఖ రాగ్రమున చిన్న రాతి క్రింద
పెడతాను నేను గ్రుడ్లు!

గుడ్లు పొదిగి ముచ్చటగా
మూడు పిల్లలు పెట్టాను-
మొదటి పిల్ల మేత కోసరం
మూడు కోసులదూరంవెళ్లాను
నడిమి పిల్ల మేత కోసరం
నాలుగు కోసుల దూరంవెళ్ళాను
మూడో పిల్ల మేత కోసరం
ఎంతో దూరం వెళ్లాను.

వేట కోసరం వచ్చిన
క్రూరుడైన ధాకలి
వల పన్నాడు
నా కాళ్ళు వలలో తగులుకుపోయాయి.
రెక్కలల్లార్చుకుని భోరు భోరున ఏడ్చాను.
నా కన్నీటి ప్రవాహములు
నాలుగు కోసుల దూరం దాటాయి.

## వృత్తాంతము:—

మీనాక్షీ దేవి పాండ్యరాజు పుత్రిక అని చెప్పబడుతుంది. ఆ కథ ఏమి టంటే పూర్వము మలయ ధ్వజుడనే పాండ్య రాజు రాజ్యము చేసుండేవాడు. అతని రాణిపేరు కాంచనమాల. ఆ దంపతులు తొంబై తొమ్మిది యజ్ఞములు చేశారట. వాళ్లు నూరవ యజ్ఞము చేస్తున్నప్పుడు ఇంద్రుడు ప్రత్యక్షమై వారి యజ్ఞమును మానుకోవలసిందిగా కోరుకున్నాడట. వారు అలాగే మానుకున్నారుట. చివరికి రాజు కోరిక ఫలించి అతనికి మీనాక్షి జన్మించిందట

## పొడుపు కథలు

(1) ఎల్లయిల్లాద వావత్తిలే
ఎణ్ణ ముడియాద ఆరుగళ్
(అంతులేని ఆకాసంలో లెక్కలేనన్ని పూలు-నక్షత్రాలు)

(2) కణక్కిల్లాద పిళ్ళైయ్ గళై
కళుత్తయ్ చుట్రి సుమక్కుంతాయ్.
అందత్తాయ్ వందత్తాయ్?
(ఒకతల్లి తనమీద చుట్టూ అసంఖ్యాసములైన
పిల్లల్ని మోస్తున్నది - ఆమె ఎవరు? - కొబ్బరిచెట్టు)

(3) చిన్న కుగై క్కుళ్ళే సిగప్పుత్తుండి - అదు
ఎన్నేరముం ఈరం ఎళిదిల్ ఉలరాదు.
(ఒక చిన్న గుహలోనున్న ఎఱ్ఱని గుడ్డపీలిక
ఎల్లప్పుడూ తడిగా ఉంటుంది — నోటిలో నాలుక)

(4) ఇంగుండు అంగిల్లై
అంగుండు ఇంగిల్లై
ఇంగుం ఉండు, అంగుం ఉండు
ఇంగుం ఇల్లై, అంగుం ఇల్లై
(ఇదివేదాంత ధోరణిలో సాగే పొడుపుకథ)

స్వార్థపరుడు ఇహంలో సుఖపడవచ్చు కాని పరలోకంలో సుఖ పడలేదు. ధర్మగుణముగలవాడు ఇక్కడ కష్టపడేది పైలోకంలో సుఖిస్తాడు. ధర్మ గుణమూ వ్యక్తిత్వవర్తన గలవాడు రెండులోకాల్లోను సుఖిస్తాడు. దుష్టుడు ఎక్కడా సుఖించడని భావము)

(5) ఎన్ తాయో కడల్ తందయో సూరియన్
ఎన్నై విరుంబి పర్క్కాద పేడు ఇల్లై
వాన్ యార్?

(సముద్రమూ సూర్యుడూ నాకు తల్లిదండ్రులు. నేను అన్ని ఇళ్ళలోనూ ఉంటాను. నేనెవర్ని — ఉప్పు)

(6) ఉలగుక్కు ఎల్లాం ఒకే దుప్పటి?
(ప్రపంచానికంతా ఒకే కంబళి — ఆకాశం)

(7) డాక్టర్ వందార్ ఊసి పోట్టార్
పణం వాంగామల్ పోనార్. అదు ఎన్న?
(డాక్టర్ వచ్చి సూదివేసి డబ్బు తీసుకోకుండా
వెళ్లాడు. ఎవరతను? — తేలు)

(8) వెళ్ళై కారనుక్కు కరుప్పు తొప్పి
తెల్లదొరకు నల్లటోపి — అగ్గిపుల్ల)

(9) ఉరువం ఇల్లాద మనిదన్
ఉలగం ఎల్లాం సుట్రుగిరాన్ - అవన్ యార్?
(రూపంలేని మనిషి ప్రపంచమంతా తిరుగు
తాడు ఎవరతను? గాలి)

(10) ఎత్తనై పేర్ ఏరి నాలుం
ఓడామల్ తాంగుం కుదిరై ఎదు?
(ఎందరు ఎక్కినా కదలకుండా భరించే
గుర్రం ఏదీ? — అరుగు)

(11) కాశియిల్ ఇరుందు కలకత్తా వరై అసైయామల్ పోవదు
ఏదు?
కాశీ నుంచి కలకత్తాదాకా కదలకుండా వెళ్ళేది ఏది?
రహదారి)

(12) కై ఇరండయుం అడవైక్కుం
కండల్ ఎల్లాం కొట్టివైక్కుం

(రెండు చేతుల్ని కదిలిస్తుంది. గుడ్డ పీలికల్ని కలుపు తుంది— కుట్టు సూది)

(13) నడక్క ముడియాదు - ఆనాల్
(నక్గరామల్ ఇరుక్కాదు - అదుఎదు?
(నడవలేక పోయినా కదులుతూ ఉంటుంది—గడియారం)

(14) పార్తాల్ పార్క్కుం చిరిత్తాల్ చిరుక్కుం
కుత్తినాల్ పిలక్కుం — అదుఎన్న?
చూస్తే చూస్తుంది. నవ్వితే నవ్వుతుంది.
కాని పొడిస్తే చిటిపోతుంది — ఏమిటది? అద్దం)

## (పిల్లల మెదడుకు మేత

రెండు బస్తాల వడ్లలోంచి ఎన్ని బస్తాలబియ్యం వస్తుంది? — ఒక బస్తా

ఇరవై శేర్ల వడ్లలోంచి — పది శేర్ల బియ్యం

ఐదు వందల వడ్లగింజల్లోంచి? రెండు వందలయాభై బియ్యపుగింజలు

చివరి సమాధానము తప్పు. ఐదు వందల వడ్ల గింజలలోంచి ఐదు వందల బియ్యపుగింజలు వస్తాయి.

ఎండలో ఆరబెట్టితే ఒక షర్టు రెండు నిమిషాల్లో తడారుతుంది. మూడు షర్టులు తడారడానికి ఎంత సమయం పడుతుంది? - రెండు నిముషాలు

పిల్లలకోసం కన్యా కుమారి జిల్లాలో వాడుకలోనున్న ఒక మెదడుకుమేత:-

మానిటర్ (తరగతి పెద్ద)
కొంబారై కొంబారై (కొమ్ములున్న జంతువు)
పిల్లలు:- కొంబారై కొంబారై
మానిటర్:- మాడుం కొంబారై

పిల్లలు:- మాడుం కొంబారై
మానిటర్:- ఆడుం కొంబారై
పిల్లలు:- ఆడుం కొంబారై
మానిటర్:- ఆనై కొంబారై

కొందరు పిల్లలు అజాగ్రత్తవల్ల ఆనై కొంబారై అని వల్లిస్తారు. అంటే ఏనుగుకు కొమ్ములున్నాయని అర్థం. కాని అదితప్పు. అలాతప్పు సమాధానం చెప్పిన పిల్లలు ఆటలోంచి "ఔట్" అవుతారు.

## సామెతలు

(1) గ్రామీణ కళలగురించి

ఆడత్తెరియాడ తేవడియాళ్ తెరుకోణల్ ఎంగ్రాళాం (ఆడలేనమ్మ మద్దెలపై పడి ఏడ్చిందట)

ఒరునాళ్ కూత్తుక్కు మీసయై సిరైక్కలామా?
(ఒక్కరోజు వేషంకోసం మీసాలు తీసెయ్య వచ్చునా?

కళైక్కూత్తు ఆదినాలుం కాసుక్కు కీళేదాన్ వరవేందుం.
(గారడీ చేసినా కాసులు తీసుకోవడానికి నేల మీదికి దిగక తప్పదు)

## వైద్యము గురించి

(అ) మరుందుం విరుందుం మూణు నాళ్
(మందులు పుచ్చుకోడాని కయినా విందులు తినడాని కయినా మూడు రోజులే నియమం)

(ఆ) సుక్కుక్కు మేల్ మరుందుం ఇల్లై, సుబ్రమణ్యరుక్కు మేల్ దైవముం ఇల్లై

## (3) దయ్యముల గురించి

మరుండవన్ కణ్ణుక్కు ఇరుండ దెల్లాం పేయ్ (భీతిల్లిన వాడికి చీకట్లో నల్లగా కనిపించేదంతా దయ్యంలా ఉంటుంది)

## (4) వాన గురించి

(అ) మాలై సెవ్వానం మళైక్కు అరిగురి (సాయంత్రం కాద్రు వేస్తే వాన వస్తుందని సంకేతం)

(ఆ) కాలై సెవ్వానం కళుదై పురళుం (ఉదయం కాద్రు వేస్తే వాన రాదు. గాడిదలు పొర్లుతాయి)

## (5) ఇతర సామెతలు

(అ) మయిరుళ్ళ సీమాట్టి అళ్ళియుం ముదియలాం అవృత్తుం విడలాం (నిడివి అయిన శిరోజములున్న ఆడది కొప్పు వేసుకున్నా విర బోసుకున్నా అందంగానే ఉంటుంది)

(ఆ) చీలై ఇల్లయ్ ఎంద్రు చిన్నాత్తాళ్ పీట్టుక్కు పోనాళాం అవళ్ ఈచ్చం పాయై కట్టిక్కొండు ఎదిరిల్ వందాళాం. (చీర లేదని చిన్నమ్మ ఇంటికెడితే - ఆవిడ ఈత చాపను చుట్టుకుని ఎదురు వచ్చిందట)

(ఇ) కప్పల్ కవిందాలుం కన్నత్తిల్ కై వైక్కాదే ఓడ మునిగి పోయినా ధైర్యం కోల్పోకూడదు)

(ఈ) తొండు అయిరం పుళిఆయిరం
(చింత మానులో వేయి తొర్రలున్నట్టే అది మనకు వేలలో ఇస్తుంది )

(ఉ) వళ్లామైక్కుం వెళ్ళామ్మక్కుం జన్మ పగై
పైరుకూ మేకలకూ సరిపడదు)

## తెరుక్కూత్తు

(వీధి నాటకంలో ఒక ఘట్టము)

కొత్త దంపతుల మధ్య సంవాదము:-

భర్త పనిమీద కోయంబత్తూర్‌కు ఎడ్లబండి కట్టుకుని బయలుదేరుతాడు. భార్య అతనికి వీడ్కోలిస్తూ కనకు కావలసిన వస్తువులనన్నిటినీ ఏకరువు పెడుతుంది. అతను అవన్నీ కొని తెస్తానని ఆవిడకు ప్రియమైన పువ్వులు ఇతర వస్తువులూ తెస్తానని మాట ఇస్తాడు.

అతను:- కరిమయిలై రాక్కై పొణ్ణు పూంగియిలే కట్టినేండి వండియిలే
పొణ్ణు పూంగుయిలే పాదై కిదు కిదుంగ పొణ్ణు పూంగియిలే
పోయివరేన కోయంబత్తూర్ పొణ్ణు పూంగుయిలే

ఆమె.- సొగ మాగ పోయివాంగో పొన్ను మచ్చానే సివప్పు సీలై
వాంగి వాంగో పొన్ను మచ్చానే వళిక్కు తుణైక్కూట్టిపొరంగ
పొన్ను మచ్చానే! మరి కొళందు వాంగి వాంగో పొన్ను
మచ్చానే!

అతను:- పట్టు పుడవై వాంగి వరేన్ పొణ్ణు పూంగుయిలే కట్టి పాత్తాల్
నల్లా ఇదుక్కుం పొణ్ణు పూంగుయిలే రోజా పూవుం వాంగి
వరేన్ పొణ్ణు పూంగుయిలే రొంబ ఉనక్కు నల్లారుక్కుం
పొణ్ణు పూంగుయిలే.